# ఆంధ్ర గ్రంథమాల పుస్తకముల పట్టిక

---

| | |
|---|---|
| ఆంధ్రవిజ్ఞానసర్వస్వము (2 సంపుటములు) సంపు. 1 కి | రు. 10-0-0 |
| శ్రీ మహాఋషినిఘంటిత యోగశాస్త్రము—కా. సూర్యనారాయణయోగిని ... | 5-0-0 |
| భగవద్గీత (సంస్కృ.)—బె. రామారావుగారి వ్యాఖ్యానముతో 1, 2, 3 సంపు॥లు మాత్రమేఉన్నవి. సంపు. 1 కి ... | 1-8-0 |
| శతకకవులచరిత్ర—వం. సుబ్బారావుగారు ... | 1-8-0 |
| పారిభాషికపదకోశము (ఇంగ్లీషులోని శాస్త్రీయపదముల తెలుగుపదముల నిఘంటువు) ... | 1-4-0 |
| ఆంధ్రవాఙ్మయసూచిక (ముద్రితాముద్రితగ్రంథములపట్టిక) | 1-0-0 |
| శ్యామసుందరము—ఒం. సత్యనాథముగారు ... | 1-0-0 |
| జీవనప్రభాతము (న.)—కె. యన్. వెంకటరమణిగారు ... | 1-0-0 |
| భీష్ముడు (నాటకము)—పో. పిచ్చిరెడ్డిగారు ... | 1-0-0 |
| అవిమారకము (నాటకము)—మానపల్లి రామకృష్ణకవిగారు | 0-10-0 |
| కృషీవలవిజయము ... | 0-8-0 |
| వివాహతత్వము—బం. మల్లయ్యశాస్త్రిగారు ... | 0-8-0 |
| నిరుద్ధభారతము—మం. వెంకటశర్మగారు ... | 0-8-0 |
| శ్రీరామవిజయము (నాటకము) ... | 0-8-0 |
| ఆరోగ్యసాధనము— గాంధీమహాత్ముడు ... | 0-8-0 |
| గీతాబోధ— , ... | 0-4-0 |
| ప్రార్థనగీతావళి ... | 0-4-0 |
| హాలికోద్ధారము—(ప్ర) శేషాద్రిశర్మగారు ... | రు. 0-4-0 |
| మానవస్వత్వములు—థామస్ పెయిన్ ... | 0-4-0 |
| హిందీతెలుగు బాలశిక్ష—పం. ఆ. శాస్త్రిగారు ... | 0-6-0 |
| ,, మొదటివాచకం ... | 0.6-0 |

---

మేనేజరు, ఆంధ్రగ్రంథమాల,

7, తంబుశెట్టివీధి - - - జి. టి., మద్రాసు,

# "హెచ్.ఎం.వి"  రికార్డులలో వీరిని వినండి



మాస్టర్ రాజేశ్వరరావు

మాస్టర్ ఎస్. రాజేశ్వరరావు

N. 18765
చల్ల గాలిలో
కలగంటి

మాస్టర్ రాజేశ్వరరావు &
శ్రీమతి బాల సరస్వతి

N. 18758
తుమ్మెదా
కోపమేల

శ్రీమతి బి. రాజరత్నం &
శ్రీ పి. సూరిబాబు

N. 18742
నందకిశోర
రామనామ భజన

మాస్టర్ వి. జే. వర్మ &
శ్రీమతి బి. రాజరత్నం

N. 18747
వొచ్చే అలలు
ఊగవోయీ

శ్రీమతి బి. రాజరత్నం

N. 18745
ఘల్ ఘల్లన రా
హోయి హోయి

"హెచ్. ఎం. వి."
గ్రామఫోన్ వ్యాపారులందరివద్ద
రికార్డులు దొరకును.




ది గ్రామఫోన్ కంపెని లిమిటెడ్, మద్రాసు.



# విషయానుక్రమణిక

**1945, జూన్**



## చిత్రములు

# భారతి ఇరువదిరెండవ సంపుటము. భా—౧

## వ్యాసముల అకారాది సూచి




సంపుటము 22

జూన్, 1945

పార్థివ - జ్యేష్ఠము

# బ్రతుకు బరువు

●

= శ్రీ బులుసు వేంకటేశ్వర్లు =

భరముగఁ దోఁచు నీబ్రతుకు; పారము లేని విచారసాగరాం
తరమున మగ్నమై, దరియు దాపును గానని నేత్రయుగ్మమున్,
గరము బెడందగన్న హృది, కార్శ్యము నందిన దేహయష్టియున్
బరమభయాలవాల మగుఁ; గాయు నుపాయము తోఁచ దేమియున్.

కోరిన సౌఖ్యముల్ కనమిఁ గోరని దుఃఖము లావహిల్లుటన్
నేరిమిఁ జేయ నెంచినవి నిష్ఫలమై మఱి చేయనెంచఁగాఁ
గోరని వెల్ల చేయఁబడఁ గోరుట మానమిఁ గోరుచుండుటన్
భారము భార మీబ్రతుకు పాయని యిట్టి వ్యథాక్రమంబునన్.

క్షణమున సంభవించు నొక సంగతికూడ నెఱుంగరాక వీ
క్షణమున కందకుండుటయుఁ జంచలచిత్తము సంభ్రమించి ప్ర
త్యణువునుగూడ ఖేదమున కర్పణచేయుటయున్ సుఖాత్మమా
ర్గణమున బుద్ధిపోవమియుఁ గష్టము కష్టము జీవితంబునన్.

# భారతి - పార్థివ జ్యేష్ఠము

సుకముగఁ దోఁచు సర్వమును శూన్యసుఖంబున నంత మొందుటల్
సకలము శాశ్వతం బనఁగ సర్వ మశాశ్వతమై చెలంగుటల్
వికటమహాప్రదర్శనము విశ్వము సర్వము చూడ నీమహా
ప్రకరణ మంతులేనిది ప్రపంచపు గ్రంథమునందు నెప్పుడున్.

జని యన్నన్ యమయాతనాత్మకము నాజన్మంబుపై బాల్యదుః
ఖనిబద్ధంబగు జీవితంబు మఱియున్ గష్టంబు నాపైని యౌ
వనమాయావినిబద్ధదుష్కృతములన్ వర్ణింప ఘోరంబు లం
తన వార్ధక్యమహాప్రయాసములు ప్రస్తావింప హేయంబగున్.

ఈ పరిపాటితోడఁ జను నెన్నియొ వర్షము లెన్నిజన్మలో
యీపరిపాటినే జరిగె నిప్పుడుకూడఁ దదన్య మేమి లే
దీపరిహాస మేల ? జగ మింతియ యేమొ యెఱుంగరాదుగాఁ
యీపదినాళ్ల జీవితము నిట్టులు కల్పనచేయ నేలనో ?

ఒకఁడు సుఖుండ నంచుఁ గడు నువ్విళులూరుఁ బ్రియాంకమందు, వే
ఱొకఁడు విలాసహాసముల, నొండొరుఁ డున్నతసౌధమందు, నిం
కొకఁడు ధనార్జనంబున, మఱొక్కఁడు కుత్సితవేషభావలన్,
సకలము నెండమావు లని చాలరు వీని గ్రహింప నెవ్వరున్.

ప్రియవనితాసుఖాంగమును వీడియు వీడకమున్నె మృత్యుదే
వియె తనుఁ గౌఁగిలించుట వివేకవిహీనుఁడు కాంచలేఁడు; సా
ధయుతసమస్తసంపదలు దక్కకపోవు టెఱుంగలేఁడు; జీ
వియుఁ గడు దుఃఖమందు నెఱవేరమిఁ గోర్కెలు నిందునందునున్.

తీఱని తీవ్రవేదనము, తీఱని గాఢవిమోహరజ్జువుల్
తీఱని యర్థకాంక్షయును, దీఱని తుచ్ఛపు సౌఖ్యతృష్ణయున్
దీఱని కామకాంచనరతిస్ఫుటదృష్టియు, దుర్వివేకమున్
దీఱనియంతకాలమును దీఱదు జీవితభార మింతయున్.

పాయవు దేహశృంఖలలు, పాయవు జ్ఞానవిహీనతామసా
పాయవు దుఃఖముల్; పరమభక్తివివేకము జ్ఞానమన్ త్రయిన్
బాయును సర్వమున్ బ్రతుకుభారము పాయును జన్మదుఃఖముల్
పాయును వాయు జన్మము లలభ్యహరిస్మరణప్రసంగతిన్.

# మన భవభూతి

## శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

"నావలె నీయొడిన్ బెరిగి
నాడటవే భవభూతి తొల్లి, త
ల్లీ! వివరమ్ముగాఁ బలుక
లేని పురాహృదయానుబంధముల్
మోవగ, నిం దలంచి, పరి
ముగ్ధు డగున్, రసవత్కవిత్వసం
భావన, నీ మనోజ్ఞ గరి
మమ్ములు మాటికిఁ బాట పాడెడిన్."

(నా "గోదావరి" నుండి)

ఉత్తరరామచరిత్ర, మాలతీమాధవము, మహావీర చరిత్ర అనే రసవన్నాటకత్రయం రచించి జగద్విఖ్యాతి నందిన మహాకవి భవభూతి మన సోదరాంధ్రుడు.

ఈవిషయం మన పరిశోధకవిద్వాంసులు అక్కడక్కడ సూచించినప్పటికిన్ని దేశీయులుపలువురు గుర్తించినట్లు కనబడదు. ఇంతేకాక—సభలలోనూ, సాహిత్యగోష్ఠులలోనూ భవభూతిప్రసక్తి వచ్చినప్పుడు అత డాంధ్రు డని చెప్పగా! సందిగ్ధముగాను, సోపహాస్యముగాను మాటలాడిన ఐతిహాసికులుగూడా ఉన్నట్లు విన్నాను. ఆ దృష్టితో మహాకవినాటకములను, విమర్శకుల వ్రాతలను పలుమారు చూడగా అత డాంధ్రు డనే నమ్మకము బలీయమై స్థిరపడ్డదిగాని శిథిలము కాలేదు. అట్టి అనుభవఫలితాలను దేశీయుల పరిశీలనకు ఇక్కడ ప్రస్తరిస్తున్నాను.

మొట్టమొదట ఉత్తరరామచరిత్రలోని గోదావరీవర్ణనములనుబట్టిన్ని, మాలతీమాధవంలో సౌదామనీముఖాన చేసిన గోదావరీస్మరణమునుబట్టిన్ని భవభూతి మహాకవి గోదావరీప్రాంతవాసి ఐన ఆంధ్రుడేమో అని గాఢంగా మనస్సుకు తట్టింది. పిమ్మట యాదృచ్ఛికంగా దొరికిన ఈ తెలుగుపెద్దల వ్రాతలు నా అభిప్రాయాన్ని మరింత దృఢపరిచినవి.

౧. ఆంధ్రవాఙ్మయసూచికకు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు వ్రాసిన పీఠికలో (పుట ౨౧) "ఆంధ్రులు రచించిన సంస్కృతప్రాకృత గ్రంథములు కొన్ని" అను శీర్షికకింద "భవభూతి... ఉత్తరరామచరితాదులు" అని ఉన్నది.

౨. శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఆంధ్రసర్వస్వంలోని "ఆంధ్రులు—అప్పుడు, ఇప్పుడు" అనే తమ వ్యాసంలో ఇట్లా వ్రాశారు: "...చాణక్య, సిద్ధనాగార్జున, భావవివేక, భవభూతి, విద్యారణ్య, పండితరాయాదిమహావిద్వాంసులును... ఆంధ్రజనయిత్రీస్తన్యముల నందినవారే"

3. ప్రతిభలో ప్రకటించిన ఒక పాటలో శ్రీ అడివి బాపిరాజుగారు "ఆంధ్రకవి భవభూతి అమృతశ్లోకాన్నోయి" అన్నారు.

వీరేకాక—శ్రీయుతులు కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు, వేదం వెంకట్రాయశాస్త్రిగారు, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు డా. భండార్కరుగారి అభిప్రాయానుసారముగా ఇతన్ని ఆంధ్రుడనవచ్చు నని సూచించారు.

డా. రామకృష్ణగోపాల భండార్కరుగారు ఈ కవి తన్నుగూర్చి తన నాటకాలలో ఇచ్చిన వివ

రాలను బట్టి పై పండితులకంటె పర్యాలోచనము చేసి తమ మాలతీమాధవపు అనుబంధంలో (Notes) తమ అభిప్రాయములు స్పష్టపరచినారు.

శ్రీ భండార్కరు పండితుని అభిప్రాయములు తెలుసుకోనేముందు భవభూతి తన్ను గురించి తెలిపిన సంగతులు గమనించడం అవసరం గనుక మాలతీమాధవపు ప్రస్తావనలో భవభూతి యిచ్చిన స్వవిషయమును ఉదాహరిస్తున్నాను :

"అస్తి దక్షిణాపథే విదర్భేషు పద్మపురం నామ నగరమ్. తత్ర బ్రాహ్మణాః కేచి త్తైత్తిరీయాః పంక్తిపావనాః కాశ్యపాః పంచాగ్నయ స్సోమపీథినో ధృతవ్రతా ఉదుమ్బర నామానో బ్రహ్మవాదినః ప్రతివసన్తి...తదాముష్యాయణస్య తత్రభవతో భట్టగోపాలస్య పౌత్రః, పవిత్ర కీర్తేః నీలకణ్ఠస్య పుత్రః, శ్రీకణ్ఠపదలాఞ్ఛనః పదవాక్యప్రమాణజ్ఞో భవభూతిర్నామ కవిః.'

—దక్షిణాపథాన విదర్భదేశంలో పద్మపురం అనే గ్రామంలో తైత్తిరీయశాఖాధ్యాయులు......కశ్యప గోత్రజులు......ఉదుంబరు లనే బ్రాహ్మణు లున్నారనీ, వారి వంశస్థు డైన భట్టగోపాలునకు మనుమడూ, నీలకంఠుని కుమారుడూ అగు భవభూతి ఈ నాటకం వ్రాసినాడు అన్న మాటలనుబట్టి డా. భండార్కరుగారిట్లా వ్రాశారు :

*"Bhavabhuti's native place appears from the description to have been somewhere near Chandrapur or Chanda in the Nagpur territories, where there are still many families of Marathi desastha Brahmanas of the Taithiriyasakha of the Black Yajurveda with Apastamba for their Sutra and in the country to the south and south-east of which there are families of Tailanga Brahmanas following the same Veda and Sutra.*

*The river Godavari must have been at or near his native place."*

—ఇప్పటికిగూడ నాగపుర ప్రాంతంలో చాందాకు దగ్గరగా కృష్ణయజుర్వేదతైత్తిరీయశాఖకు చెందినవారు, ఆపస్తంబసూత్రులున్నూ ఐన దేశస్థమహారాష్ట్రబ్రాహ్మణులున్నూ, దానికి దక్షిణంగాను, దక్షిణపూర్వంగాను అవే వేదశాఖాసూత్రాలకు చెందిన తైలంగ(తెలుగు) బ్రాహ్మణులున్నూ ఉన్నారుగనుక, భవభూతి చెప్పిన దాన్నిబట్టి అతని జన్మస్థలం ఆప్రాంతంలో ఎక్కడో ఉండుననీ, గోదావరి అతని జన్మభూమివద్దగాని, సమీపంలోగాని ఉండిఉండాలనీ ఆయన ఊహించారు.

భండార్కారుగారు కంఠోక్తిగా భవభూతి ఆంధ్రుడని చెప్పకపోయినప్పటికీ ఆయన ఇచ్చిన వివరాలనుబట్టి అత డాంధ్రుడని నిర్ణయించవచ్చును. ఎందుచేతనంటే—

అతని జన్మభూమివద్దగాని, సమీపంలోగాని గోదావరి ఉండవలెనని భండార్కరుగారే వ్యక్తంగా చెప్పారుకాబట్టి, గోదావరి చాందాకంటె చాందా దక్షిణభాగానికే ఎక్కువ దగ్గరగనుక, ఆ ప్రాంతంలో ఉన్నవారంతా తైలంగ(తెలుగు)బ్రాహ్మణులే కాబట్టి భవభూతిమహాకవి పరిశుద్ధ- శ్రోత్రియాంధ్రబ్రాహ్మణ కుటుంబానికి చెందినవాడని స్పష్టపడుతున్నది.

ఇక్కడ కొందరు ఇంకావివరాలకు పోయి విదర్భులనగా వెలనాటివారుగనుక ఇతడు వెలనాటి బ్రాహ్మణుడని ఊహించారు. కాని చరిత్రజ్ఞులు * "వెలనాడనునది గుంటూరుమండలములోని చందవోలుప్రాంతదేశమునకు మొదట వర్తించుచు దరువాత విస్తరించిన"దని వ్రాసి, వెలనాటిబ్రాహ్మణులు ఈ ప్రాంతము నుంచి వచ్చినవారే అని వ్రాసినందువల్ల పై ఊహకు బలం చాలదు. ఇక చెప్పవలసిఉంటే ఇతడు తెలంగాణాకు చెందిన తెనుగునాటి బ్రాహ్మణు డనడాని

* ఆంధ్రుల చరిత్ర, పుట ౩౨౭.

కెక్కువ అవకాశం ఉంది. కాని ఈ కాకదంత పరీక్ష మన కిక్కడ అప్రకృతం.

ఇది ఇట్లా ఉండగా—

౭-౮-౩౯ ఆంధ్రపత్రికలో ఈ ప్రకటన కన పడ్డది: "భవభూతి తన నాటకాలలో తన ఊరు పద్మపురం అని వ్రాసుకున్నాడు. ఇది పద్మపురీ గ్రామం అని నిర్ధరించబడింది. ఇది మధ్యరాష్ట్రాలలో భండారాజిల్లాలో బి. యన్. ఆర్. మీద ఉన్న అంగాఁవ్ స్టేషన్‌కు మూడుమైళ్ల దూరంలో ఉంది." సిమ్లా (మెయిలు)

భండార్కరుగారి వ్రాతకంటె ఇది అర్వాచీనం కనుక నిజానికి దీనికి కొంత విలువ ఇవ్వవలసిఉంది. కాని ఎవరు ఏ హేతువులవల్ల దీని నిట్లా 'నిర్ధరించారో' తెలియదు. ఒకవేళ భవభూతిజన్మస్థానము భండారాజిల్లాలోని పద్మపురీగ్రామం అన్నప్పటికీ, శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు ఆంధ్రుల చరిత్రలో అంతవరకూ ఆంధ్రదేశం వ్యాపించిఉన్నదని చెప్పినారుగనుక భవభూతి ఆంధ్రుడే అవుతాడు. కాని ఈ నిర్ధారణకు ముఖ్యంగా మూడు అనుపపత్తు లున్నాయి.

౧. భవభూతి తన దేశము విదర్భ అని కంఠోక్తిగా చెప్పుకున్నాడు. దీని నిప్పుడు బీదరు అంటారు. చరిత్రజ్ఞుల మాటలనుబట్టి భండారాప్రాంతం దక్షిణకోసలం అవుతుందిగాని విదర్భ కాదు.

౨. భవభూతి వర్ణించిన బ్రాహ్మణకుటుంబాలు ఈప్రాంతంలో ఉన్నట్టు నిర్ధారణలేదు.

౩. ఈ కవి తన దృశ్యకావ్యాలలో చేసిన గోదావరీవర్ణనములనుబట్టి ఇతడు గోదావరీ సమీపస్థుడు అయి ఉండాలని పెద్దల ఊహ. ఇతడు భండారా జిల్లాలోనివాడంటే ఇతనికీ, గోదావరికీ ఉన్న రాగ బంధం తెగగొట్టినట్టవుతుంది.

ఈ సాధకబాధకాలు పరిశీలించకుండా ఎవరో భండారాజిల్లాలోని పద్మపురీ గ్రామం చూచి నామ సామ్యంవల్ల ఇదే భవభూతిజన్మభూమి అనుకొని ఉంటారు. పేరును బట్టియే నిర్ధరించవలసి ఉంటే పోస్టల్ గైడును అనుసరించి ఈ పద్మపురగ్రామాలు మధ్యమాగాణములలో సంబళపుర, విలాసపుర ప్రాంతాలలో (ఇదే భండారాజిల్లాలోనిది) ఒకటిన్నీ, వంగదేశాన ఢక్కాప్రాంతంలో ఒకటిన్నీ, బికనీరు వద్ద ఒకటిన్నీ, ఒరిస్సాలో కటకందగ్గర ఒకటిన్నీ ఉన్నాయి. కాని—

వీటిలో ఏవిన్నీ భవభూతి చెప్పినదానికి సరిపోనందువల్ల, అన్నిటినీ బాగా సమీక్షచేసి, ఇతని జన్మభూమి నాగపురప్రాంతంలోని చాందాదగ్గర (పోస్టాఫీసు లేని కుగ్రామం అయి ఉండవచ్చు) ఎక్కడనో ఉండవచ్చు నన్న డా. భండార్కరుగారి ఊహయే సమంజస మని తోస్తుంది.

ఇక—భండార్కరుగారున్నూ, కొందరు తెలుగు పెద్దలున్నూ సూచించిన భవభూతి ఆంధ్రత్వమును సోపపత్తికంగా చర్చించి దొరికినన్ని ప్రమాణములతో నిరూపించవలసి ఉంది.

(హిందూ) దేశపటములను బట్టిన్నీ, చరిత్రను బట్టిన్నీ భవభూతిజన్మభూమిగా చెప్పబడ్డ చాందా ప్రాంతం నికరమైన తెలుగుభూమిగా స్పష్టపడుతున్నది. చాందాజిల్లాకు ఇటు నైరృతిగానూ, అటు ఆగ్నేయముగానూ ఉన్న అదిలాబాదు, బస్తరు జిల్లాలున్నూ స్పష్టమైన తెనుగుసీమలు. అదిలాబాదు జిల్లాకు ౧౮౦౫ వరకూ సిరిపురం తాండూరుజిల్లా అనే వ్యవహారం ఉండేదట. ఇందులోని సిరి, ఊరు అనే మాటలు స్వచ్ఛమైన తెలుగుమాటలు గదా. ఇంతే కాక—ఈ జిల్లాలోని లక్సెట్టిపేట, చిన్నూరు మొదలైన గ్రామనామాలు గూడా దాని తెనుగుతనాన్ని రుజువుచేస్తున్నాయి. ఈ జిల్లాలలో తెలుగు మాట్లాడేవారు అధికంగా ఉన్నందువల్ల వీనిని గూడా చేర్చి సమగ్రాంధ్రరాష్ట్రం ఏర్పడాలని ఆంధ్రప్రముఖులు పలుతావుల వ్రాసియున్నారు. ఆంధ్రసర్వస్వంలో ఇట్లా ఉంది: "......నైజాము రాష్ట్రమున తెలింగానా అని వ్యవహరింపబడు తెనుగు

జిల్లాలున్నూ, మధ్యమాగాణములలో ఆంధ్రజనసంఖ్య ఎక్కువగా గల చాందా బస్తరుజిల్లాలున్నూ నూతన రాజ్యాంగవ్యవస్థలో భాషాప్రయుక్తరాష్ట్రవిభజనము ననుసరించి రాబోవు ఆంధ్రరాష్ట్రమునకు చేరవలసి ఉన్నవి." శ్రీ వేమవరపు రామదాసుపంతులుగారున్ను ఇంచుమించుగా ఆంధ్రరాష్ట్రమునకు ఇవే హద్దులుగా చెప్పినారు. శ్రీ చి. వీ. పంతులుగారు ఆం. చ. ౩౨౭ పుటలో ఇచ్చిన దేశపటములో పై జిల్లాల నన్నిటినీ కలిపి తెలుగుమాట్లాడు జిల్లాలుగా సూచించి ఉన్నారు.

సర్ జార్జి గ్రియర్సన్‌గారు దేశభాషల సర్వేలో కోంటావుభాష అనే పేరిట చాందా జిల్లాలోని వింతరూపభేదాలు గల ౬ తెలుగువాక్యాలు ఉదాహరించారు. *

పూర్వోక్తవిషయాల ననుసరించి, ఇంచుమించు చాందాకు దక్షిణంగా అదిలాబాదు చాందా జిల్లాల సరిహద్దుభూమి భవభూతిమహాకవిజన్మస్థల మని నిరాక్షేపంగా ఎంచవచ్చును. ఈ ప్రాంతానికి నాతి దూరంలో గోదావరి ప్రవహిస్తున్నది. ఈప్రాంతంలో పెద్ద అడవులున్నూ, వన్యమృగాలున్నూ విస్తారంగా ఉన్నట్లు తద్‌జ్ఞులు చెబుతున్నారు. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వంలో అదిలాబాదుజిల్లాను గూర్చి ఇట్లా ఉంది: "ఈజిల్లాయందు ప్రవహించు ముఖ్యమైన నది గోదావరి......ఈజిల్లాయం దంతట అడవి చాలఁ గలదు. కొండలయందును గుట్టలయందును పెద్దపులులు, చిరుతపులులు, ఎలుగుబంట్లు, తోడేళ్లు, సివంగులు, అడవికుక్కలు ఉండును."

దీనినిబట్టి భవభూతి చేసిన గంభీరగోదావరీ వర్ణనమున్ను, భయంకరారణ్యవర్ణనమున్నూ అతని స్వానుభవమని విస్పష్టపడుతుంది.

ఇంతేకాక—అతని గ్రంథముల ననుసరించిన్నీ, ఇతరహేతువులనుబట్టిన్నీ కూడా అతని ఆంధ్రత్వం రుజువవుతుంది.

కవులు ప్రసక్తి వచ్చినప్పుడుగాని, లేక ప్రసక్తి తెచ్చిగాని తమ జన్మభూమిని అమితాభిమానంతో వర్ణించడం సహజంగా ఉంది. కాళిదాసు ఉజ్జయినీ పట్టణాన్నీ, నన్నయ్య వేంగీదేశాన్నీ అంత విపులంగా వర్ణించడాని కిదే హేతువు. అట్లే భవభూతి తన జన్మస్థలానికి దగ్గరగా ఉన్న గోదావరినీ, అట్టే దూరముకాని పంచవటీజనస్థానములనూ పలువిధాల పారవశ్యంతో వర్ణించి తన అనురాగమును ప్రకటించినాడు. ఉత్తరరామచరిత్రలో ౧-౩ అంకాలమధ్య ఈయన గోదావరీనామమును ౧౬ సారులు పేర్కొన్నాడు.

గోదావరిదండకాదుల ప్రసక్తి వచ్చినప్పుడు పాత్రల చాటున కనపడే ఈయనహృదయానుబంధం ముఖ్యంగా గమనించదగ్గది.

ఉ. రా. చ. ప్రథమాంకంలో ఈయన గోదావరిని వర్ణించినంత అభిమానంగా పంపను వర్ణించలేదు. ద్వితీయాంకవిష్కంభంలో ఆత్రేయీ వనదేవతల సంభాషణలో ఆత్రేయీముఖాన కవే కన్నీటితో కనబడతాడు. "ఆత్రేయీ:-(సాస్రం)అప్యేతత్ తపోవనం? అప్యేషా పంచవటీ? అపి సరిదియం గోదావరీ? అప్యయం గిరిః ప్రస్రవణః? అపి జనస్థానవనదేవతా వాసన్తీ త్వం?" ఇత్యాది.

ద్వితీయాంకంలో శంబూకశ్రీరామసంభాషణంలో శ్రీరాముని చాటున కవి "పరిహర్తుమపి మా మితః పఞ్చవటీస్నేహో బలా దాకర్షతీవ" అన్నాడు.

తృతీయాంకంలో సీత పెంచిన ఏనుగుగున్నను రక్షించదలచి గోదావరీతీరానికి వెళ్లిన శ్రీరాముని గొంతులో కవి "భగవతి, గోదావరి! నమస్తే"అని తన హృదయాన్నే వంచి నమస్కరించాడు.

ఈ మహాకవి విదర్భదేశంలో గోదావరీతీరాన పుట్టి కారణాంతరాలవల్ల తన మాతృభూమిని విడచి కొంతకాలం మగధదేశంలోను, మరికొంతకాలం

* ఆంధ్రసర్వస్వం, పుట ౩౨౧

కాశ్మీరదేశంలోను రాజాశ్రయంకోసం వలసపోయి*
ఉండి, తిరిగి ఎప్పుడైనా తన మాతృభూమికి వచ్చి
నప్పుడు, తనకు ఆబాల్యమిత్రములైన అడవులు,
కొండలు, నదులు చూచి ఇట్లా తన హృదయానుబంధం
ప్రకటించినట్టు మనకు విశదపడుతుంది. అట్లా కాక
పో[illegible] ఎరిగిఉన్నంతవరకూ ఏ సంస్కృత కవీ
ఇంతగా గోదావరిని తన కావ్యంతో పెనచి అగ్గల
మైన అభిమానం చూపినట్లు కనపడదు. మాలతీమాధవం
౯-వ అంకంలో శ్రీపర్వతంనుంచి వచ్చే సౌదామని
మధ్యేమార్గాన సింధుప్రాంతారణ్యం చూచి ఇట్లా
అంటుంది: "ఏతా శ్ఛన్దనాశ్వకర్ణసరళపాటలప్రాయ
తరుగహనాః, పరిణతమాలూరసురభయోరణ్యగిరిభూ
మయః, స్మారయన్తి తాన్ తరుణకదమ్బజమ్బూవనావ
బద్ధాన్ధకారసురగిరినికుంజగుంజద్గంభీర గద్గదోద్గార
ఘోరఘోషణ గోదావరీ రవముఖరిత విశాల మేఖలా
భువో దక్షిణారణ్యభూధరాన్."

ఈమెకు సింధుపరిసరాటవీరామణీయకం చూచే
సరికి గోదావరీప్రాంతారణ్యం జ్ఞాపకం వచ్చిందట.
ఈ జ్ఞాపకాల బాధ సౌదామనికంటె ఎక్కువ
భవభూతిది.

ఇతని ఉత్తరరామచరిత్రకు పూర్వం ఉత్తర
రామకథతో ప్రవర్తిల్లినదిఙ్నాగకవి కుందమాల ఇంచు
మించు ఇతని ఉత్తరచరితకు మాతృక. అందులో
తిరస్కరిణీ ప్రభావతిరోహిత ఐన సీతకూ, రామునకూ
జరిగిన రసోజ్జ్వలసంఘటన వాల్మీక్యాశ్రమంలోనే
ఒక సరస్తీరంలో తటస్థపడ్డట్టు వర్ణింపబడ్డది.

ఇతడు మరింత రసస్ఫూర్తికోసమే కాకుండా
తన మానసికానుబంధమును కూడా జోడించి ఆ రస
వత్సన్నివేశమును తన మాతృభూమి ఐన గోదావరీ
తీరానికి గెంటుకొనివచ్చాడు.

ఉత్తరరామాయణములో శ్రీరాముడు శంబూక
వధకొరకు జనస్థానానికి గాని, గోదావరీ ప్రాంతానికి
గాని వచ్చినట్టు లేదు. దక్షిణదిక్కుకు మాత్రం వచ్చి
అక్కడ శైవల మనే కొండ కుత్తరంగా ఉన్న ఒక
సరస్సులో తపస్సుచేస్తున్న శంబూకుణ్ణి చూచినట్టు
అందులో ఉంది.

"దక్షిణాం దిశ మాక్రామ
తతో రాజర్షి నన్దనః,
శైవల స్యోత్తరే పార్శ్వే
దదర్శ సుమహ త్సరః.
తస్మిం త్సరసి తప్యంతం
తాపసం సుమహ త్తపః,
దదర్శ రాఘవః శ్రీమాన్
లమ్బమాన మధోముఖమ్."

భవభూతి ఈ శంబూకవధను జనస్థానమునకు
మార్చి తన గోదావరీవర్ణనముల కవకాశం కల్పించు
కొన్నాడు.

శ్రీ శంకరపాండురంగ పండితులు గౌడవహ
ప్రాకృతకావ్యానికి పీఠిక వ్రాస్తూ ఒక స్నేహితుడు
తన కిచ్చిన మాలతీమాధవ వ్రాతప్రతిలో 3-వ అంకం
చివరను, ౬-వ అంకం చివరనూ కుమారిలభట్ట శిష్యు
నిచే ఈనాటకం వ్రాయబడిందని ఉన్నందువల్ల
ఈ భవభూతికవి విఖ్యాత పూర్వమీమాంసకాచార్యు
డైన కుమారిలభట్ట శిష్యు డని నిర్ణయించినారు.

పాశ్చాత్యులున్నూ, మరి కొందరున్నూ
కుమారిలుడు వంగదేశీయు డని అవిచారితంగా వ్రాసి
జినవిజయ మనే జైనగ్రంథంలో ఇత
డాంధ్రుడని స్పష్టంగా ఉన్న దని శ్రీ చి. వీరభద్ర
రావుగారు ఈ శ్లోకా లుదాహరించారు:

"అంధ్రోత్కలానాం సంయోగే
పవిత్రే జయమంగలే
గ్రామే తస్మిన్ మహానద్యాం
భట్టాచార్యః కుమారకః
ఆంధ్రజాతి స్త్రిత్రికో
మాతా చంద్రగుణా సతీ
యజ్ఞేశ్వరః పితా యస్య......"

* శ్రీ లక్ష్మణరావుపంతులుగారి 'హిందూమహా యుగం', పుట ౧౩౧.

# భారతి - పార్థివ జ్యేష్ఠము

ఇందువల్ల భవభూతి తన నివాసభూమికి ప్రక్కనే ఉన్న ఉత్కళాంధ్రసంధిదేశాన ఆంధ్ర మీమాంసకాచార్యు డైన శ్రీ కుమారిలభట్టపాద పాద తలాన లబ్ధవాగ్వైభవు డైనాడని సులభంగా ఊహించి చెప్పవచ్చు. డా. భండార్కరుగారు భవభూతికి పూర్వమీమాంసాభిమాన మున్న దని చూపగలిగితే పై వాదానికి బలం వస్తుం దన్నారు.

భవభూతి తన మాలతి-ప్రస్తావనలో తాను ప.ద వా.క్య ప్రమా ణ జ్ఞు డ నని చెప్పాడు. ఇందు ప్రమాణజ్ఞు డంటే * మీమాంసా పరిజ్ఞాతయే గదా. ఉత్తరచరిత ప్రథమాంకప్రారంభంలోని

"కిం త్వనుష్ఠాననిత్యత్వం
స్వాతంత్ర్య మపకర్షతి,
సంకటా హ్యాహితాగ్నీనాం
ప్రత్యవాయై ర్గృహస్థతా."

అనే శ్లోకం ఇతని కర్మప్రధాన పూర్వమీమాం సాభిమానానికి ప్రబల నిదర్శనం ఎందుకు కాదు? కనుక—ఇతడు ఆంధ్రు డైన భట్టకుమారిలస్వామికి ప్రియతమ ఆంధ్రశిష్యుడు.

పరిశోధకులకు తరువాత దొరికిన ప్రథమ చాళుక్యభీమవిష్ణువర్ధనుని ఖాసింకోట శాసనములో మాలతీమాధవ భరతవాక్యశ్లోక మైన

"శివమస్తు సర్వజగతాం
పరహితనిరతా భవన్తు భూతగణాః,
దోషాః ప్రయాన్తు శాన్తిం
సర్వత్ర సుఖీ భవతు లోకః"

అనునది శాసనపుధ్యానశ్లోకాల్లో ఒకటిగా వ్రాయబడిఉన్నదట. †

ఈ మొదటిచాళుక్యభీముడు క్రి. శ. ౮౮౮ మొదలు ౯౧౮ వరకు రాజ్యపాలనం చేసినట్లు చరిత్రవల్ల తెలుస్తున్నది. ఇతనికి సుమారు ౧౫౦ సం.లుమాత్రమే పూర్వుడై విదర్భ దేశంలో గోదావరీతీరాన మహాకవిగా ప్రఖ్యాతివహించిన భవభూతినాటకశ్లోకమును—దానిలో చెప్పదగినంత విశేషం లేకపోయినప్పటికీ—ఈ మహారాజు తన శాసనంలో వేసుకోవడం చూడ గా ఇతడు ఒక విలక్షణమైన ఆత్మీయతను ఆ కవి యందు చూపినాడని స్పష్టమవుతుంది.

ఇట్లు బాహ్యాభ్యంతరహేతువులతో సూక్ష్మం గా ఆలోచించగా భవభూతిమహాకవి గోదావరీతీర వాసియై తన పవిత్రజన్మముచేత తెలుగుతల్లి అంకతలము నలంకరించిన మనసహోదరు డని తేటతెల్లమవుతున్నది.

---

* చూ: ఉ.రా.చ., మాలతీమాధవ వ్యాఖ్యలు.

† ఆంధ్రులచరిత్ర, పుట ౨౮౧.



# ఉడాలివరదరాజపండితుఁడు

రామాయణ ప్రథమ దాక్షిణాత్యవ్యాఖ్యాత ఉడాలి వరదరాజపండితుఁ డనియు, ఈతడు పూర్వాగ్రద్రావిడుఁ డనియు నీతని కాలమును, వ్యాఖ్యానమును గుఱించి శ్రీ డాక్టర్ రాఘవన్ గారు (మద్రాసు విశ్వవిద్యాలయము) పరిశోధించి వ్రాసియున్నారు.* దాని సంగ్రహమిది:

శ్రీవైష్ణవవ్యాఖ్యాతలైన గోవిందరాజ పండితుఁడు తనకు పూర్వవైష్ణవ వ్యాఖ్యాతగా పలుతావుల నొక (ఉడాలి) ఉదారి పండితుని పేర్కొనుచున్నాఁడు. ద్రావిడవాఙ్మయమందలి వైష్ణవప్రబంధములలో నందుచోట్ల నీ ఉదారియొక్క ప్రశంస కానవచ్చుచున్నది. లోకాచార్యుఁడు, లేక నంపిళ్లయి యని ప్రసిద్ధుఁడైన నంబూరి గోవిందరాజు తిరువాయ్మొழிకి రచించిన 'ఈడు' అను వ్యాఖ్యలోను, జీయర్ అనునాతఁడు రచించిన అరుంపదవురై అను వ్యాఖ్యలోను ఉదాహరణములు కలవు. ఈ ఉదారి యెవఁడో యని పరిశోధింప నారంభించి రాఘవన్ గారు ఈతఁడు ఉడాలి వరదరాజపండితుఁ డని ఈ క్రింది యాధారముచే నిర్ణయించినారు. మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలో ఉడాలి వరదరాజకృత వివేకతిలక మని రామాయణమున నొక ప్రాచీనవ్యాఖ్య కలదు. అందు సర్గాంతములలో నీగద్యము కలదు:

"ఇతి ప్రథమాత్రేయగోత్రిణా ఉడాలికుల తిలకసంభవేన వరదరాజేన చోలపణ్డిత బ్రహ్మరాజాపరనామ్నా విరచితే వివేకతిలకనామ్ని రామాయణ వ్యాఖ్యానే బాలకాణ్డస్య ప్రథమసర్గ వ్యాఖ్యానమ్" (Trien కేటలాగు R 3808)

దీనిచే ఉడాలి యనునది ఈతని యింటిపే రనియు, ఈతని పేరు వరదరాజనియు నేర్పడినది. రామాయణమునకు వైష్ణవసాంప్రదాయానుసారముగా మొదటివ్యాఖ్య రచించినవాఁడును, అనంతర సుప్రసిద్ధ వ్యాఖ్యాతయైన గోవిందరాజ పండితునికి మార్గదర్శకుడునునైన ఈతనివ్యాఖ్యానము నష్టముకాలేదు. మదరాసులైబ్రరీలోను (D ౬౧౧౨, R౧౭౩౪, ౩౮౧౯, ౪౧౯౧, R ౧౭౩౪) తంజావూరు, మైసూరు, శాంతి నికేతనము, అడయారులైబ్రరీలలోను చూడఁగా, అన్నిటిని చేర్చిన సమగ్రవ్యాఖ్యానము ఏర్పడుచున్నది.

ఈతని కాలము పై నుదాహృతమైన 'ఈడు' కాలనిర్ణయమున కుపకరించుచున్నది. శ్రీరామానుజుల వారు క్రీ. శ. ౧౧౩౭ న గతించిరి. వారివెనుక పరాశరభట్టు గురువాయెను. ఆవెనుక నంజీయర్ అను నామాంతరము గల మాధవస్వామి గురువాయెను. ఈయనకు తర్వాతి వైష్ణవగురువే 'ఈడు'వ్యాఖ్యాకర్త లోకాచార్యుఁ డనఁబడిన నంబూరి వరదరాజు. 'ఈడు'అను నరవపదమునకు సమానమనియే యర్థము. ఇయ్యది శ్రీభాష్యవ్యాఖ్యయగు శ్రుతప్రకాశికకు సమానమట. శ్రుతప్రకాశికాకారుఁడు తన వ్యాఖ్యను శ్రీవేదాంతదేశికులవారికి అందిచ్చు కాలమునకు చాల వృద్ధుఁడైయుండెను. వేదాంతదేశికుల కాలము క్రీ.శ. ౧౨౬౮ మొదలు ౧౩౭౧ వరకు. నంపిళ్లైచే నుదాహృతుఁడైన ఉడాలి క్రీ. శ. ౧౨౫౦ ప్రాంతము వాఁడని తోఁచును. అంతకన్నను ఈవలికి తెచ్చుట అసాధ్యము.

ఉడాలి యన నేమి?—తాళపత్రములలో నీ నామధేయము ఉడాలి, ఉఢాలి, ఉటాలి, ఉదారి యని పలువిధముల నగపడుచున్నది. ఉడాలి హెచ్చు

---

* Annals of Oriental Research, Vol II Part 2.

గాను వరదరాజనుచోటను అట్లే యున్నది. ఇయ్యది ఏగ్రామనామమును గాదు. ఏలన, అట్టి గ్రామము పట్టికలలో కానరాదు. ఏకారణముచేతనో వచ్చిన ఇంటిపేరు. నెల్లూరుజిల్లాలోని పుదూరుద్రావిడ బ్రాహ్మణులలో ఉడాలి యని ఇంటిపేరు గలవారు పలువురు. వీరి గోత్రమును ఆత్రేయగోత్రమే. ఆముక్తమాల్యదకును, శృంగారనైషధమునకును వ్యాఖ్యలు రచించిన వేదము వేంకటరాయశాస్త్రిగారు ఉడాలివారి దౌహిత్రుఁడు. భారతముయొక్క ఆదిసభాపర్వము ప్ర శ్రీ దండిగుంట సూర్యనారాయణశాస్త్రి, చదలువాడ సుందరరామశాస్త్రిలలో మొదటివారు ఉడాలివారే.

* పుదూరు ద్రావిడులు ఏకాలముననో ద్రావిడదేశమును వదలి ఆంధ్రదేశమునకు వచ్చిరని పరంపరాగత ప్రతీతి కలదు. దీనిచే నొకవిధముగా నా కాలమును నిర్ణయింపవచ్చునేమో. వరదరాజ పండితుఁడు వైష్ణవుఁడు. పుదూరివారిలో పలువురు తొలుత వైష్ణవులుగా నుండి క్రమముగా ముద్రలు ధరించుట మానివేసిరి. ఇప్పటికి వీరిలో కొందఱు నామములు ధరించుచున్నారు. నెల్లూరిలోని గంగవరపు వైష్ణవులు వీరిలోని చీలికయే. ఉడాలివారికి నేటికిని నరసింహస్వామి కులదైవము. ఈ వరదరాజ పండితునికి 'వ్యాఖ్యాతృచూడామణి' 'చోళపండిత' 'బ్రహ్మరాజ' బిరుదము లున్నవి. చోళరాజుల యాస్థానములలో ప్రసిద్ధి నందియుండవలెను. 'బ్రహ్మరాజబిరుదము' వలన విశేషవిషయము తెలియుచున్నది. చోళరాజుల యాస్థానమునందు పాండిత్యమునకే కాక 'ఖడ్గమునకును' తగువారై యుండిన బ్రాహ్మణుల కీబిరు దుండెడిది. బ్రహ్మరాజనియు, బ్రహ్మమహారాజనియు శాసనములలో కానవగును. ఆయువేల నియోగులవలెనే రాజమంత్రులుగాను, దండనాథులుగాను, సేనాధిపతులుగాను నుండి కవులును, వ్యాఖ్యాతలును నై సర్వవిధముల మన్నన లందుచుండి చోళరాజులు నెల్లూరును పరిపాలించుచుండిన కాలమున నీ రీదేశమున స్థిరపడిపోయినట్లు తోఁచుచున్నది.

ఉడాలివరదరాజ పండితుఁడు రామాయణ దాక్షిణాత్యవ్యాఖ్యాతలలో మొదటివాఁడు. ఈతని వ్యాఖ్యయే తర్వాత గోవిందరాజపండితునికి ఆధారమైనది. ఈ వ్యాఖ్యను రచియించుట కీతఁడు బహుగ్రంథపరిశోధన గావించెను. రామాయణమునందు పాఠభేదము లుండుటం గని అంగీకరింపఁదగిన పాఠములను ఏఱి 'సమ్యక్పాఠనిర్ణయ' మొనరించెను. నాగరాదిలిపుల నెఱుఁగనివారిచే పారంపర్యముగా వచ్చిన పాఠస్ఖాలిత్యములను వ్యాఖ్యానవశమున వ్రాయుచు పలుదేశముల ప్రతులం దెప్పించి చూచియు, పలు భాండాగారములలో శోధించియు తాను పాఠనిర్ణయము చేసినట్లును వ్రాసియున్నాఁడు.

> "నాగరాదిషు వర్ణేషు నాత్యన్తనిపుణై ర్నరైః
> ఖణ్డానే స్ఖలితః పాఠః పారంపర్యేణ లిఖ్యతే
> అతోఽత్ర సమ్యక్పాఠశ్చ తత్రతత్ర ప్రదర్శ్యతే
> బహుదేశసమానీత బహుకోశపరీక్షణాత్"

(R. 3౮౦౯ మద్రాసు ఓరియంటల్ లైబ్రరీ)

ఇట్లే పరిశోధించిన ఆంధ్రదేశమందలి ఇతర ద్రావిడులు ఎల్లవారియొక్కయు పూర్వచరిత్రము తెలియుటకు నవకాశము కలుగును. మన దురభిమానములు పెక్కులు తొలఁగును.

వేదము వేంకటరాయశర్మ.

---

* వీరుమాత్రమే కాదు. వీరికి ముందే ద్రావిడదేశమునుండి పలువురు తెలుఁగుదేశమునకు వచ్చి స్థిరపడి ఆరామద్రావిడులు, పేరూరి ద్రావిడులు, దిమిరిద్రావిడులు, తుమ్మగుంట ద్రావిడులు అని వ్యవహరింపఁబడుచున్నారు.

# దేశికవిత - జానుతెనుగు

## శివకవులు - తిక్కన

= శ్రీ నండూరి రామకృష్ణమాచార్య =

శివకవులు సారస్వతమునకు చేసిన సేవ 'జానుతెనుగు'నకు, 'దేశిరచన'కు వారు కల్పించిన ప్రాముఖ్యము. నన్నయమహాకవి ఆరంభించిన మహాభారతము సుమారు రెండుశతాబ్దులతరువాత తిక్కన అవతరించువరకు అసంపూర్తిగ నిలిచిపోయినది. దీనికి కారణము ఆ మధ్యకాలములో తెలుగులో కవులు లేకపోవుట కాదు. నన్నెచోడుడు, పండితారాధ్యుడు, పాల్కురికి సోమనాథుడు మున్నగు మహాకవు లందరు ఈ మధ్యకాలమున వెలసినవారే. వీరెవ్వరును భారతమును స్పృశింపకపోవుటకు అనేకకారణములు కలవు. వీరు శివకవులు. శైవులలో అతివాదులు వీరశైవులు. వీరశైవకవుల మతావేశము భవికవుల దర్శనస్పర్శనాదులను పరిహరించునంతవరకుగూడ పోయెను.

"భవికృతారంభసంభవధాన్యనిచయ
భవినిరీక్షణ రసపాకవితాన
భవి హస్తగత ఫలపత్రశాకాది
భవిగృహక్షేత్రారామసుపథన వర్జింపుచు ;
భవిజనదర్శన స్పర్శనాలాప
వివిధదానాదాన విషయదూరగుడు."

అని పాల్కురికి సోమనాథకవి పండితారాధ్య చరిత్రలో చెప్పుకొనెను. నాటికాలపు సమాజములో వీరశైవులు గొప్పవిప్లవమును నెలకొల్పినట్లే, నాటి సారస్వతములో శైవకవులు గొప్ప పరివర్తనమును సంఘటించిరి. శివకవులందరును వీరశైవులు గారు. కాని వారందరకు చాల సమానధర్మములు గలవు. శివపారమ్యము-శివభక్తి అందరకు ప్రధానసూత్రములు. వీరి దృష్టిలో మతము ప్రధానము; సారస్వతము గౌణము.

"భక్తిమీది వలపు బ్రాహ్మ్యముతో పొత్తు
వదలలేను నేను బసవలింగ"

పండితారాధ్యుని పలుకులుగా జెప్పబడు నీ పద్యపంక్తులు ఆకాలములో వర్ణవ్యవస్థను తిరస్కరింపలేని మితవాదుల డోలాందోళితమనస్సును వ్యక్తము చేయుచున్నవి. వీరందరును మతప్రచారార్థమే సారస్వతసృష్టికి పూనుకొనిరి. వీరికి ప్రజలు-వారి అవబోధయే లక్ష్యము. తెలుగుప్రజలకు తెలుగులో శివభక్తిప్రాధాన్యమును, శైవమతప్రాశస్త్యమును, శివపారమ్యమును బోధించుటయే వారి సంకల్పము. కావున వారి కావ్యములు స్వమతస్థాపన, పరమతఖండనలతో నిండిపోయి సార్వజనీనములు కాకపోయినవి. 'శివతత్వసారము'లో 'తనకంటె వేరె దైవము లేడను అద్వైతవిమూఢునిపై నిశిత విమర్శ గలదు. కాని, వీరి గ్రంథములయందు ఉత్తమోత్తమకవిత యని చెప్పదగిన,మహోదార భావములు, ఉత్కృష్ట సృష్టి యనిపించు సన్నివేశములు ఎన్నియో కలవు. కాని వీరికి సాహితీలోకములో రావలసిన కీర్తి రాలేదు. చారిత్రికముగా వీరు నన్నయ తిక్కనల మధ్య పడినారు. ఇటు చంద్రాస్తమయము, అటు సూర్యోదయమునకు మధ్య శుక్రుని అలతిఅలతి కాంతులు నిసర్గరమణీయములైనను లోకము చక్కగా దర్శింపలేదు.

# భారతి – పార్థివ జ్యేష్ఠము

శైవవాఙ్మయము ఆంధ్రసాహిత్య ప్రపంచములో మొట్టమొదటి 'స్వాతంత్ర్యోద్యమము' **(Romantic Movement).**

"మును మార్గకవిత లోకం
బున వెలయగ దేశికవిత బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బున జన చాళుక్యరాజు మొదలుగ బలువుర్."

అని నన్నెచోడుడు 'దేశికవిత'ను వివరించెను. నన్నెచోడుని కాలములో ఆంధ్ర సాహితీలోకములో 'మార్గ' 'దేశి' అను భిన్నవాదములు కన్పించుచున్నవి. 'మార్గ', 'దేశి' అను పదములు సంగీతనాట్యపరముగా అలంకారగ్రంథములలో కన్పించుచున్నవి. "మార్గదేశివిభాగేన సంగీతం ద్వివిధం మతం"—శాస్త్రబద్ధమైన సంగీతము 'మార్గ'; యథేష్టాచరణ...నియమరహితమైన సంగీతము 'దేశి'. అట్లే నృత్తనృత్యములు గూడ. ఈ విధముగా కవితాపరముగ నీ రెండుపదములకు అర్థము చెప్పుకొనవచ్చును. అప్పుడు—కాలానుగుణముగ ఈ అర్థము మారవలసివచ్చును. నేటి దేశికవిత రేపటి మార్గకవిత యగును. కాని, నన్నెచోడుడు తన కాలమున ఈ శబ్దములను ఏ అర్థములో వాడినాడు అను ప్రశ్నకు సమాధానము లభించుట లేదు. నన్నెచోడుడే—

"మార్గకు మార్గము దేశియ
మార్గము వదవంగఁ దమకు మదివదలక దు
ర్మార్గపదవర్తు లనఁదగు
మార్గవులం దలచ నలఁతి మహి సుకవులకున్."

అని వివరించినాడు.

"మార్గ = సంస్కృతకవిత్వము; దేశి=(తెలుగు) దేశభాషా కవిత్వము" అని శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు కుమార సంభవములో అర్థము వ్రాసియున్నారు.

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, శ్రీ శ్రీపాద పతిశాస్త్రిగారు మున్నగు పండితులు ఈపద్యమునకు భిన్నవిధముల వ్యాఖ్యానము చేసినారు. పూర్వోదాహృతమైన చాళుక్య ప్రశంసనుబట్టి నన్నెచోడుని దేశికవితాభిమానము నిర్వివాదాంశము. కాని 'దేశికవిత' అనిన దేశభాషాకవిత్వము—అనగా తెలుగుకవిత్వము అని అర్థము చెప్పినచో చాళుక్య వాఙ్మయమునకు ధ్వజప్రాయమైన ఆంధ్రమహాభారతమును గురించిగాని, తత్కర్తయైన నన్నయభట్టును గురించిగాని ప్రసక్తి వచ్చినపుడుగూడ నన్నెచోడుడుగాని, తక్కిన శివకవులుగాని ఒక్కమాటయైనను పలుకకుండుట వింతలలో వింత. లేక శివకవులు నన్నయభారతమును దేశికవితగా గణింపలేదా?

నన్నయ మహాభారతమునకు పూర్వము తెనుగులో సారస్వతసృష్టి లేదనుటకు వీలులేదు. శాసనాధారములనుబట్టి చూచిన తెలుగులో నన్నయకు పూర్వమే పద్యరచన కనపడుచున్నది. యుద్ధమల్లుని బెజవాడ శాసనము, పండరంగుని అద్దంకి శాసనము ఇత్యాదులు నిదర్శనములు. ఈ శాసనములలో తరువోజలు, మధ్యాక్కరలు, సీసములు, ఆటవెలదులు, తేటగీతులు కన్పించుచున్నవి. యతిప్రాసాత్మకమైన తెలుగుఛందస్సు సంస్కృతఛందస్సుకంటె విలక్షణమైనది. వీనిలో సంస్కృత గురుత్వమునకంటె తెలుగుదనమే యెక్కువ. ఇవిగాక తుమ్మెదపదములు, వెన్నెలపదములు మున్నగు పదవాఙ్మయ మెంతేని యుండెడి దని పండితారాధ్యచరిత్ర మున్నగు గ్రంథములనుండి యూహింపవచ్చును. ఇట్టి వాఙ్మయ వికాస మంతయు 'దేశి' శాఖకు చెందినదేగాని 'మార్గ' కవితావర్గమునకు చేరినది గాదు.

చాళుక్యుల రాజ్యారంభమునుండియు తెలుగు వాఙ్మయము క్రమపరిణామ వికాసబద్ధమై యున్నది. నన్నెచోడుని కుమారసంభవములోని చాళుక్యుల దేశికవితా సేవాప్రశంస యీ వాఙ్మయవికాసమున కంతటికిని అన్వయింపవలెనేమో? చాళుక్యరాజులలో తుదకు రాజరాజనరేంద్రుని కాలమునాటికి నన్నయ మహాకవి భారతరచనకు పూనుకొనెను. ఏ భాషలో

నైనను తొలియుషస్సులలో గేయరూపమగు కవితా సృష్టి ప్రప్రథమమున వెలువడు నని సాహితీవేత్తల అభిప్రాయము. గద్యము భాషాపరిణామమును సూచించును. గద్యపద్య సంకలితమైన నన్నయభారతమును పరిశీలించిన సాహితీతత్త్వజ్ఞు లెవ్వరికిని తత్పూర్వము తెనుగులో సారస్వతము కలదా లేదా అను సందేహము కలుగనేకలుగదు. నన్నయతరువాతి కవి పాల్కురికి సోమనాథుడు "ఆరూఢ గద్య పద్య భూయిష్ఠ ప్రబంధరచన సర్వసామాన్యంబుగా" దని చెప్పుట ఈ యూహకు దోహద మొసగుచున్నది.

నన్నయ మహాభారతమును తెనిగించుటకు పూనుకొనినప్పుడు ప్రాథమికదశలో నున్న తెనుగు వాణినోట పంచమవేదమైన భారతము పట్టునా?— నన్నయభట్టు 'జగద్ధితంబుగా' 'తెనుంగునన్' 'మహాభారత సంహితారచన బంధురు' డయ్యెను. సగౌరవముగ భారతసంహితను తెనుగులో ప్రతిష్ఠింపబూనిన నన్నయవాణి ఇతివృత్తగౌరవమున కనుగుణముగ నడచినది. నన్నయ ప్రయోగించిన భాష చాలవరకు సంస్కృతమర్యాదలను, జాతీయములను యథాతథముగ తెలుగులోనికి దింపినది. నన్నయ వాడుకలో నున్న శబ్దజాలమును సంస్కరించి వాడినాడని చెప్పవచ్చును. నన్నయ చేసిన యీ శబ్దసంస్కారమే అతనికి శబ్దశాసను డను బిరుదును సంపాదించి ఇచ్చియుండును. నన్నయకాలములో శాసనములలోని శబ్దజాలము నన్నయకావ్యములో యథాతథముగ గాక సంస్కారరూపములో సాక్షాత్కరించు చున్నది. కావున నన్నయరచన 'మార్గకవిత' అనియే చెప్పవలెను. నన్నయభారతములో ఇతివృత్తము, ఛందస్సు, భాష బహుళముగా సంస్కృతమే. కావున సంస్కృతము రాని జనసామాన్యమునకు నన్నయభారతము అందరానిదయినది. నన్నయ పూర్వమీమాంసకుడు. నన్నయకు పూర్వము పూర్వమీమాంసపై వ్యాఖ్యానము వ్రాసిన కుమారిలభట్టు ఆస్తికప్రబోధము సల్పి, సనాతన మతోద్ధరణమునకు పూనుకొనెను. నన్నయ వంటి అవిరళజపహోమతత్పరులు, సంస్కృతపండితులు ఈ మహోద్యమమునకు ప్రవక్తలై సనాతనధర్మప్రబోధమునకు నడుముకట్టిరి. భారత రచనద్వారా నన్నయ చేసిన వేదసభ్యతా ప్రబోధము రాజసభలలో శిష్టుల నాకర్షించి యుండవచ్చును. కాని జనసామాన్యమువరకు ప్రాకినదని చెప్పుట కేయాధారములును లేవు. ఆంధ్రదేశమున అశోకునికి పూర్వమునుండియు బౌద్ధమతము నాటియున్నది. వైదికమర్యాదలు, కర్మపరత్వము తెలుగునాటను జనసామాన్యములో గాటముగ ఎప్పుడును నాటుకొనియుండలేదు. అవి శిష్టసంఘములలో మాత్రమే నాటికిని నేటికిని వెలయుచున్నవి. బహుళనిష్ఠాబద్ధమై, పండితవేద్యమై, శ్రోత్రియజనైకారాధ్యమైన కర్మతంత్ర నిర్వహణమునకు సామాన్యజనులు అనధికారులు. అవి వారికి చెప్పినను బోధపడవు. వారి భాష వేరు.

వారి భాషలోనే వారికి చెప్పుటకు చేసిన ప్రయత్నమే శివకవుల 'దేశి' సారస్వతము. ఈ అర్థములో శైవవాఙ్మయము ప్రజాసాహిత్యమని చెప్పవచ్చును. సర్వజనైకవేద్యమగు భక్తి వీరి మతములో ప్రధానసూత్రము. శివపారమ్యము పరమధర్మము. మతవిషయమునందువలె శివకవులు సారస్వతమునందును ప్రత్యేకశాఖను స్థాపించినారు. శైవసారస్వతము నన్నయ "ఆరూఢ గద్య పద్య సంస్కృత భూయిష్ఠ ప్రబంధరచనకు" ప్రతియోగము. దేశభాషా కవితా ప్రపంచములో ఆదికావ్యమైన నన్నయ భారతమును శివకవు లెల్లరు స్మరింపకపోవుటకు కారణము భిన్నమత ప్రవృత్తియే కాక భిన్నసారస్వత దృక్పథముగూడ. శివకవుల కావ్యములలో భాష, ఇతివృత్తము, ఛందస్సు సర్వము బహుళముగా తెలుగు. శివకవులు సారస్వతములో సంస్కృత గురుత్వమునకు సమ్మతింపలేదు.

ఛందస్సు:—నన్నయకూడ 'దేశి' ఛందస్సులను వాడినాడు. సంస్కృతములో లేని తరువోజ, మధ్యాక్కర, సీసము, తేటగీతి, ఆటవెలది మున్నగు తెలుగు పద్యములకు సంస్కృతమాతృకలు లేవు. కాని శార్దూ

లము, మత్తేభము, చంపకమాల, ఉత్పలమాల, కవిరాజ విరాజితము, స్రగ్ధర, మహాస్రగ్ధర మున్నగువృత్తములు సంస్కృతమునుండి అవతరించినవే. ఇవి నిర్ణీతగణ బద్ధములు. నన్నయ భారతము 'చంపూ' పద్ధతి. "ఆరూఢ గద్యపద్య సంస్కృతభూయిష్ఠరచన" శివ కవులకు రుచింపదు. అది సర్వసామాన్యము గాదని వారి వాదము. తిక్కన సోమయాజికూడ తన తొలి రచన యగు ఉత్తరరామాయణమును 'నిర్వచన'ముగనే రచించినాడు.

"ప్రాసమైనను యతిపై వడియైన
దేసిగా నిలిపి యాద్రిప్రాసనియతి
దప్పకుండగ ద్విపదలు రచింతు"

అని పండితారాధ్యచరిత్ర అవతారికలో సోమనాథుడు ప్రతిజ్ఞ చేసినాడు.

తెలుగుకవితకు ముఖ్యలక్షణములు యతిప్రాసలు. తెలుగుఛందస్సునకు ప్రత్యేకత నిర్ణీతగురు లఘుపరంపరా సంకలితమగు గణములు గాక మాత్రాబద్ధము లగు గణములు. తెలుగుయతి సంస్కృతయతికంటె విశిష్టము. సోమనాథుడు అందుచేతనే "ప్రాసమైనను యతిపై వడియైన 'దేసి'గా నిలిపి" అని అర్థవంతమైన వాక్యమును వ్రాసినాడు. విరామపూర్వకమైన సంస్కృతయతిగాక, వర్ణసాజాత్యపూర్వకమైన తెలుగుయతినే పాటింపవలెను. తెలుగులో నిసర్గతను, తెలుగువాణి స్వభావమును పరికించి తదనుగుణముగా వ్రాయుట 'దేశి' కవిత. దేశికవితకు సంస్కృతమర్యాదతో పనిలేదు. ప్రాసనియతి సంస్కృతవృత్తములలో లేదు. అది తెలుగుకవితకు ప్రత్యేకభూషణము. నన్నయ సంస్కృతములోని ఛందస్సులను గ్రహించి, వానికి తెనుగుయతిప్రాసలను జేర్చి భారతములో వాడినాడు. కాని శుద్ధదేశికవితావాదు లగు సోమనాథాదుల కిది నచ్చలేదు. వారు శుద్ధదేశీయ ఛందస్సు అయిన ద్విపదలో వ్రాసినారు. మాత్రాగణబద్ధము లైన పద్యములకు జాతు లని పేరు. "జాతులు మాత్రానుసంధానగణవినీతులు గాన" మాత్రాగణబద్ధమైన ద్విపదలో శుద్ధదేశిగా కావ్యము లల్లెదనని సోమనాథుని ప్రతిజ్ఞ.

ఇతివృత్తము :—నన్నయ భారతములోని ఇతివృత్తము సంస్కృతమహాభారతమే. కాని శివకవుల కావ్యములలోని ఇతివృత్తములు (నన్నెచోడుని కుమారసంభవమును వదలిన) తెలుగుభక్తుల చరిత్రములు గాని, లేక తక్కిన దేశభాషాభక్తుల చరిత్రలు గాని యై యున్నవి.

భాష:—భాషాప్రయోగమున శివకవులు ప్రతిపాదించిన క్రొత్తసూత్రము "జాను తెనుగు."

"ఉరుతరగద్యపద్యోక్తులకంటె
సరసమై పరగిన జాను తెనుంగు
చర్చింపగా సర్వసామాన్య మగుట
గూర్చెద ద్విపదలు గోర్కె దైవార"
(బసవపురాణము)

"ఉరుతరగద్యపద్యోక్తులు"—అను ఈ సమాసము నన్నయ భారతరచనాసరణిపై ఎత్తిపొడుపు. ఇక జాను తెను గనునది క్రొత్త ప్రతిపాదన. జాను తెనుగునకు, ద్విపదరచనకు సంబంధ మేమి? జాను తెను గన ద్విపదరచన గాదు. జాను తెనుగున రచించితి నని చెప్పిన నన్నెచోడుడు కుమారసంభవమును గద్యపద్యోక్తులలోనే రచించెను. "సరళము గాగ భావములు జాను తెనుంగున నింపు పెంపుతో పిరిగొన..." అని కుమారసంభవపీఠికలో నన్నెచోడుడు చెప్పికొన్నాడు. సోమనాథుడు పండితారాధ్యచరిత్రలో "జాను తెనుగు విశేషము ప్రసన్నతకు" అని ప్రతిపాదించినాడు. ఈవిధముగ శివకవులు జాను తెనుగును ప్రస్తుతించినారు. సోమనాథుడే వృషాధిపశతకమున 'జాను తెనుగు'నకు ఉదాహరణపూర్వకముగ —

"బలుపొడతోలు సీరయును
బాపసరుల్ గిలుపారు కన్ను చె
న్నెల తల సేను గుత్తుకయు
నిండిన వేలుపుటేరు వల్లుపూ
సలు గల జేని సెంకవని
జాను తెనుంగున విన్నవించెదన్
వలపు మదిన్ దలిర్ప, బస
వా బసవా బసవా వృషాధిపా."





# అతని విజయమునకు ఇప్పుడే సన్నాహము జరుగుచున్నది

## అతని తండ్రి అతని విద్యకొరకు గట్టి ఏర్పాట్లు చేయుచున్నాడు

అతడు ఒక చిన్నవాడేయైనను విద్య నేర్పుటకు ద్రవ్యము కావలెనను దూరదృష్టి అతని తండ్రికి కలదు. అతని బడిజీతమును తెలివిగా ఇప్పుడు వడ్డికి వేసినాడు. 12 సంవత్సరములలో ఆ పైకమే నూటికి 50 వంతుల వడ్డితో వృద్ధియై అతడు పెరిగి పెద్దవాడైనపుడు యూనివర్సిటి (కళాశాల) విద్యను అభ్యసించుటకు అదిసరిపోవును. ఇందుమూలముగా సంపూర్ణమైనట్టియు ఫలప్రదమైనట్టియు విద్యను కలిగి ధైర్యముతో లోకవ్యవహారములందు ఆయన ప్రవేశించవచ్చును.

అతడు తన తండ్రికి ఎంత ఋణపడియున్నాడు! నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్టులలో తన ధనమును దాచుకొనుటకు చేసికొనిన నిశ్చయమునకు అతని తండ్రి ఎంతఋణపడియుండును! మీరు మీకుమారునకు ఇంత లాభము కలుగజేయగలరా? అది మీ మీదనే ఆధారపడియున్నది బుద్ధిశాలులైన తండ్రులజతలో మీరును చేరి, మీ అదనపుధనమును దాచుకొనుడు.




## నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లలో దాచుకొనుడు

- ★ ప్రతి రూ. 10లు 12సంవత్సరముల తర్వాత రూ. 15లు అగును.
- ★ నూటికి 4¼ వంతుల చొప్పున సాధారణ వడ్డిలభించును. దీని మీద ఇన్‌కమ్ టాక్సులేదు.
- ★ మూడు సంవత్సరములైనతరువాత చేరినవడ్డితో డబ్బును తీసుకొనవచ్చును. (రూ. 5ల సర్టిఫికెట్టుకు 18 నెలలు.)

AAA 124

అను పద్యము నిచ్చియున్నాడు. ఈపద్యమును బట్టి జానుతెను గన అచ్చతెను గని కొందరు అర్థము తీయుచున్నారు. కాని యీ నిర్వచనమునకు కుమార సంభవమేకాక ఆ సోమనాథుని బసవపురాణము, పండితారాధ్యచరిత్రముగూడ అపవాదములే. నన్నెచోడుడు, సోమనాథుడుగూడ వారి 'జానుతెనుగు' కావ్యములలో సంస్కృతసమాసములను కుప్పతిప్పలుగా ప్రయోగించినారు. జానుతెను గన అచ్చ

శ్రీ ట

రావుగారు 'జాను'శబ్దము 'చదును'శబ్దభవ మని యూహించుచున్నారు. 'జాను' 'చదును'రెండును తెలుగు శబ్దములే. జానుతెను గన చదునైన తెనుగని అర్థము చెప్పచో నన్నయాదుల భాషగూడ 'జానుతెనుగు' అనువా రుండవచ్చును. జానుశబ్దము 'జన'శబ్దభవ మని కొందరు పండితులు వివరించుచున్నారు. జానుతెను గన జనుల భాష యని చెప్పినను విప్రతిపత్తి యేర్పడుచున్నది. జనసామాన్యగ్రాహ్యముగాని సంస్కృత సమాసములు జానుతెనుగుకావ్యములలో కొల్లలు. కర్ణాటసారస్వతమున 'జాణ్ణుడి'ప్రశంస గలదు.

శ్రీ డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు జానుతెను గన తేటతెను గని అర్థము తేల్చినారు. "తేటతెనుగున ద్విపదలు రచియింతు"అని చెప్పిన సోమనాథుడే నాలుగు పంక్తులు దాటిన తర్వాత "జానుతెనుగు విశేషము ప్రసన్నతకు" అని చెప్పినాడు. 'జానుతెనుగు', 'తేటతెనుగు' పర్యాయ పదములు కావు. 'జానుతెనుగు' 'తేటతెనుగు'కంటె విశిష్టము. జానుతెనుగు సర్వథా తేటతెనుగు కాకపోవచ్చును. జానుతెనుగుకావ్యములలో సులభగ్రాహ్యముకాని సమాసములేకాక కన్నడాది ఇతరభాషా పదములు, శ్రుతిస్మృతివాక్యములు పెక్కులు గలవు.

శివకవులు వాడిన భాషకు కొన్ని ప్రత్యేక ధర్మములు గలవు. వారి దృష్టిలో తెలుగుభాషను శాసించుటకు సంస్కృతవ్యాకరణమునకు హక్కు లేదు. తెలుగుభాషలో సహజసిద్ధముగ వాడుకలో నున్న పదములు, సంస్కృతవ్యాకరణసమ్మతములు గాకపోయినను, కుప్పతిప్పలుగ శివకవులు వాడినారు.

"నల్లవో బసవన్న నందీశమూర్తి
నల్లవో బసవయ్య ముల్లోకవంద్య"

"లింగవంతులు గాని వెంగులదృష్టి
భంగి నాపయిఁ బొఱకయుండఁ
గట్టితి సర్వాంగకచ్చడం బనుచు"

"శ్రీమహాదేవు డన్నామంబు లున్న
వే మహి నిటువంటి యితరవేల్పులకు"

(బసవపురాణము)

ఇట్లే నిత్యపడి, పుడమిశ, భక్తకూటువలు, సద్భక్తసమూహి ఇత్యాదులు కలవు. కలుహోర మున్నగు శబ్దములను సంస్కృతసమములతో కలిపి అనేకస్థలముల సమాసములు కలవు. 'శారదనీరదసమూహిచాద్పునఁ బోలెన్'-కుమారసంభవప్రయోగము. ఆకాలపు తెలుగు శాసనములలోనను, తత్పూర్వము తెలుగుశాసనముల లోను ఇట్టి సమాసములు కానవచ్చుచున్నవి. శివకవుల ప్రయోగసరణి శాసనములలో బహుళముగా కానవచ్చుటచేత ఇట్టి పదములు ఆకాలములో తెలుగువారి నాలుకలపై నలుగుచుండెడి వని యూహింపవచ్చును. అందుచే శివకవులు సంస్కృతవ్యాకరణమునకు స్వస్తి చెప్పి, వానిని బాహాటముగా ప్రయోగించినారు. సహజముగ తెలుగువారు నోట పలుకుచున్న ఈపదములను 'జానుతెనుగు'వాదులు స్వీకరించుటలో విప్రతిపత్తి లేదుగదా!

శైవకవుల భాషాప్రయోగ వైచిత్రినిబట్టి వారి 'జానుతెనుగు' నకు నిసర్గమైన తెనుగు అని అర్థము చెప్పవలెను. నిసర్గముగ వాడుకలో నున్న పదములను శైవకవులు నిరాటంకముగ కావ్యములలో ప్రయోగించినారు. వారిని సంస్కృతవ్యాకరణ సూత్రములుగాని, నన్నయ సంస్కరణవిధానముగాని అడ్డుపెట్ట లేదు.

నన్నయ తీర్చిన సారస్వతపథము వేరు. నన్నయ శబ్దశాసనుడు. వ్యవహారములో నున్న పదము

లను సంస్కరించి వాడినాడు. కాని శివకవులు నన్నయ పెట్టిన ఒరవడిని దిద్దలేదు. ఆంధ్రవాఙ్మయములో విశిష్టమైన లక్షణములతో వర్ధిల్లిన సారస్వతశాఖ శైవ సాహిత్యము. శైవవాఙ్మయమునకు మొట్టమొదటి ప్రవక్త నన్నెచోడుడు. ఇతని 'జాను తెనుగు' 'దేశి కవిత' వాదములు సిద్ధహస్తుడగు పాల్కురికి సోమనాథుని కాలములో పరాకాష్ఠ చెందినవి. ఇట్లు సర్వతంత్ర స్వతంత్రమగు సారస్వతోద్యమమునకు ప్రవక్తలైన శివకవులు నన్నయభారత వాఙ్మయమునకు పూర్వపక్షమును నెలకొల్పిరి. నన్నయ ఆరంభించిన ఆంధ్ర మహాభారతము అసంపూర్తిగ నిలిచిపోయినది.

శివకవులు ప్రతిపాదించిన సారస్వతోద్యమము సార్వజనీనము కాలేదు. సాహిత్య ప్రపంచములో భిన్నవాదములు చెలరేగినవి. శైవయుగములో చిట్టచివర ఉద్భవించిన కావ్యము రంగనాథ రామాయణము. రంగనాథరామాయణ కృతికర్త శివకవులను పూర్తిగా అనుసరింపలేదు. ఛందస్సు శుద్ధ దేశియగు ద్విపదయే కాని ఇతివృత్తము వాల్మీకి రామాయణము లోనిదే. భాషాప్రయోగ స్వాతంత్ర్యమును బట్టి చూచినను శివకవులవలె విశృంఖలవిహారము సలుపలేదు. ఈ కావ్యము వీరశైవమత ప్రాబల్యము తగ్గుచున్న రోజులలో పూర్వసంస్కృతి సభ్యతా పునరుద్ధరణపై గల అభిమానమును వ్యక్తము చేయుచున్నది. రంగనాథ రామాయణము తిక్కన మహాయుగమునకు వేగుచుక్క.

తిక్కన:—"అల్పాక్షరంబుల ననల్పార్థరచన" "జాను తెనుగు" "దేశికవిత" "ద్విపదరచన" అను సిద్ధాంత రాద్ధాంతములే గాని వాని అంతస్తత్త్వ మెట్టిదో, అవి ఎంతవరకు అనుసరణీయములో చూపిన మహాకవి అంతవరకును లేకపోయెను. అసలు అంతరార్థమును గుర్తింపక వృథావాగ్వివాదములలో బడిన సారస్వతోపాసకు లందరిని ఏకోన్ముఖము జేసి అన్నివాదములలో గల సత్యమును సమన్వయించి చూపిన సారస్వతాచార్యుడు తిక్కన. నిజమునకు ఉత్తమసాహిత్య గౌరవము ఔచిత్యపరిపాలన, భావనాపాటవము, రసప్రతీతి పైనను, కావ్యమునకు అంగభూతములైన జాతీయము, పలుకుబడి, నుడికారము పైనను ఆధారపడియుండును. వీనిలో ఏకదేశము మాత్రమే పరిగ్రహించి ఛందస్సు పైననో, భాషపైననో అధికనిష్ఠ చూపిన కవికి సాహితీసృష్టిలో ఏకదేశసిద్ధిమాత్రమే లభించును. అట్లుగాక, పరిపూర్ణసిద్ధి పొందిన మహాకవి తిక్కన. ఈ సత్యమునే నిర్వచనోత్తర రామాయణపీఠికలో ఆచార్యుడై ఆంధ్రకవితాలోకమున కుపదేశించినాడు. ఈ ప్రబోధములో అంతవరకు అతివాదులైన కవులపై విమర్శయు గలదు.

శివకవులు ప్రతిపాదించిన 'జాను తెనుగు' 'దేశి రచన' 'అల్పాక్షరముల ననల్పార్థరచన' మున్నగు సిద్ధాంతములపై నిర్వచనోత్తరరామాయణపీఠిక సాహిత్యసమీక్ష. అంతమాత్రమే కాదు. చిరానుభవముచే తాను కళాధర్మము లని గ్రహించిన సూత్రములను తిక్కన ఆంధ్రకవితాలోకమున ప్రతిపాదించినాడు. నిర్వచనోత్తరరామాయణపీఠిక ఒక్కటే తిక్కనకు తెలుగులో ఆలంకారిక లోకమున అగ్ర గౌరవమును అందించగలదు.

ఆనాడు తిక్కనకు కవిగానే గాక, కవితా శిల్పవేత్తగా గూడ ప్రఖ్యాతి గలదు. తిక్కన తెలుగులో నాటకమును వ్రాయలేదని కించపడువా రెందరో కలరు. అలంకారగ్రంథ మైనను వ్రాయలేదని నేను విచారించుచున్నాను. అంతవరకు ఆంధ్రకవితాలోకములో గల భిన్నతత్త్వములను సమన్వయించి చూపిన యుగపురుషుడు తిక్కన. నిర్వచనోత్తర రామాయణపీఠికను, శివకవుల కావ్యపీఠికలను పరిశీలించిన ఈ విషయము స్వయంవ్యక్తము కాగలదు.

"సరళముగాఁగ భావములు
జాను తెనుంగున నింపుపెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితి
పేర్కొన నర్థము లొత్తగిల్ల, బం
ధురముగఁ బ్రాణముల్ మధుమ
దుత్వరసంబునఁ గందళింప, న

తురములు నూత్న లార్యులకుఁ
గర్ణరసాయనలీలఁ గ్రాలగాన్"
(కుమారసంభవము)

నన్నెచోడుని పద్యములోని 'ఇంపుసెంపు'నకు తిక్కన నిర్వచనోత్తరరామాయణములో పూర్వపక్షము నెలకొల్పుచు—

"ఎట్టి కవికైన తన కృతి యింపుసెంప
జాలుగావున కావ్యంబు సరసులైన
కవుల చెవులకు నెక్కినగాని నమ్మ
డెందు పరిణతి గల్గు కవీశ్వరుండు."

అని చెప్పినాడు.

"జాత్యముగాని నొప్పయిన
సంస్కృత మెయ్యెడఁ జొన్ప వాక్యసాం
గత్యము సేయుచో నయిన
గద్యముతోడుగ జెప్పిపెట్ట దా
ర్గత్యము దోఁపఁ బ్రాసముప్ర
కారము వేఱగు నక్షరంబులన్
బ్రత్యనురూప మంచు నిడ
నూరుల కివ్విధ మింపుసెంపదే"
(నిర్వచనోత్తరరామాయణము)

"జాత్యముగాని నొప్పయిన సంస్కృత మెయ్యెడజొన్ప" అను ప్రతిజ్ఞ శివకవు లధిక్షేపించిన "సంస్కృతభూయిష్ఠ ప్రబంధరచన"కు సమాధానము. "వాక్యసాంగత్యము సేయుచో నయిన గద్యముతోడుగ జెప్పిపెట్ట" అను వాక్యము శివకవుల 'ఆరూఢగద్యపద్య' రచనకు, 'ఉరుతరగద్యపద్యోక్తులకు' సమాధానము. ఇక "ప్రాసము ప్రకారము వేఱగు నక్షరంబులన్ బ్రత్యనురూప మంచు నిడ" అనునది శివకవులపై ఎత్తిపొడుపు. ఇట్లే—

"అలవడ సంస్కృతశబ్దము
తెలుగుబడి విశేషణంబు తేటపడంగాఁ
బలుకునెడ లింగవచనం
బులు భేదింపమికి మెచ్చు బుధజనము కృతిన్"

అను నిర్వచనోత్తరరామాయణ పద్యములో చెప్పిన కావ్యదోషములు గూడ శివకవులపై పరోక్ష విమర్శనమే. ఈ పద్యములో తిక్కన పేర్కొనిన ప్రతివిషయమునకు శివకవుల గ్రంథములనుండి ఉదాహరణములను కుప్పతిప్పలుగా గ్రహించవచ్చును. అసలు వీనిని 'జానుతెనుగు'వాదు లగు శివకవులు కావ్యదోషములుగా అంగీకరింపరు.

ప్రాసము:—శివకవులు ప్రాసనియతిని నన్నయ తిక్కనాదులవలె పాటింపలేదు. ప్రాసలో శివకవులకు కతిపయహల్సామ్య మున్న చాలును.

"నమ్మిన భక్తుడు గన్నడ
బమ్మయ సద్భక్తిమహిమ వరికింపగ లో
కమ్ములఁ జోద్యముగాదయ
ధర్మంబును ధర్మమయ్యెఁ దత్త్వాతీతా!
ఇవ్వసుమతిఁ గడుఁగమ్మని
పువ్వులలోఁ బుట్టినట్టి పువ్వులు గొఱయే
సర్వజ్ఞభక్తివిరహితు
డెవ్వడు నుత్కృష్టజాతు డేటికిఁ గొఱయే"
(శివతత్త్వసారము)

తిక్కన నిర్వచనోత్తరరామాయణపీఠికలో "పలుకులపొందు లేక రసభంగము సేయుచుఁ బ్రాతవడ్డ మాటలఁదమ సేర్చు జూపి..."అని కుకవులను నిందించినాడు. కవి సజీవములైన పదప్రయోగము చేయవలెనని నిర్దేశించినాడు. తిక్కనపదప్రయోగకౌశల మొక ప్రత్యేకకళ. ఈ కళావైదగ్ధ్యమునకు అతని రెండు కావ్యములును ఉదాహరణములే. తిక్కన స్వీయ సిద్ధాంతమునుగూడ ప్రతిపాదించినాడు.

'రసభంగము'పై తిక్కన నిష్ఠ జూపుటయేగాక, పదముల కూర్పుపైకూడ తన అభిప్రాయమును 'ఒత్తి' చెప్పినాడు.

"లలితపదప్రౌఢపద్యం
బులనకథార్థంబు ఘటితపూర్వాపరమై
యలతియలతికునియలు గా
హాళసంధించినవిధంబున నమరగవలయున్."

అలతిఅలతితునియలు పూర్వాపరముగ కాహళ నిర్మించినట్లు పదములను ప్రయోగింపవలెనని తిక్కన ఆదేశము. తిక్కన తిరిగి 'సంస్కారము'ను భాషా ప్రయోగమున ప్రవేశపెట్టెను. అటు ప్రాతవడ్డ మాటలుగాని, ఇటు వ్యవహారములో నిసర్గముగ పలుకబడుచున్న సమాసములన్నిటినిగాని తిక్కన కావ్య ప్రయోగార్హము లని చెప్పలేదు. కవితార్థమును గంధవహుడు పుష్పదళంబుల సౌరభ మిచ్చుచందమున వికసింపజేయవలె నని తిక్కనఆశయము.

శైవవాఙ్మయమునకు ఆవేశము ముఖ్యలక్షణము. 'బసవని శరణన్న పాపముల్ పోవు' 'బసవశరణన్న' అను పల్లవితో పాటగా ద్విపద పంక్తులుపంక్తులు నడచిపోవును. కొందరు పండితులు దేశికవితావాదులగు శివకవులు పండితకవులు గారనియు, వారికి వ్యుత్పత్తి కొరవడినదనియు సిద్ధాంతములను నెలకొల్పుచున్నారు. ఈసిద్ధాంతము "జాను తెనుగు"నకు తేటతెనుగను అర్థము చెప్పుటవల్ల సిద్ధించినదేగాని, శైవకవుల ప్రయోగములను సమర్థించగల్గినది గాదు. శైవకవులు-అందు ముఖ్యముగా సోమనాథుడు వ్యుత్పత్తిసంపన్నులు గారని చెప్పుటకు వీలులేదు. వస్తుసందర్శనమునకు వలసిన ప్రతిభ, సాక్షాత్కరించుకొనినదానిని అవగతముచేసికొనుటకు కావలసిన వేదవేదాంతపురాణాగమాదివిషయపరిజ్ఞానసంపన్నమగు వ్యుత్పత్తి, అవగతముచేసికొనినదానిని సృష్టించుటకు కావలసిన ఊష్మలత ఆవేశములును శివకవులందరకును సమృద్ధిగా గలవు. కాని శైవకవిత సార్వజనీనమై సాకల్యసిద్ధి నందకపోవుటకు కారణములు వేరు.

రాజశేఖరుడు కావ్యమీమాంసలో కావ్యహేతువులగు ప్రతిభావ్యుత్పత్తులను వివరించి ప్రతిభను భావయిత్రి, కారయిత్రి అని విభజించినాడు. వస్తుసందర్శనము భావయిత్రి; కావ్యసృష్టి కారయిత్రి. భావయిత్రికి, కారయిత్రికి మధ్య "సమాధి" గలదు. కవిదర్శనము కారయిత్రికి ముందు సమాధిబద్ధమైయుండును. భావయిత్రి, కారయిత్రి మాత్రమే ఉదాత్త కవితాసృష్టికి కారణములు కాజాలవు. సమాధి కొరవడినచో కవికి సాకల్యసిద్ధి లభింపదు. ఆంగ్లకవి వర్డ్‌స్‌వర్తు మహాశయుడు "అనుభవించిన భావావేగమును అనుస్మరణ పూర్వకముగా తిరిగి సృష్టించుట కవిత్వ" మని ప్రవచించినాడు.*

శివకవుల భావావేగము, ఊష్మలత సమాధిని కప్పివేసినది. కాని తిక్కనకు మహాకవి స్థానమును సంపాదించినది ఈ సమాధి. ఒక్క శివకవులకేగాక, ఆవేశపూరితులగు పోతనాదులకుగూడ ఈ సూత్రము అన్వయించును. మార్గకవితను దేశికవితనుండి వేరుపరుచునది సమాధి. దేశికవితకు ప్రత్యేకలక్షణము భావావేగము. శివకవుల దేశికవితావాహిని పర్వతఝురీవేగమున త్రుళ్లింతలాడుచు దుముకుచుపోవుచుండును. తిక్కనకవితాస్రవంతి విశాలశాద్వలభూముల ప్రశాంతముగ ప్రవహించుచు గంభీరమందగమనమున కదలిపోవును. ప్రకృతిసిద్ధములైన ఈ రెండు శక్తులును సారస్వత సృష్టిలో తాండవించుచున్నవి.

తిక్కన నిర్వచనోత్తర రామాయణ పీఠికలో సారస్వతపథమున గల భిన్నశాఖలను సమన్వయించినాడు. భారతపీఠికలో ఆంధ్రలోకమున గల భిన్నమతములను, హరిహరనాథతత్త్వమును ప్రతిపాదించి సమన్వయించినాడు. "హరి మేలంచు హరుండు మేలనుచు ఏలా తర్కముల్?" అన్న నాచనసోముని ప్రశ్నకు మొట్టమొదట సమాధానము నన్వేషించిన తత్త్వవేత్త తిక్కన. ఆంధ్రసంఘములో సారస్వతములో సర్వసమన్వయము సల్పిన ధర్మాద్వైతమూర్తి తిక్కన మహాకవి.

*Emotion recollected in tranquility is Poetry—Wordsworth.



# జ్యోతిర్వేదము



భూమండల పరిమాణము - భూమివయస్సు - దేవుడిచ్చిన సెలవుదినము -
మానవసృష్టి ప్రారంభము - మానవునికి లభ్యమైన ప్రథమ శాస్త్రము -
తెలిసీతెలియనివారి తెలివి తక్కువ వ్రాతలు - వేదఋషుల విజ్ఞానప్రతిభ -

= శ్రీ గొబ్బూరు వెంకటానంద రాఘవరావు =

సూర్యుడు ఉదయించు వేళకు మనము నిద్ర నుండి లేచుచున్నాము; సూర్యు డస్తమించిన తరువాత మనము నిద్రపోవుచున్నాము. మన జీవనమునకు ఆవశ్యకమైన వెలుగు, వేడిమి, విద్యుత్తు మొదలగు సమస్తమును మనకు సూర్యుడే ఇచ్చుచున్నాడు. సూర్యు డొక చిన్న నక్షత్రము. నక్షత్రములు మన సూర్యుని లెక్కచేయని పరిమాణము గల గొప్ప సూర్యులు. ఇటువంటి విశేషములతో కూడుకొనిన ఖగోళసంచారులను గూర్చి చర్చింపకపూర్వము మనము నివసించుచున్న ఈ భూమండలపు పరిమితి ఎంతో, ఇది సృష్టింపబడి ఎంతకాలము గడిచినదో సంగ్రహముగా చర్చించుట మిక్కిలి అవసరము.

మీ కందరకును మైలు అనగా ఎంత దూరమో తెలిసియున్నది. చెన్నపట్టణమునుండి విశాఖపట్టణము ౪౮౪ మైళ్లదూరమునం దున్నది. విశాఖపట్టణమునుండి కలకత్తా ౫౪౬ మైళ్ల దూరమున నున్నది. కాబట్టి రైలురోడ్డు పొడుగునుబట్టి చూచినయెడల చెన్నపట్టణమునకును, కలకత్తాకును మధ్య వేయిన్ని ముప్పది మైళ్ల దూరము కనబడుచున్నది. ఇందులో వంకర టింకర లున్నవి. వచ్చినదారిని తిరిగి వెళ్లుట ఉన్నది. సూటిగా చూచినప్పుడు చెన్నపట్టణ, కలకత్తానగరముల మధ్య దూరము వేయిమైళ్లు అనుకోవచ్చును. భూగోళపు చుట్టుకొలత సుమారు ఇరవైఅయిదు వేల మైళ్లు. అనగా చెన్నపట్టణము, కలకత్తాల మధ్య దూరమునకు ఇరువదియైదు రెట్లు ఉన్నది.

సూర్యగోళపు చుట్టుకొలత ఇరువదియైదులక్షల మైళ్లు. సూర్యగోళము ఆక్రమించిన స్థలములో మన భూగోళమువంటి గోళములు పదమూడు లక్షలు సులభముగా ఇమిడిపోగలవు. సూర్యగోళము ఎదుట మన భూమి ఒక మట్టి ఉండ అనిపించును. అగస్త్యుడు (Canopus) ఆర్ద్ర (Betelgeaux) జ్యేష్ఠ (Antares) మొదలగు బ్రహ్మాండసూర్యులయెదుట మన సూర్యుడు ఒక మిణుగురుపురుగు అని తోచును. ఆ లెక్కను పట్టి చూడగా మన భూమిమీద సముద్రపు ఒడ్డున గల ఇసుకరాసులన్నియు చేర్చినపుడు ఏర్పడు ఇసుక పర్వతము విశ్వ మనుకొంటిమేని, అందలి ఒక ఇసుక రేణువులో పదిలక్షలభాగములలో ఒక భాగము భూగోళ మనిపించు నని సర్ జేమ్సుజీన్సు అను వైజ్ఞానికుడు తెలుపుచున్నాడు. సృష్టిలో మన భూగోళ మనగా నెంత? భూమిమీద మనుష్యు డనగా నెంత? ఆయంశము అటుంచనిండు.

## ఈ భూమి పుట్టి ఎంతకాలమైనది?

పడమటి ఖండములవారికి మతవిషయములలో బైబిల్ పరమప్రమాణము. హీబ్రూజాతివారు, యూదులు, క్రైస్తవులు, సమారితనులు లోనగువారు బైబిలు వ్రాతలనుపట్టి సృష్టికాలమును నిర్ణయించుకొను

చున్నారు. ఈ వ్రాతలు, నిర్ణయములు ఒకవిధముగా నుండుటలేదు. ఒకలెక్క ప్రకారము ఈ భూమి సృష్టి అయి ఇప్పటికి ఏడువేలఇరవై ఆరుసంవత్సరము లైనది; మరొకలెక్క ప్రకారము ఆరువేల అయిదు వందల ఇరవైయారుసంవత్సరముల తొమ్మిదిమాసము లైనది; ఇంకొకలెక్కనుపట్టి ఆరువేల మూడువందల ఏబదిరెండుసంవత్సరము లైనది; వేరొక లెక్కవలన ఆరువేల నలుబదిరెండు సంవత్సరములైనది; గ్రీకుల లెక్క ప్రకారము ఐదువేల ఆరువందల నలుబదిసంవత్సరములు. కాబట్టి పాశ్చాత్యుల బైబిల్ లెక్కలనుపట్టి ఎంత ఎక్కువలో చూచుకొన్నను ఎనిమిదివేల సంవత్సరములలోపేగాని మన భూమివయస్సు అపై దాటదు.

ఇందులో మరొక చిత్రకథ. లోగడ ఏబది-అరువదిసంవత్సరముల క్రిందట ఇంగ్లండుదేశములో ప్రధానిగా నుండిన గ్లాడ్‌స్టన్ (Gladstone)దొర గారు రాజకీయములనుండి తమ దృష్టి కొస్త మరల్చుకొని, బైబిల్ సృష్టిక్రమమును నవీనవిజ్ఞానపరిణామ క్రమముతో సరిపోల్చి సమన్వయమునకు దిగినారు.

భూమిని త్రవ్వుచుండగా కనబడు పొరలను, జంతుశల్యములను పరిశీలించిన జీవశాస్త్రవేత్తలును, భూతత్త్వవేత్తలును ఎన్నో లక్షలు, కోట్ల సంవత్సరములకుగాని అటువంటి పొరలు, అటువంటి శల్యములు గల జంతువులు భూమిలో కనపడజాలవని అంచనాలు వేసినారు. బైబిల్ ప్రకారము సృష్టిక్రమము అంతా ఆరురోజులలో ముగిసిపోయినది. ఆరురోజులును కష్టపడి పనిచేసి ఏడవది యగు ఆదివారమునాడు దేవుడు విశ్రాంతి తీసికొనెను గనుక ఇప్పటికిని ఆదివారము మనకు 'దేవు డిచ్చిన' సెలవుదిన మైనది. బైబిలులో సృష్టిక్రమము వర్ణించినపట్టున 'దినము'అనగా మనము అనుకొనుచున్నట్లు ఇరువదినాలుగుగంటల కాలపరిమితి గల దినము కాదనియు, అచ్చట దిన మనగా ఒక యుగ మని అర్థము చెప్పుకోవలె ననియు గ్లాడ్‌స్టన్ ప్రధాని అర్థము చెప్పినాడు. ఆలాగున అన్వయించుకొంటిమేని ఈనాటి శాస్త్రవేత్తలు చెప్పిన పరిణామ క్రమము (Evolution) నకు, కాలమానమునకు సరిపోవు నని వ్యాఖ్యానము కూడ వ్రాసినాడు.

అందుపైని హగ్‌స్లీ (Huxley) అనే ప్రకృతి శాస్త్రవేత్త ప్రధాని వ్రాసిన వ్రాతలను అందుకుని తీవ్రముగా విమర్శించినాడు. "అబ్బో! అలాగునా? దిన మంటే యుగ మని అర్థము చెప్పుకోమన్నారా? ఊహలమీద ఊహలు పన్నుకుంటూ ఎవ రెంత గట్టి పట్టు పట్టి సాగతీసినా, దినము ఒకయుగము పొడుగుకు సాగుతుందా?......ఇన్నిమాట లెందుకు? సృష్టి పూర్తిచేసి దేవుడు విశ్రాంతితీసుకున్న దినముకుకూడా యుగ మని అర్థం చెప్పి, గ్లాడ్‌స్టన్ ప్రధానిగారు గవర్నమెంటు ఉద్యోగస్థు లందరికీ ఆదివారము ఆరు గంటలు కాక ఒకయుగము సెలవిచ్చి పనిపుచ్చుకోకుండా ఒక యుగకాలం జీతా లిస్తా మని ఆర్డరు వేయిస్తారా?" అని సవాలుచేసినాడు. అందుకు జవాబు చెప్పలేక గ్లాడ్‌స్టన్ ప్రధాని మౌనము ధరించవలసి వచ్చినది.

భూమిని త్రవ్వగా బయల్పడు పొరలను పట్టి భూమిపుట్టి బహుకాలమైనట్లు చెప్పుచున్నా రంటిమి. ఈపొరలకును, భూమివయస్సునకును సంబంధ మేమని మీరు ప్రశ్నింపవచ్చును. ఈసంశయము తీరుటకు ఒక చిన్న ఉదాహరణము. వేసవిలో మన ఇండ్లలో కొందరు మామిడితాండ్ర తయారుచేయుచుందురు. ఒక చాపమీద ఒకనాటి ఉదయము మామిడిపండ్ల రసము పోసి నెరిపి ఎండబెట్టుదురు. ఆరసము ఎండలో సాయంకాలముదాక ఎండి ఒక పొర ఏర్పడును. మరునాడు ఉదయముకూడ క్రొత్తరసము పోసి అలాగే ఎండబెట్టినపుడు మరొక పొర తయారగును. ముప్పదిపొరలు గల తాండ్రచాప పైవిధముగా నెలరోజులు రసము పోయుచు ఎండబెట్టినగాని తయారుకాజాలదు. అదే విధముగా కొన్ని లక్షలు, కోట్లు సంవత్సరములకుగాని భూమిని త్రవ్వగా ఇపుడు బయల్పడు వింత వింతపొరలతో భూమి ఏర్పడజాలదని భూతత్త్వవేత్తలు (Geologists) నిర్ణయించుచున్నారు. ఈ

శాస్త్రాంశములు తెలియక "మూడు నిమిషములలో ముప్పదిపొరల తాండ్ర తయారైనది"అనుట ఎంత హాస్యాస్పదమో, భూగోళము పుట్టి ఎనిమిదివేల సంవత్సరములకు మించదని తెలుపుటకూడ అంతే హాస్యాస్పదము. అబదము అగుచున్నది.

ఇటీవల స్వతంత్రముగా పరిశోధనలు చేయుచున్న సత్యప్రియులగు వైజ్ఞానికులు తమకు లభించిన సాక్ష్యసంపదలను పట్టి భూగోళము ఏర్పడి పదికోట్ల సంవత్సరములకు తక్కువ కాదని కొందరు, ముప్పది కోట్లని కొందరు, ఏబదికోట్లని కొందరు, నూరుకోట్ల సంవత్సరముల పైమాట అని కొందరు—ఈప్రకారముగా క్రమక్రమముగా భూమికి వయస్సు ఎక్కువలో తెలుపుచున్నారు.

## సర్ జేమ్సు జీన్సు

ఇంగ్లండుదేశములో బహుసుప్రసిద్ధుడైన ఈ వైజ్ఞానికుడు జనసామాన్యమునకుకూడ సులభముగా బోధపడునట్లు మంచిమంచి గ్రంథములు వ్రాసి, సత్యప్రియుడై విజ్ఞానము వెదజల్లుచున్నాడు. ఇతడు భూతత్త్వము (Geology); ధాతుశాస్త్రము (Chemistry); భౌతికశాస్త్రము (Physics); జ్యోతిశ్శాస్త్రము (Astronomy); జీవశాస్త్రము (Biology)లోనగు బహుశాస్త్రములు సమకూర్చిన సాక్ష్యమును చక్కగా సమన్వయించుకొని, ఈ భూమి ఏర్పడి ఉరమరగా ఇప్పటికి రెండువందలకోట్ల సంవత్సరము లయియుండునని తెలియజేయుచున్నాడు. చిల్లర అంకెలను పరిహరించి, 'పూర్ణ మిదం'అని గుండ్రని అంకెలతో ఇత డిచ్చిన ఉరమరలెక్క ఈనాటి వైజ్ఞానికుల ఆమోదము బడసినది.

## మన పంచాంగములు ఏమి చెప్పుచున్నవి ?

ఈనాటి మన పంచాంగకర్తలు పీఠికలలో "సృష్ట్యాదిగతాబ్దాః ౧౯౫౫,౮౮౫,౦౫౫,౦౮౬ — నూట తొంబదియైదుకోట్ల ఏబదియెనిమిదిలక్షల ఎనుబదియైదు వేల నలుబదియారుసంవత్సరము లైనదని తెగవేసి వ్రాయుచున్నారు. ఇది ఉరమరలెక్క కాదు. చిల్లరఅంకెలను గుండ్రపరచి వ్రాసినది కాదు. స్పష్టముగా, స్ఫుటముగా, ఢంకామీద దెబ్బకొట్టి సరిచూచి తేల్చినది. ఈ యంకె ఎలాగు వచ్చినదో వివరించి తెలుపవచ్చును. కాని అప్రస్తుత మని గ్రంథవిస్తర భీతిచే విడిచినాను.

## జీవకోట్ల ఉత్పత్తి; మనుష్యుల ఉత్పత్తి

భూమి పుట్టి సుమారు రెండువందలకోట్ల సంవత్సరములైనను, చైతన్యము గల జీవజాతుల ఉత్పత్తియై ముప్పదికోట్లసంవత్సరములుమాత్ర మైనదనియు, ఆ జీవజాతులు అనేకవిధములైన అద్భుతపరిణామములు పొందుచు రాగారాగా భూమిమీద మనుష్యుడుతోలుత ఉత్పత్తియై మూడులక్షల సంవత్సరములుమాత్రమే అయియుండుననియు జీన్సుపండితుని అభిప్రాయము.

## జ్యోతిర్విజ్ఞానము

వేలుకాదు, లక్షలు—ఎంతకాలమట కానిండు. ఈ భూమిమీద మానవులు సృష్టింపబడినదిమొదలు ప్రకృతిసిద్ధముగా కొన్ని వెలుగులు కండ్లపడుట తటస్థమైనది. ఆ వెలుగులలో పెద్దదిగా కనబడునది పగటివేళ సూర్యమండలము; రాత్రివేళ చంద్రమండలము. సూర్యచంద్రులనుమాత్రమే కాక, ఆ తొలికాలపు మనుష్యులు వినీలమైన ఆకాశరంగమున ముత్యముల లాగున మిలమిలలాడుచు, కెంపులవలె ఎఱ్ఱగా మెఱయుచు, వజ్రములవిధమున ధగధగలాడుచు, వింత కాంతులతో తేజరిల్లు నక్షత్రములను చూచి సంతోషాశ్చర్యములను పొందుచుండిరి.

నిశితమైన దృష్టితో సూక్ష్మమైన పరిశీలనము; తెలివితేటలతో యోచన-ఇవి యున్నపుడే ఏశాఖలోనైన విజ్ఞానాభివృద్ధి యగును జాగ్రతగా చూచి కనిపెట్టిన అంశములను సహేతుకముగా చర్చించుకొనుచు సత్యము నన్వేషింపవలెను. భూమిమీద మన చేతి కందుబాటులో నున్న వస్తువులను మనము పట్టు

కోగలము; ఒకదాని కొకటి చేర్చగలము. ప్రయోగములు చేయగలము. చేసినది, చూచినది సమన్వయించుకొని ప్రకృతిచర్యల యథార్థతత్త్వము గ్రహింపయత్నింపగలము.

కాని ఖగోళచారులు మనకు అందవు; మనము చెప్పినట్లు వినవు. అయినను ఏ శాస్త్రవిజ్ఞానముకంటెను జ్యోతిర్విజ్ఞానమే మానవులకు తొలుత లభ్యమైనది. అమావాస్యచీకటిలో కాలవగట్లను, మొక్కమోడులమధ్య జిగజిగమెఱయు మెఱుగుడుపురుగులవలె విశాలాకాశమున వింతవింతకాంతులతో ప్రకాశించు గ్రహనక్షత్రాదులను చూచి సంతోషాశ్చర్యములను పొందజాలని 'నరమానవులు' అరుదు.

ఆదికవియైన భగవంతుడే ఈ నక్షత్రమహాకావ్యమును రచించినాడు. "చక్కగా చదువుకోండి" అని మనుష్యజాతికి అనుగ్రహించినాడు. ఈ గ్రంథము బహుకష్టసాధ్యము లైన చిక్కుసమస్యలతో కూడుకొని ఉన్నది. అయితే ఈ గ్రంథమును మన పూర్వ ఋషులు ఎట్లు అందుకొన్నారు? ఇందలి సమస్యలను ఏవిధముగా బోధపరుచుకొన్నారు? ఈ సమస్యలను వారు ఏలాగు సాధించినారు?అనునవి మనము బాగుగా చర్చించి తెలిసికోవలెను.

## మిథ్యాపవాదము

"హిందూదేశపు వేదఋషులు హోమగుండముల కడ కూరుచుండి, పుల్లలను పుడకలను, కర్రలను కంపలను గుండములో వేయుచు, 'ఇంద్రాయ స్వాహా-వరుణాయ స్వాహా' అని యరచుచు నేయి పోసి జ్వాల లెగబెట్టుచు, పొగకమ్మి కన్నులు కనపడక, దుమ్ముధూళి మధ్య చీపికనులతో కాలక్షేపము చేసినారు. అంతేకాని వా రెప్పుడైన కను లెత్తి సూర్యచంద్రులను చూచినారా? నక్షత్రములను చూచినారా? రాసుల సంగతి రవంతైన వా రెరుగుదురా? వెయ్యింటికి పైగా ఉండే ఋగ్వేదసూక్తాలలో అగ్నిసూక్తాలెన్ని? 'యమసూక్తా లెన్ని? వారికిన్ని, వారు పూజించే దేవతలకున్నూ అత్యంతప్రియమైన సోమరసంమీద చెప్పిన సూక్తాలెన్ని? సూర్యచంద్రుల మీద చెప్పిన వెన్ని........తెల్లవారగట్ల లేచే అలవాటు వారికి ఉండేది కనుక ఉషస్సును గురించి మాత్రము చక్కని సూక్తాలు కొన్ని రచించినమాట నిజం" అన్నారు యూరపుఖండపు విమర్శకులు కొందరు—ఋగ్వేదము చదివీచదవకుండా, తెలిసీ తెలియని మిడిమిడిజ్ఞానంతో. కాని ఆ వేదము చదివి అర్థము చేసికొన్న పండితులు మాత్రము అలాగు నిందించలేదు. సరేకదా, వారి ప్రతిభను ఈ విధముగా మెచ్చుకున్నారు: "The Vedic Rishis appear to have combined the characteristics of Poets and Scientific Observers of the Heavens"

నిజము తరచి చూడగా, మానవజాతియొక్క భావములు, అనుభవములు, విజయములు లోనగు విశేషములను తొలుత గ్రంథస్థము చేసిన అత్యంతప్రాచీన వాఙ్మయము ఋగ్వేదమే. అనాదికాలమునుండి మిణుకుమిణుకుమనుచు మెఱయు చుక్కలతో మిక్కిలి మనోహరమై చూపట్టు నభోరంగమును వేదఋషులు సునిశితదృష్టితో పరిశీలన చేసిరి. ఖగోళమునందు నక్షత్రములను అక్షరములతో భగవంతుడు స్వయముగా వ్రాసి ప్రకాశింపజేసిన జ్యోతిర్వేద సంపుటములను వారు దీక్షతో పఠించిరి. అందు గోచరించెడి సమస్యలను సాధించుటకు పూనుకొని ఆ మహనీయులు తమ మనస్సులను నక్షత్రాదులైన ఖగోళచారులందు లగ్నము చేసి, వాని చలనవిశేషములను బహుశ్రద్ధతో గమనించిరి. మంత్రరూపము లైన రసవత్తరకావ్యములలో మహనీయఖగోళవిజ్ఞానమును చక్కగా మిళితముచేసి పాకముపట్టి సూక్తరూపమైన ఋగ్వేదమును శాశ్వతముగా వెలయించిరి. ఖగోళమువంక వారు కనులెత్తి చూడనైన చూడలేదనుట వట్టి యబద్ధమని ఋజువు

1. Page 130. Ancient calendars and Constellations by Emmeline. M. Plunket.

చేయుటకు రెండు మూడు మంత్రములు వ్రాయుచున్నాను.

"భూమిమీద ఎంతో ఎత్తుగా నున్నట్లు కనబడు ఆకాశరంగమునందు రాత్రులు ఎంతో చక్కగా మెఱయుచుండిన నక్షత్రములు పగటివేళ ఎక్కడికి పోవుచున్న" వని ఋషిసునశ్శేఫుడు పృచ్ఛచేసెను.[2] "ఆవఱకు ఆకాశరంగమున అద్భుతముగా మెఱయుచుండిన చుక్కలు, విశ్వమునకు నేత్రమువంటివాడగు సూర్యుడు ఉదయించు వేళకు చల్లచల్లగా జారి దొంగలవలె అదృశ్యమైపోవు" నని ప్రస్కణ్వ ఋషి వివరించెను.[3] దీర్ఘతమ ఋషి అద్భుతమైన నిగూఢాలంకారయుక్త రచనలో సంవత్సరస్వరూపమును సాంగోపాంగముగా వర్ణించినాడు.[4]

"చక్రము ఒక్కటే. దానికి నాభిస్థానములు మూడు. నేమికమ్ములు పంద్రెండు. అంటే ఎవరికైనా ఏమైనా బోధపడినదా? ఆచక్రపు రేకులు మున్నూటఅరువది. ఆ రేకులు బిగియగట్టియున్నవి. కనుక వదులుచేయుటకు, ఊడతీయుటకు వీలులేదు."

ఇందు చక్రము సంవత్సరాత్మకమైన కాలచక్రము. దానిలో ఒక్కొక్కటి నాలుగేసిమాసముల చొప్పున ముఖ్యమైన ఋతువులు మూడును మూడు నాభిస్థానములుగా వర్ణింపబడినవి. నేమికమ్ములు పంద్రెండును పంద్రెండు మాసములు. సడలించరాని మున్నూటఅరువదిరేకులును మున్నూటఅరువదిదినములు.

మహాభారతమునందలి ఆదిపర్వములో ఉదంకుడు కుండలములనిమిత్తము నాగలోకమునకు పోయినప్పుడు కూడ కాలచక్రము చూచినట్లు వర్ణింపబడినది. (మా. I. ౧. ౧౧౬-౧౧౭.)

"నాగ
భువనంబులో గన్న పొలతు లిద్దఱు ధాత
యును విధాతయు వారి యనువయించు
సితకృష్ణతంతురాజితతంత్రమది యహో
రాత్రముల్ ద్వాదశారములు గలుగు
చక్రంబు మాసాత్మసంవత్సరంబు గు
మారు లయ్యాఱ్వురుమఱియు ఋతువులు.

"2. అమీయఋక్షానిహితాస ఉచ్చా,
నక్తం దదృశ్రేకహచిద్దివేయుః."
(ఋగ్వేదము I. ౨౪. ౧౦)

3. "అపత్యేతాయవోయథానక్షత్రాయంత్యక్తుభిః, సూరాయవిశ్వచక్షసే." (ఋ. I. ౫౦-౨)

4. "ద్వాదశప్రథయశ్చక్రమేకంత్రీణి నభ్యానికఉతచ్చికేత, తస్మిన్త్సాకం త్రిశతానశంకవోర్పితాషష్టిర్నచలాచలాసః." (ఋ. I. ౧౬౪-౪౮)





కృషి ద్విగుణీకరి

కత్రుతోబాటు ఎరువుకూడా నేల పోయే ఈ కొత్తరకపు నాగలివల్ల అమెరికాలో భూసారాన్ని ఎక్కువ చేయడాని అవకాశం లభించింది
అమెరికనుశాస్త్రజ్ఞుల నూతనపరిశోధనలలో ఇది ఒకటి.

# సాహిత్యతత్త్వము

## = శ్రీ 'అమరేంద్ర' =

ఒకనికి తాను పెక్కుమందిలో అవతరించాలని కోరిక పుట్టింది. ఆ కోరికకు ఫలితమే సృష్టి. నాలో వున్న ఈ ఒక్క ఆత్మ పలువురి ఆత్మలతో బాంధవ్యం కలుపుకుంటూ తన్ను తాను తెలుసుకోవాలని ప్రయత్నిస్తుంది. ఈ ప్రయత్నం సిద్ధించటమే నా ఆత్మకు వైభవం. రూపం, భావం, జ్ఞానం, ఘటనా తరంగాలుగా వచ్చి నా చైతన్యాన్ని తాకగానే అది "నేనున్నాను" అంటూ బదులు చెప్పుతుంది. "అక్కడ అవి ఉన్నవి", "ఇక్కడ నేనున్నాను" అనే ఈ రెండు భావాలూ కలుసుకొనటమే నా జీవితంలోని విశేషం. ఈ రెంటినీ కలియనీయకుండా ఏదైనా అడ్డి పడినప్పుడు నా ను నేను సరిగా తెలుసుకోలేకపోతాను. అటువంటి కలయిక ఎంత బాగా సిద్ధిస్తే అంత ఆనందం. ఆ కలయిక తెలిసీ తెలియనంత స్వల్పంగా వున్నప్పుడు నాకు నిస్పృహ, నిరాశ. ఏకాంతవాస శిక్షలో వున్న భరింపరాని బాధ యేమంటే మనిషిని ప్రపంచంనుంచి దూరంచేసి, అతనిలో భావసంచలనాన్ని కలిగించే వస్తుజగత్తునుంచి ఎడంచెయ్యటమే.

వెలుపలి జగత్తుతో మనలోపలి ఆత్మకూ, మన లోపలి ఆత్మతో ఈ వెలుపలి లోకానికీ కలిగే ఈ కలయికకు రెండు కారణాలు. ఒకటి అవసరమూ, రెండు భావమూ. అవసరంవల్ల ఏర్పడే కలయిక చాలా పైపైనే వుంటుంది. భావంవలన కలిగే కలయిక చాలా గొప్పది. ఈ కలయికవలన మన చైతన్యమూ, వ్యక్తిత్వమూ వృద్ధిపొందుతవి. అటువంటి గొప్ప కలయిక వలనా, ఆత్మవికాసంవలనా కలిగే అపారమైన ఆనందాన్ని మనకు ప్రసాదించడమే సాహిత్యానికీ, కళలకూ లక్ష్యం.

కొందరు సాహిత్యం సౌందర్యంద్వారా ఆనంద మిస్తుందని అంటున్నారు. దీని విషయ మేమిటో కొంచెం తరచి చూడవలసిందే. అయినా సౌందర్యమంటే ఏమిటి అనే అనవసరమైన మీమాంస మనకు వద్దు.

ప్రపంచంలో సౌందర్య మనేది కొన్ని వస్తువులలోనూ, విషయాలలోనూ నివసించుతున్నట్లు మనకు కనబడుతుంది. గులాబిపువ్వుకు రేకు లున్నయ్, కాడ వుంది, చుట్టూ పచ్చటి ఆకు లున్నయ్. ఇవికాక వీటి అన్నిటివలనా కలిగే ఒక మధుర భావం ఆ పువ్వులో కనబడుతుంది. అదే సౌందర్యం. అది ఆకులనూ, రేకులనూ మించిన ఆకర్షణ. రకరకాల అనుభవాలను ఒకసూత్రాన బిగింపజూచే మన ఆత్మను ఈ సౌందర్యమే రంజింపజేస్తుంది. వేరువేరు వస్తువుల నొకచోట కూర్చటంవలన ఒక అందం వస్తుంది. అది కేవలము కల్పితమైన అందమే కాని సహజసౌందర్యం కానేరదు. గులాబిపువ్వులో వున్న వేరువేరు భాగాలను ప్రకృతి చక్కగా కూర్చింది. ఆ కూర్పువలన వేరువేరు భాగాల కొక చిత్రమైన ఐక్యం చేకూరి, గులాబిపూవుగా విరిసింది. ఈ ఐక్యంలోనే ఒక్క రేకులో గాని, ఒక్క ఆకులో గాని మనకు దొరకనటువంటి సౌందర్య మున్నది. అది ఆగులాబి సంపూర్ణ స్వరూపంలో సాక్షాత్కరిస్తుంది.

---

* వంగీయవిశ్వవిద్యాలయంఆధ్వర్యాన రవీంద్రుడిచ్చిన ఉపన్యాసానికిది తెలుగు.

# భారతి - పార్థివ జ్యేష్ఠము

భావభరితమైన శబ్దము తే సాహిత్య మని మన ఆలంకారికు లంటారు. సౌందర్యం భావసంచలనం కలిగించగలదు. కాని సౌందర్యమే భావా లన్నిం కారణం కాదు. అయినప్పటికీ, భావా లన్నిటి ఒక సామాన్యలక్షణ మున్నది. అవి మన లోపలి చొచ్చుకునిపోయి మన ను గజగజ వణికించ గలవు.

మనిషికి నీరు కావాలి. నీటిని మోసుకొచ్చేం దుకు పాత్రలు కావాలి. అయితే నీటికుండను అందంగా ఎందుకు తయారుచేయాలి? అందంగా లేకపోయినా నీటిని మోసుకో రావచ్చును గదా? అవసరం గడిపినంతమాత్రాన మనిషి తృప్తిపడి ఊరు కోడు. అందమైన కుండతో నీళ్లు తెచ్చేటప్పుడు దాని బరువుమాట మనిషికి తోచదు. కేవలం అవసరం కోసం వెలసిన కుండ ఆ అవసరాన్ని నిర్వర్తించటమే గాక, ఒక అందమైన రూపంతో అతనికి ప్రియమైన వస్తువుగా మారిపోయింది. మనిషి పుట్టినప్పటినుంచీ ఇల్లాగే జరుగుతోంది. ఈరోజుల్లో మనిషికి అవసరమే అన్నిటికంటె ముఖ్యమైపోయింది. అందంకోసం కాలం వెచ్చించేటందుకు వీలులేకుండాపోయింది. అందువల్లనే ఒక వెదురుబద్ద బుజాన వేసుకుని దానికి రెండు కొమ్మలా రెండు అందంలేని, సొట్టలుపడ్డ కిరొసినాయిలుడబ్బాలు కట్టి నీళ్లు మోసుకు పోతున్నారు. అవసరమే అందాన్ని ఓడించివేసింది.

అవసరంకంటె అందమే ముఖ్యమైన చోటు, కనబడే వస్తువులే మసకగానూ, ఆదర్శాలే స్థూలమైన సత్యాలుగానూ తెలిసే చోటు కళకూ, సాహిత్యానికీ ఆటపట్టు. అక్కడ వర్ణించలేని స్వేచ్ఛ. అట్టిచోట మానవజీవితంలోని దుర్భరభారాలన్నీ మటుమాయమై పోతయ్. అక్కడ అన్ని మానవాత్మ పరిపాలించ గలుగుతుంది.

ఈ విశాలమైన నేల, దీనిచుట్టూ పొరలుపొర లుగా ఆవరించిన గాలి, ఆ గాలినే పీల్చుతూ నేల మీది జీవుల కలకల. ఈ గాలిపొరలలోనే జీవిత మనే చిత్రకారుడికి ఎన్నో వెలుగులు, ఎన్నో రంగులు. వాటితోనే ఎన్నోరకాల బొమ్మలు గీసి నేల అంతా వింతలతో నింపివేస్తాడు. ఇదే మనకు శబ్దంలోనూ రూపంలోనూ భూమిమీద కనబడే తుదిలేని ఆట. ఇదే ఎప్పటికప్పుడు కొత్తగా తోచే సృష్టి. మనిషికి కూడా ఇటువంటి వాతావరణం కావాలి. అక్కడ అవసరమనేది అడ్డుతాకరాదు. అంతులేని తీరిక వుండాలి. అప్పుడు మనిషికూడా సృష్టికర్తగా మారి తన సృష్టితో ఆటలాడుకుంటాడు. తన సృష్టిలో తన ఆత్మను వ్యక్తంచేస్తాడు. ఈసృష్టికి ప్రయోజ నంతో పనిలేదు. ఈ సృష్టివలన మానవుడు తన చుట్టూ వున్న జగత్తులో మెల్లిమెల్లిగా లీనమౌతాడు. ప్రపంచం మనిషిమనసుముందు నిలిచి తలుపుతట్టు తుంది. ఇదుగో వస్తున్నా, నీతో కలిసిపోతానంటూ మనసు మారుపలుకుతుంది. తనకు వెలుపల వున్న విశాలప్రపంచంతో కలిసిపోవాలనే కోరిక సాహిత్యం లోనూ, కళలోనూ వెలువడుతుంది.

ఉద్రేకం నిత్యజీవనంలో మన పనులన్నిటి లోనూ కనబడుతుంది. మనను రక్షించుకునేప్పుడూ, మన శత్రువుల నోడించేటప్పుడూ, మన సంతతిని వృద్ధి చేసేటప్పుడూ ఉద్రేకమే ఆ పనులలో ఉత్సాహమూ, సంతోషమూ పురికొలుపుతుంది. ఈ పనులను చేయ టంలో మనిషికీ, జంతువులకూ తేడా లేనేలేదు. ఇది నేను చేసితీరాలి అనే నిర్బంధాన్నీ, అందులోవున్న బాధనూ మరిచిపోయి, తన ఊహను ఆధారంగా చేసుకుని, ఆ ఊహమూలంగా ప్రతిఫలంతో నిమిత్తం లేని ఆనందాన్ని పొందగలగాలి. అప్పుడే మనిషి గొప్పతనం బయటపడుతుంది. అందువల్లనే మనిషి వినాశకరమైన పనులు చేసేటప్పుడుకూడా అవసరం లేని అందంకోసమే ప్రయత్నిస్తాడు. యుద్ధానికి తరలివెళ్లేటప్పుడు చంపటానికి ఉపయోగించే ఆయు ధాలను మోసుకుపోవటంతోటే తృప్తిజెందడు. పిట్టల ఈకలతోనూ, రంగులబట్టలతోనూ వొంటిని అలంక రించుకుంటాడు. భేరీధ్వనులతోనూ, తూర్యరావాల తోనూ కదనులు తొక్కుతూ ముందడుగువేస్తాడు.

# సాహిత్యతత్త్వము

ఒకప్పుడు మనిషి తన లోపలి భావాలకు ఆకారమివ్వటంకోసం తనచుట్టూ ఉన్న ప్రకృతి అంతటిలోనూ వెదుకుతూ తిరుగుతూవుంటాడు. ప్రేమికుడు విరియబూసిన పూలతోటలలోనూ, భక్తులు నదీతీరాలలోనూ, సాగరతటాలలోనూ, కొండకోనలమీదనూ తిరుగాడుతారు. తన లోపలి భావాలతో సరిపోయే వాటికోసం నీలిమబ్బుల ఆకాశంలోనూ, నునుపైన లేతపచ్చికబయళ్లలోనూ వెదుకుతాడు. వాటిలో మనిషికి తన చిరకాలమిత్రు డెవడో కనబడుతాడు. మనలోపలి ఆత్మ ఈ వెలుపలి ప్రకృతిలో కనబడే పరమాత్మముందు తలవంచి నిలబడినపుడే పూలలో వున్న సౌందర్యంతోనూ, ఫలాలలో వున్న మాధుర్యంతోనూ మన కొక గొప్ప మైత్రి ఏర్పడుతుంది. అప్పుడు అన్నిటితోనూ మనకు సంబంధ మేర్పడుతుంది. అటువంటి మైత్రి దేనితో నాకు ఏర్పడుతుందో అదే నా దృష్టికి సత్యమైన వస్తువు. అట్టి వస్తువు నా కెంతో ప్రియమైనది.

దుఃఖమంటే మనిషి భయపడి దూరంగా తొలగిపోతాడు. ఇది కొందరి విషయంలోనే నిజం. మరి కొందరు గొప్ప మనుషులు బాధను సరకుచేయక, తెలిసివుండికూడా ప్రమాదాలలోనూ, ఆపదల్లోనూ చిక్కుకొని అసంభవమనేది మాకు తెలియనే తెలియదని పాటుపడతారు. ఎందుకని? లాభంకోసం కాదు. తమ ఆత్మను తాము దుఃఖం మూలంగా తెలుసుకోటంకోసం. అల్లా తెలుసుకోవటంవల్ల కలిగే ఆనందం కోసం. ఇతరుల దుఃఖంకూడా మనకు ఇటువంటి జ్ఞానాన్నీ, ఆనందాన్నీ ఇవ్వగలదు. అందువల్లనే చిన్నపిల్లలు ఒకరి నొకరు పీడించుకుని సంతోషపడతారు. అందువల్లనే దుఃఖాంతాలుగా వుండే నాటకాలంటే అందరికీ ఇష్టం.

దుఃఖం మన చైతన్యాన్ని మేలుకొలపటానికి చాలా అవసరం.

పారుదలలేని నీటికంటే, కదలి ఆడని గాలికంటే శూన్యంగా వున్న మనస్సే మనిషికి దుర్భరంగా వుంటుంది. శూన్యంగా వుండకుండా మనిషిలోపలి చైతన్యమంతా "నేనున్నాను, నేనున్నాను" అనే భావంతో నిండిపోయినప్పుడు చుట్టూవున్న అంతులేని ప్రకృతిలోనుంచి "నేనున్నాను" అని పరమాత్మ చెప్పే సమాధానం వినబడుతుంది. ఆసమాధానం వినగల శక్తిని సంపాదించినప్పుడు సుఖదుఃఖాల నడుమ నున్న భేదం నశించిపోయి ఆత్మజ్ఞానంవలన కలిగే ఆనంద మొక్కటే మిగిలివుంటుంది. దినదినమూ తన సంపదలను పెంపొందించాలని మనిషి పాటుపడతాడు. అదే విధంగా తన చైతన్యాన్ని విస్తరింపజేసుకోవాలని కళలలోనూ, సాహిత్యంలోనూ పాటుపడుతున్నాడు. తన్ను తాను పూర్తిగా తెలుసుకోవాలన్న కోరికే ఈ కృషికి లక్ష్యం. ఇన్నాళ్లనుంచీ మనిషి భద్రంగా కూడబెట్టుతున్న కళలనూ, సాహిత్యాన్నీ ఏదైనా ఉపద్రవం వచ్చి నాశనంచేసివేస్తే—ఏమౌతుంది? మానవజీవన మొక నిస్సారమైన ఎడారిగా మారిపోదూ!

కనుక సౌందర్యమే సాహిత్యానికి పరమావధి కానేరదు. సౌందర్యాన్ని కనుగొనటంలో ఎన్నో అంతస్తు లున్నయ్. మొదటి అంతస్తులోనే సౌందర్యం తేలికగా తెలుస్తుంది. పై అంతస్తులకు పోయినకొద్దీ అందమైన దేది, అందవికారమైన దేది అని తెలుసుకోవటం కష్టమైపోతుంది. మన ఇంద్రియాలు ఒక వస్తువు అందంగా ఉందని చెప్పినంతలో నమ్మటానికి వీలులేదు. బుద్ధిని కూడా ఉపయోగించవలసివుంటుంది. అప్పుడే పైపైమెరుగుల ఆకర్షణకూ, నిజమైన విలువకూ భేదం కనిపెట్టవలసివస్తుంది. నిజమైన విలువ గల వస్తువే మనకు ఎక్కువ ఆనంద మివ్వగలదు. విన్నవెంటనే సినిమాపాట మనసును ఆకట్టుతుంది. కొంత సంస్కారమూ, కొంత శిక్షణా వుంటేనే కాని శాస్త్రీయమైన సంగీతంలో వున్న మాధుర్యం అనుభవించలేము. అయినప్పటికీ శాస్త్రీయమైన సంగీతం కలిగించే ఆనందమే గొప్పది.

ఇది గ్రహిస్తే సాహిత్యాని కున్న ముఖ్య లక్షణం వెంటనే తెలుస్తుంది. మామూలుగా, మన చూపులకు ఇంపుగా కనబడిన వస్తువులు అందంగా వున్నవని చెపుతాం. ఆ వస్తువులలో అందరికీ అందం

గా కనబడే విషయాలను గురించి చెప్పటంలో విశేష మేమీ లేదు. వాటిలో మన చూపుల కందని అందాన్ని ఒక తీయని మాటలో ధ్వనింపజేయటమే సాహిత్యా నికి లక్ష్యం.

ఈ లోకంలో చాలా వస్తువులు విశేష మేమీ లేని అతిసామాన్యవిషయాలు. వీధుల వెంట వేల ప్రజలు సాగిపోతున్నారు. వా రంతా ఒక పెద్ద గుంపు. ఆ గుంపులో ఎందరో వ్యక్తు లున్నారు. కాని వారి వ్యక్తిత్వమంతా ఆ గుంపులో కలిసిపోయింది. నా మీదనే నా కెంతో ఆసక్తి. నా దృష్టిలో నేనే ఒక ప్రత్యేకమైన వ్యక్తిని. ఇంకొక మనిషిమీద నాకు ఆసక్తి ఎప్పుడు కలుగుతుంది? మా ఇద్దరిలోనూ ఉన్న సామాన్యధర్మాన్ని నేను తెలుసుకోగలిగినప్పుడు. ఒకసారి జరిగిన సంఘటనను చెబుతాను, వినండి.

అప్పుడు నే నొక పల్లెటూరిలో వుండేవాడిని. ఒంటరివాడిని. ఒక్కడే నౌకరుండేవాడు. చీపురు కట్టతో తెల్లవారకమునుపే వచ్చి రాత్రి పొద్దుపోయి నాక ఇంటికి తిరిగి వెళ్లేవాడు. ఆమనిషిలో చెప్పుకో దగిన లక్షణ మొక్కటీ లేదు. మూగతనమే అతని గొప్పగుణం. అతను పనిలోకి రానిరోజున, చీదరగా వున్న నాగదిని చూసీ, స్నానానికి నీళ్లు తోడివుంచక పోవటాన్ని బట్టీ నౌకరనే మనిషిమీద ఆలోచన పోయేది. ఒకనాడు మామూలు వేళ దాటినాక పని లోకి వచ్చాడు. "ఇంతవరకూ ఏం చేస్తున్నావ్" అని అడిగాను. "ఇవాళ పొద్దున నా కూతురు చచ్చిపోయిం దయ్యగారూ" అని చెప్పి పనిచేసుకోటం మొదలు పెట్టాడు. వినగానే నా ఒళ్లు జలదరించింది. ఇన్నాళ్లీ ఎడంగా వున్న ఆ నౌకరుమీద ఒక్కసారిగా జాలి కలిగింది. ఆ దుఃఖమే, అతని మానవహృదయంతో నాకు సంబంధం కల్పించింది.

సుందరమైన వస్తువులమీద సృష్టికర్తసంతకే మున్నది. కనుకనే వాటికి అన్నితావులలోనూ ప్రవేశ మున్నది. అంతటా వాటికి గొప్ప స్వాగతం. కాని ఇదేమి చిత్రమో! నా ముసలినేవకుడొక్కసారిగా నా మనస్సంతనూ వశపరుచుకోటానికి కారణ మేమో? అతన్ని అందగా డనటానికి ఏమాత్రం వీలులేదు. అందరిలాగే అతనూ ఒక పిల్లకు తండ్రి. దాంట్లో పెద్ద విశేష మేముంది? మరి ఈ వింత ఆకర్షణకు కారణ మేమిటి? దుఃఖమే అతన్నీ, నన్నూ కలిపివేసింది. ఒక్కసారిగా ఆమనిషిమీద నాకు ఇదివరకు లేని ఆసక్తిని కలిగించగలిగింది. డాస్టోవ్ స్కీ కున్ సేవకుడైన సేంకోపాంజాపాత్రమీద సాహి త్యం మనకు కలిగించినంతటి ఆసక్తి, అభిమానమూ మనదేశానికి వైస్రాయిలుగా వచ్చినవారందరి జీవితా లనూ ఒకచోట చేర్చినా కలగవు! కాళిదాసు శకుంత లను సృష్టించిన కాలంలోనూ ఆర్థిక, సాంఘిక, రాజ కీయసమస్య లెన్నో వున్నవని గట్టిగా చెప్పగలను. అవి ఈనాడు రూపుమాసిపోలేదా? ఒక్క శకుంతలే గదా మిగిలింది!

మనిషిబ్రదుకొక పాలపుంత (Milky). అందులో సమాజం, జాతి, సామ్రాజ్యం, వాణిజ్యం మొదలయిన వన్నీ అస్పష్టంగా అటూ ఇటూ తేలుతూ వుండే అణువులు. మనిషిబ్రదుకంతా వాటి ఆవరణలో మరుగుపడింది. యుద్ధం అనే ఒక్కమాటలో ఎన్ని గుండెలు కుమిలికుమిలి యేడ్చిన ఘోరదుఃఖం అణగి వున్నదో! జాతి అనే ఒక్కపేరు ననక ఎన్ని ఘోరాలు, ఎన్ని పాపాలు దాగివున్నవో బైటపెడితే మనుష్యు లంతా సిగ్గుతో చచ్చిపోవలసిందే. సమాజంచాటున ఎన్ని పాడుపనులు, ఎంత దాస్యం. ఇవి మన గుండెల కెందుకు తాకటంలేదు? ఎందుకంటే సమాజం మనను కూడా బానిసలను చేసి, మన గుండెలను రాతిబండ లుగా చేసివేసింది. బండపడిపోయిన మన గుండెలకు తాకేట్లుగా ఈ వ్యవస్థలక్రింద అణగారిపోయే వ్యక్తుల నిట్టూర్పులను వినిపించి, మనలను కదలించివేయటమే సాహిత్యం చేయవలసిన పని. బండపడిన గుండెలలో జాలిపుట్టించి భావాలు రేకెత్తించటమే సాహిత్యం చేయవలసిన పని.

## ప్రతి ఒక్కని అభిరుచికి తగిన



చావి బ్రాండ్

# గోద్రెజ్ టాయిలెట్ సబ్బులు

గోద్రెజ్ టాయిలెట్ సబ్బులలో వివిధ రకాలుండటంవలన అవి సర్వత్రా ప్రజాదరణ పొందగలిగినవి. సౌందర్యపోషణకు సహజసాధనాలైనటువంటి స్వచ్ఛమైన మేలురకపు వృక్షతైలాలూ, మూలికలూ వాడి ఆదర్శప్రాయంగా తయారుచేసిన ఈ సబ్బులు మనదేశంలో అనాదిగా ఖ్యాతిగన్న శరీర సౌందర్యాన్ని, పరిశుభ్రతనూ దాదాపుగా ఇరవైయైదు సంవత్సరాలనుంచీ నిలబెట్టుచున్నవి. కేవలము వృక్ష తైలములతోనే సబ్బులు తయారుచేయుటయందు మేమే ప్రప్రథములము. ఉత్తమజాతి సబ్బులు మృగముల క్రొవ్వుతో గాక ప్రత్యేక వృక్షతైలములతో తయారు కావలెనని మొట్టమొదట గుర్తించినది మేమే. భారతీయ యాజమాన్యంక్రింద, భారతీయుల పెట్టుబడితో, భారతీయులచే తయారుచేయబడిన గోద్రెజ్ టాయిలెట్ సబ్బులు మన దేశంలోనే కాక విదేశాలలో కూడ ప్రశంసలనందుకొనటమే కాక ఈ స్వదేశీ సబ్బులు నాణ్యములోనూ, విలువలోనూ పైదేశాల సబ్బులకంటె ఘనమైనవి అనేది గర్వించదగిన విషయము. అత్యుత్తమమైన ఈ సబ్బులలో మీ ఇష్టమైనది ఏరి, వాడి మీ శరీరమును నిజమైన భారతీయులవలె శుభ్రముగానూ, సుగంధయుతముగానూ, మృదువుగానూ వుంచుకొనండి.


నెం. 1. నెం. 2


'వత్ని'



టర్కిష్ బాత్. ఫ్యామిలీ



శాండల్. లిమ్డా. ఖస్



షేవింగ్ 'రౌండ్' షేవింగ్ స్టిక్.

గోద్రెజ్ సోపుస్. లిమిటెడ్ మదరాసు-(164. బ్రాడ్వే)

## అది రుచికరంగాను తృప్తికరంగాను వుండాలి
## . . . అయితే బలాన్ని చేకూర్చగల శక్తి కూడా దానికివుండాలి సుమా!









ప్రతి గృహిణి ఏ ఆహార పదార్థములు శక్తి నిచ్చునవో తెలుసికొనవలెను. డాల్డా పాకశాస్త్రమను పుస్తకము (ఇంగ్లీషులో అచ్చువేయబడినది) 150 ఇండియన్ వివిధ తినుబండారములు తయారుచేయు పద్ధతులతో కూడినది. మిక్కిలి వుపయోగకరమైన విషయములు గలవు. మీకు ఒక కాపీ వుండుట ముఖ్యావసరము. 4 అణాల బిళ్లలు *Dept.* A110 *P.O. Box No. 353, Bombay,* పంపుడు.

మీ కుటుంబముయొక్క ఆహారము వండేటప్పుడు యీ విషయం ఎన్నడైన ఆలోచించారా? ఆహారం రుచికరంగా వున్నంత మాత్రాన చాలదు—మంచి పుష్టి నిచ్చునట్టిదిగా వుండాలి. కొన్ని ఆహారపదార్థాలు అన్నిటికంటె శక్తిదాయకములై వుంటవి. మనము నిత్యము తీసుకొనే పదార్థములలో కొన్ని బలము నిచ్చునవిగా వుండవు. అవి మన ఆరోగ్యమునకు మంచివి కావు—పైగా, మంచివి కాకపోగా, ఆరోగ్యమును చెడగొట్టుతవి—ముఖ్యముగా పిల్లలకు మరీని. కాని ఆహారమును బలంచేకూర్చేదిగా చేయటం ఒక కష్టమైన పనికాదు. ఆహారమును విటమిన్లతో నిండిన డాల్డాతో వండిన యెడల యీ విషయములో మనకు చాల తోడ్పడును. ఈ డాల్డాలో ప్రకృతి సిద్ధముగా బలమును, పుష్టిని యివ్వగల "ఆహార పదార్థములు" యిమిడి వున్నవి. డాల్డాతో తయారు చేసినంత రుచిగా మరి ఏ యితర పదార్థంతోను వండలేరనుటలో సందేహ మేమియు లేదు. ఒక్కమారు వాడి చూడండి. మీకే తెలుస్తుంది.

## విటమిన్లతోనిండిన డాల్డా బలమునకు

HVM. 32-23-40 TL

# ఒకటిన్నర సోల్జరు*

[కథానిక]

= శ్రీ శ్రీనివాసశిరోమణి =

రైలుబండి బయలుదేరింది; పొడుగుపాటి — వెడల్పాటి మేజరు ఒకాయన బండి ఎక్కినాడు. ఖాకీరంగుదుస్తులు - అందులో యుద్ధరంగములో వేసుకొనే మూడు రిబ్బన్లతో, గాయాలకు వేసిన రెండు పసుపురంగుపట్టీలతో ఉన్నాడు. పసుపురంగుపట్టీలు తీవ్రమయిన గాయాలకు వేస్తారు.

జాగాకోసము చూస్తూ మధ్యనడవలో మెల్లిగా నడుస్తున్నాడు. నాకు ఎదురుగుండా ఉన్న బల్లమీద ఒక ఆడగూతురుగూ, ఇద్దరు పిల్లలూ కూర్చునిఉన్నారు. మేజరు నావంక తీక్షణముగా చూసి ఆగిపోయినాడు. నేను యావత్తుస్థలమూ ఆక్రమించుకొని ఉన్నాను.

"కూర్చోడానికి నాకు కొస్త చోటు ఇస్తారా" అంటూ, నా జవాబుతో నిమిత్తములేకుండానే—బల్ల పొడుగునా పరిచిఉన్న నా మెత్తను గబుక్కున ఒకవైపుకు నెట్టివేసి కూర్చుని, సొట్టలుపడిపోయిన తన సూటుకేసును రెండుమోకాళ్ల మధ్యా నొక్కిపెట్టి, తన పెద్దకోటును తీసి మోకాళ్లమీద వేసుకొన్నాడు. ఆ మొద్దుకోటు కొత్తది. మణతలు కనబడుతూఉన్నవి.

మేజరు తలకు పెట్టుకొన్న టోపీ తీసివేసినాడు. మెత్తటి వెంట్రుకలు ముఖముఅంతా కమ్ముకొన్నవి. వెనక్కు జేరగిలబడ్డాడు. ముఖం అడ్డబల్లకు ఆనించి కండ్లు మూసుకొన్నాడు.

ఆయన్ను ఓరకంటితో చూస్తున్నాను. ఆ యూనిఫారము అంతా సరికొత్తది. ఖాకీదుస్తులు-కాళ్లకు పట్టీలు -మిలిటరీబూట్సులు అన్నీ సరికొత్తవి. అతడు ఎముకలగూడులాంటి మనిషి. సుమారు ముప్ఫయి సంవత్సరాల వయస్సు ఉంటుంది. విశాలమయిన భుజాలు: వాటి పటుత్వము చొక్కాలోనుంచి కనబడుతూఉంది. ముఖము మిసమిసలాడుతూ ఉన్న మాంసముముద్ద. కళాకాంతులు తక్కువ. క్షౌరము చేసి నున్నగా ఉంది. అయితే ఆయనదేహయష్టి-, ముఖానికీ సంబంధము లేదు. పెద్దముక్కు - వెడల్పాటిగడ్డము - పట్టెడుపట్టెడు చెంపలు - నున్నటి మాంసముముద్దలు. ఆయనముఖముచూస్తే ఏమిటోగా ఉంది. మూసిన కనురెప్పలు ఉబ్బినట్లుగా కనిపించినవి. ఆయన్ను చూసినకొద్దీ ఆ దేహానికీ, ఆముఖానికీ ఉన్న వ్యత్యాసము మరింత గోచరించడము మొదలుపెట్టింది. కిటికీలోనుంచి ధూళిధూసరితసూర్యకిరణాలు ఆయన ముఖమును ప్రకాశముచేసేసరికి నావైపు ముఖముతిప్పినాడు. ఆ గండుముఖము మేఘశ్యామలముగా కనిపించింది.

మేజరు నిద్రపోతున్నవాడు హఠాత్తుగా కండ్లు తెరిచినాడు. కనురెప్పలూ ఉబ్బినట్లు ఉండడమునుంచి కనుపాపలు సన్నటి సందులోనుంచి తొంగిచూడడము మొదలుపెట్టినవి. నా ధోరణిలో నేను ఉన్నా, ఆ

* ఈకథ "వార్ అండ్ వర్కింగ్ క్లాస్" అనే రష్యన్ పత్రికలో 1944 వ సంవత్సరము ప్రకటితము అయింది. దానికిది తెలుగులో సంగ్రహీకరణము.

కనుపాపలు రూక్షవీక్షణముతో – అచలముగా ఉన్న నన్ను – సివిలియన్ దుస్తులతో ఉన్న నన్ను – పరీక్ష చేస్తున్నవి.

ఇక నేను ఉండబట్టలేకపోయినాను. "మీరు పడుకోవలెనని అనుకొంటున్నారా"అని నా చేతనయినంత మార్దవముగా అంటూ, ఆ గడబిడమనిషి నన్ను మంచివాడు అని అనుకోవలెనని లేచినాను.

"అక్కరలేదు. కూర్చోండి"అని పరుషముగా అన్నాడు.

నేను కూర్చున్నాను.

" నేను ఆస్పత్రిలో కావలసినంత పడుకొన్నాను. కావలసినదానికన్నా ఎక్కువసేపు పడుకొన్నాను. ఒళ్లు కండెలుగట్టిపోయింది. " అని కోపముతో అంటూ జేబురుమాలుతో ముఖము తుడుచుకొన్నాడు.

" కాకగా ఉంది "

ఎండకాకకు పెట్టె అంతా నిజంగా ఉక్కగా ఉంది. బండి నిదానముగా పోతూవుంది. కిటికీలలో నుంచి వేడిగాలి వీస్తూవుంది. ప్రయాణీకులు కునుకుతూవున్నారు. పడుకోడానికి అమర్చిన చక్కీని ఎత్తివేసినాము. సామానులు పెట్టుకోడానికి అమర్చిన పెసిలెమీద కూడా పెద్దపెద్ద మూటలులాగా జనము ఉన్నారు. " కిక్కిరిసి ఉన్నా ఫరవాలేదు — ఒకరినొకరు తొక్కుకోకుండా ఉంటే చాలును " అని మేజరు మందహాసము చేసినాడు.

" నేను మొదటితఫా ఆస్పత్రినుంచి వచ్చినప్పుడు పటాలాలు పడమటికి పోతూవున్నవి. ఇప్పుడు చూస్తే జనము అంతా కదిలిపోతూవున్నట్టు ఉంది. ప్రాణప్రయాణముగా ఉంది. ఆ ప్రయాణానికి మనము రహదారీ చేస్తున్నట్టుగా ఉంది. " అని హఠాత్తుగా మేజరు అన్నాడు. ఆయన తన తెల్లటిచేతుల వంక చూసుకోడము మొదలుపెట్టినాడు.

" ఈ జనమువంక ఒక్కసారి చూడండి. వారందరూ ఎక్కడికి పోతున్నారు? వారి ఇండ్లు నాశనము అయిపోయినవి. చాలామంది ఎక్కడవుంటే అక్కడ దారిచూచుకోవలెను. పొలాలు అన్నీ గడ్డి వేసుకుపోయినవి. అట్లా అయినా వారంతా సుఖముగా ఉన్నారు. మందహాసము చేస్తూన్న ఆ పెద్దపిల్ల వంక చూడండి......ఏవో భావాలు ఆపిల్లను సంతోషపెడుతూ ఉండవలెను......నిజంగా — సంతోషమే......" ఆదరముతో, వెక్కిరింపుగా ఈమాటలు అని మేజరు నావంక తేరిపారచూచినాడు.

" నిజమే. నేను చాలా జాగ్రత్త అయినవాణ్ణి. ఎందుకు బ్రతుకుతున్నారో ఏమిటో చాలామంది ఊహించనయినా ఊహించరని మీకు తెలుసును. నేను అట్లా కాదు......" అంటూ గొంతు సవరించుకొని " ప్రాణము అంటే నాకెంతో శ్రద్ధ. " అని హఠాత్తుగా మందహాసము చేసినాడు. ఆ మందహాసముతో ఆయన నేత్రాలకింద ముడతలుపడ్డవి. ఆ గుంటకళ్లు వికసించినవి. వినదగినదాన్ని ఏదో ఆయన చెప్పబోతున్నట్లుగా తోచింది.

" మీకు తెలుసును నాకు నరాలపటుత్వము కూడా తప్పిపోతూ ఉందని." అంటూ కొంతసేపు మెదలకుండా ఊరుకొని ఏదో ఆలోచనలో పడ్డాడు. ఆయనముఖములో విచారము సూచితమయింది.

" ఒకానొక కుర్రవాణ్ణి గురించి చెపుదామనుకొంటున్నాను." అంటూ మొదలుపెట్టినాడు.

* * *

'అప్పుడు స్టాలిన్‌గ్రాడ్‌లో యుద్ధము జరుగుతూ ఉంది. అక్టోబరు ఆఖరు. పోరాటములో మహా గడ్డురోజులు అవి. జర్మనులు పట్టణమధ్యభాగాన్ని అంతా ఆక్రమించుకొన్నారు. మమ్మలను 'వాల్గా' నదివరకు నెట్టివేసినారు. నదిలో పడిపోతాము అనే భయముతో చివర ఇండ్లలో కొట్లాడుతున్నాము. నేను ఒక ఇంట్లో అయిదుగురితో ఉన్నాను. ఆ ఇంటినీ జర్మనులు ముట్టడించినారు. చుట్టూ మూగినారు.

ఇంకా వివరాలు చెప్పవలసిన అగత్యములేదు. అది రెండు అంతస్తుల యిల్లు. శిథిలము అయిపోతున్న దానివలె కనబడుతుంది. నిజానికి గట్టిదే. గోడ మూడు (ఇటుక) రాళ్ల మందము. ఒక పట్టాన దెబ్బతినదు. తుపాకులతోనూ, మార్టర్లతోనూ, ఒక జత టాంకుల తోనూ జర్మనులు దాన్ని పడగొట్టడానికి ప్రయత్నము చేసినారు. మేము వాళ్ల మీద చేబాంబులు రువ్వి నాము.

వారిని తరుమగొట్టడానికి మేము ఎన్నాళ్లు పోరాడినామో నాకు తెలియదు. నాల్గురోజులు లెక్కపెట్టినాను. ఆ తరువాత లెక్క పోయింది. ఇల్లు మెల్లగా తగలబడుతున్నది. వాన కురుస్తూనూ ఉంది. ఎటువంటి వాన—మసితోనూ, బూడిదతోనూ వాన చినుకులు రాలుతున్నవి. ఇంటికప్పు కూలిపోయిన చోట్లనుంచి నీళ్లు కారుతూవున్నవి. గోడలు పటీలు పటీలుమని పగిలి పోతున్నవి. చెవులు గింగురెత్తి పోయినవి. పైకప్పునుంచి గచ్చుపెళ్లలు ఊడిపడు తున్నవి. నోరు అంతా పాచిపట్టి పోయింది. ఎవరికీ తిండినిగురించి ఆలోచనే లేదు. చుట్ట అయినా కాల్చబుద్ధిపుట్టలేదు. కొరబోయే పాడుకంపుకొడుతూ కడుపు అంతా గాలిస్తున్నట్టుగా ఉంది. ఆరోజులలో ఏమిచేసినామో ఆరాతీయలేను. కాని ఒక్కటి మాత్రము తెలుసును. ఏది ఏమయినప్పటికిన్నీ ప్రాణాలు ఉన్నంతవరకూ ఆయిల్లు వదిలిపెట్టిపోకూడ దనే మానిర్ధారణమాత్రము మరిచిపోలేను.

చివరకు మాలో ఇద్దరము మిగిలినాము: నేనూ, ఇంకొకడూనూ. వాణ్ణి నేను ఎప్పుడూ మరిచిపోలేను. అతని పేరు 'మిట్కా' (మిట్యా). వాడు కేవలము పసివాడు. పదహారు సంవత్సరాల వయస్సు ఉంటుంది. వాడు స్టాలిన్‌గ్రాడ్ వాడే. ట్రాక్టర్ వర్కర్ల యూనియన్ నుంచి మాముఠాలోకి వస్తూవుండేవాడు. ఎక్కడో ఒక్కడే వాడి తండ్రి యుద్ధములో పోరాడుతూ ఉండిఉండవలెను. బాంబుదెబ్బ తగిలి వాడి తల్లి చనిపోయింది. ఒంటరివాడు. ఆ ముట్టడి వేసిన ఇంట్లో మేము ఇద్దరమూ ఉన్నాము. ఇంటి చుట్టూ కాల్పులు మాటుమణిగిపోయినవి. ఇల్లు మాత్రము తగలడుతూ ఉన్నా ఇంకా కూలిపోలేదు. నిరంతరమూ పొగరాజుకొంటూవుంది. అంతా చీకటి. నిశ్శబ్దముగా ఉంది. చేబాంబుభటులు ఏక్షణమో ఒక క్షణము ముట్టడిస్తారు. మా మిట్కావంక చూచినాను. అతని శిరస్త్రాణము (ఇనుపటోపీ) పెద్దది. మెడమీదికి జారుతూవుంది. దాని కింద కోడిపిల్లలాగా అణిగి పోయినాడు. నిలుచునే నిద్రపోతూన్నాడు. వాడి చెయ్యి పట్టుకొని మెలగా కుదిపాను. నిద్ర మేల్కొన్నాడు.

"లెఫ్టినెంట్ కామ్రేడూ, క్షమించవలెను" అన్నాడు. అప్పుడు నేను లెఫ్టినెంటును. నాకు ఒక ఆలోచన పోయింది. మిట్కా మంచి యోద్ధ కాడు. ఇన్ని ఎందుకు - మేము ఒకటిన్నరసిపాయిలము అంటే సరిపోతుంది. మాదగ్గిర చేబాంబులు లేవు. ఉన్న తోటాలు అన్నీ అయిపోవస్తూఉన్నవి.

"వాళ్లు వసున్నారు. కామ్రేడ్ లెఫ్టినెంట్-వాళ్లు వస్తున్నారు." అన్నాడు మిట్కా.

"సరే - ఊరుకో" అన్నాను.

వాళ్లను మేడమెట్లవరకూ రానిచ్చినాను. అప్పుడు నా చిన్నతుపాకి గదిలోకి పేల్చినాను. పక్కను చూచినాను. మిట్కా అప్పుడే అతని చిన్న తుపాకీని మెట్లగదివైపు బారుచేస్తూన్నాడు. దాన్ని అతని దగ్గిరనుంచి లాక్కొని, అవతలగదిలోకి అతన్ని నెట్టి ఆగదిలోకి నేనూ పోయినాను. అక్కడ తలుపుదగ్గిర అతణ్ణి ఉండనీయకుండా అవతలకు తోసి వేసినాను. ఇంత ఎందుకు—ఒక్కమాటలో చెపు తాను. ఆ యింట్లో గదులన్నీ తిరిగితిరిగి చివరకు మెట్లగదిదగ్గిరకే చేరుకొన్నాము. అక్కడికి చేబాం బులు తీసుకొని జర్మనీవాళ్లు మెల్లిగా వస్తూన్నారు. అయితే మేము ఆగదికి అవతలగదిలో ఉన్నాము. మేము దాక్కొన్నాము. నేను తుపాకులు పేల్చిన గదిలోకి ఆ చేబాంబుభటులు తొంగిచూస్తున్నారు.

అయితే మేము వాళ్ల వెనకగదిలో ఉన్నాము. వాళ్ల చేతులలో బాంబులు ఉన్నవి. గదిలోకి పోవడానికి తటపటాయిస్తున్నారు. ఆగదినిండా పొగ కమ్ముకొని ఉంది. ఏమీ తిన్నగా కనబడడములేదు. ఆ ఖాళీ గదిలోకి ఒకటితరువాత ఒకటి బాంబులు వదిలినారు. ఆ చప్పుడులో, ఆ గల్లంతులో నేను వెనకనుంచి తుపాకి బారుచేసి వదిలినాను. వాళ్లు హడిలిపోయినారు. ఏవో పిశాచాలు వెంటబడ్డట్టుగా వాళ్లు గబగబా మెట్లు దిగి పారిపోయినారు. బాగానే బెదరగొట్టినాను.

నేను సైబేరియావాణ్ణి. సేనలో చేరకపూర్వము అక్కడ పైగాప్రాంతపు బంగారుగనులలో పనిచేస్తూ ఉండేవాణ్ణి. నేను మంచి వేటకాణ్ణి. ఎలుగుబంటి వేటకు వెళ్తూఉండేవాడిని. అది ఇప్పుడు పనికి వచ్చింది.

ఇందులో తెలుసుకోవలసిం దేమిటంటే, పట్టదలచుకొన్న మృగాన్ని వ్యామోహ పెట్టవలెను. దాని చుట్టూ తిరిగి వెనకనుంచి కొట్టవలెను అటూ కాకపోతే దాని నోట్లో పడి క్షణమధ్య పటపటలాడిపోవడమే.

నాతుపాకి ఖాళీఅయిపోయింది. మిటాకా తుపాకి తీసుకొని అది తెరచిచూచి లెక్కపెట్టి అయిదుతోటాలూ తీసుకొని అతని తుపాకి అతనికి ఇచ్చివేసినాను.

"మిటాకా, అది ఉంచుకో. ఇంక కావలెనంటే దొరకవు." అన్నాను.

ఒక్కమాటయినా అనకుండా మిటాకా తుపాకి పుచ్చుకొన్నాడు. అతని పెదవులు వణుకుతూ ఉన్నవి. భయపడిఉంటాడు. నేను అతనితో దురుసుగా ఉండేవాడిని. ఆ కుర్రవాడు నాకు కోపము తెప్పించేవాడు కాడు. అయినా అతగాడితో నాకేమి లాభము? వాడు నా కొక మోతబరువు. విచారపడడముకన్నా వాడితో చేయగలిగింది ఏమి ఉంది?

సరే - మేము అక్కడ ఉండిపోయినాము. మొత్తము ఒకటిన్నరసిఫాయిలము. కాల్పులకు ఎదురుచూస్తున్నాము. అయితే అంతా శాంతముగా ఉంది. ఇక తుఫాను రేగుతుంది. ఏదో కొత్త ఉపాయము నేను కనిపెట్టవలెను. నా దేహము అంతా బరువుగా ఉంది. తుపాకీకూడా పట్టుకోలేకపోయినాను. ఏదో పెద్దబరువు నన్ను నేలకు అణచివేస్తూఉన్నట్టుగా ఉంది. వెనకగోడకు మెల్లిగా ఒరిగినాను. క్షణలేశములో చేరగిలబడ్డాను. నాకండ్లు వాటిఅంతటఅవే మూతలుపడిపోయినవి. గోడకు మూరము అయిపోయినాను. ఇంకా ఎన్నాళ్లు ఆయింటిని పట్టుకొకూర్చోవలెనో, ఇంకా ఎన్నిపగళ్లు, ఎన్నిరాత్రులు నిద్రలేకుండా ఉండవలెనో—నానడుము నొప్పిపట్టి ఎముకలు విరిగిపోతవని తోచేవరకూ నిలుచునిఉన్నాను. చటుక్కున మెలకువ వచ్చింది. విచారము వేసింది. నామీదనే నాకు కోపము వచ్చింది. మిటాకావంక చూచినాను. నా కీభూభాగములో అత డొక్కడే ఆప్తుడు. అతనితో ఇట్లా అన్నాను:

"మిటాకా, నాదగ్గరనుంచి ఒక్క అడుగు అవతల వేయవద్దు. నేను నిద్రపోకుండా కనిపెట్టి చూస్తూఉండు. నన్ను గోడదగిరకు పోనీయవద్దు. నేను చెప్పేది వింటున్నావా?"

"వింటూనేఉన్నాను, కామ్రేడ్ లెఫ్టినెంట్, మీరునిద్రపోకుండా కనిపెట్టుకొని ఉంటాను."

"మిటాకా, ఇప్పుడు జరుగుతున్నది ఆఖరుయుద్ధము. నేను నిద్రపోయినానో- లేచేసరికి ఖైదీ అయిఉంటాను."

ఇట్లా అంటూ ఎంతో భయపడ్డాను. నాకు చెమటలుపట్టినవి. అట్లా మిటాకాను చూస్తూ ఉండిపోయినాను. నాకండ్లు అటూ ఇటూ తిప్పలేకపోయినాను. అతడూ ప్రశాంతముగా నిలుచునిపోయినాడు. ఈకుర్రవాడు నిద్రపోవచ్చును, లేదా ఏగుండుదెబ్బకో చచ్చిఅయినా పోవచ్చును అనే ఊహ హఠాత్తుగా తోచింది. అప్పుడు ఏమవుతుంది?—

చెయ్యి పట్టుకొన్నాను. తల్లి కొంగు బిడ్డ పట్టుకొనేటంత గట్టిగా పట్టుకొన్నాను.

నేలమీదనుంచి పొగలు లేస్తూఉన్నవి. ఎర్ర ధాళుపొగ, చల్లటివానలోనుంచి రాజుతున్న పొగ, భగ్గున మండుతున్న కట్టెలాగా ఉన్న పొగ నాలో నుంచి బయలుదేరినట్లుగా తోచింది. నా పెద్ద కోటునూ, నాతలనూ పొగ చుట్టవేసినట్టు అయిపోయింది. ఇదంతా ఇట్లా ఉంటూఉంటే కిటికీఅవతల దూరముగా—చాలాదూరముగా, నేలఅంచున గులాబి రంగుతో సూర్యోదయము అవుతూవుంది. ఆకాశము స్వచ్ఛముగా ప్రకాశిస్తూ ఉంది. ఒకరకమయిన ఖులాసా వేసింది. నా తలదిమ్ము కొంత తగ్గిపోయింది.

"అటు చూడు మిట్కా, సూర్యోదయము"

"నిజమే — బాగుంది ఉదయసంధ్య!" అని మిట్కా ఉత్సాహముతో మందహాసము చేసినాడు.

అతని మందహాసము నాహృదయాన్ని కదిలించింది. ఇదే మాకు ఆఖరు సూర్యోదయము అని తోచింది. మరీ చిత్రము—ఆసమయములో మా అమ్మకానీ, నాయనకానీ, నామిత్రులుకానీ జ్ఞాపకము రాలేదు. "ఇవాన్‌సుసాని" అనే యక్షగానము ఆట అతిస్పష్టముగా కండ్లఎదట పాడగట్టింది. నేను ఆయక్షగానము ఆట చూడలేదు. గ్రామఫోను రికార్డులలో విన్నాను. లెన్స్కికంఠమాధుర్యము నన్ను స్థాణువును చేసివేస్తుంది. సుసాని అనే రైతు శత్రువును ఏవిధముగా అడవిలోకి తరిమినాడో నేను ఊహించగలను. కాకులు దూరని కారడవిలో ఏచెట్టుచూచినా రంపపు పండ్లవంటి ఆకులతోనూ, దట్టమయిన మంచుతోనూ చలిని రేకెత్తించే ఉదయసంధ్య బయలుదేరింది. అప్పుడు సుసాని కోపోద్రేకులయిన శత్రువులమధ్య ఉండిపోయి సంతోషముగా తిరిగివచ్చినాడు. ఇదంతా పరిపూర్ణముగా భావించగలను. సరే, మళ్లీ చూచినాను. మేఘాలున్నూ, ధూమమున్నూ ఉదయసంధ్యను ఆవరించినవి. దురవగాహమయిన ఆధూమ మధ్యములో నిలబడిపోయినాను. అదే ఆఖరు సూర్యోదయము అనే ఊహ నా తలను కుంగదీస్తున్నది ఇప్పటికీ ఆ ఉదయసంధ్య నాకు గుర్తు ఉంది.

సరే, మంచిది. మేము ఒకటిన్నర సిపాయిలము. మా ధర్మనిర్వహణములో సంతోషముగా హతులమయి పోతాము అని నాకు తోచింది. ఎవరయినా మమ్మలను గురించి పాట — చావుకోసము నిద్రపోకుండా ఉన్న మమ్మలను గురించి ఒక పాట వ్రాసి పాడేవారు ఉంటారా అనిపించింది. ఇంతలో హఠాత్తుగా ఒక పాట వినిపించింది. నేనే పాడుతున్నానో, మరెవ్వళ్లయినా పాడుతున్నారో నాకు తోచలేదు. పాట మటుకు గంభీరస్వరముతో సాగుతూంది......తెలిసి పోయింది. నేను నిద్రపోతున్నానని తెలిసిపోయింది. నా తలకాయ తిప్పి అటు మిట్కావంక చూడలేక పోయినాను. అతను అక్కడ ఎంతమాత్రమూ లేడని పించింది. నేను ఒక్కణ్ణే నిద్రపోతూ నిలుచుని ఉన్నాను అనికూడా తోచింది. "మిట్కా" అని అరిచినాను. అతడు నా చెయ్యి పట్టుకొని లాగి "ఇక్కడనే ఉన్నాను లెఫ్టినెంట్ కామ్రేడ్" అన్నాడు. అందువల్ల నేను పూర్తిగా నిద్రపోలేదు అనుకొన్నాను.

హఠాత్తుగా నాకు ఒక గొప్ప ఊహ వచ్చింది. మిట్కాకూడా నిద్రపోతే ఏం?—

"ఇదుగో—నావంక చూడు" అని గట్టిగా ఆజ్ఞాపించినాను. అతను తల ఎత్తినాడు. అతని ముఖము వివర్ణము అయిపోయి ఏమిట్లోగా ఉంది. అతని శిరస్త్రాణము క్రిందినుంచి రెండు కన్నులూ ప్రశాంతముగా కనిపించినవి.

ఆ నేత్రాలవంక ఎంతోసేపు చూచినాను. ఉదయసంధ్యాదీధితులు వాటిలో తోచినవి.

ఆయిల్లు కుప్పగా కూలిపోకతప్పదు. ఆ పొగ మండకుండా ఉండదు. అప్పుడు కాలిపోయిన ఇటుక రాళ్లు అన్నీ కుప్పలుకుప్పలుగా పడిపోతవి. అందులో మేమూ హతముఅయిపోతాము. ఇక నప్పుడు అతని ప్రశాంతమనోహరనేత్రాలుకూడా పోతవే అని విచా

రము వేసింది. ఏమయినాసరే నాశముకాకుండా ఉండవలెనని ఎంతో అనుకొన్నాను. ప్రపంచానికంతటికీ ప్రకాశాన్ని ఇచ్చే సూర్యకాంతులకు మల్లే ఆతని నేత్రకాంతులు శాశ్వతముగా ఉండవలె నని కాంక్షించినాను.

ఆకస్మికముగా డైవ్ బాంబరుగర్జనము వినిపించింది.

మాపైపుకే బాంబు వస్తూఉంది. భయంకరారావము వచ్చింది. నాకన్నులకు ఆఘాతము అయింది. నేను చేతులు చాచి మిటాన్కను చుట్టవేసి నాపైపుకు అదుముకొన్నాను.

మాఎదట ఒక పెద్ద మొగ్గుద్రాయరు ఉంది. దాని సొరుగులు ఆ తాకిడికి - ఆదెబ్బకు - బయటికి తన్నుకొనివచ్చినవి. ఇంతకన్నా ఇంకేమీ జ్ఞాపకము లేదు."

మేజరు పరధ్యానముతో నావంక చూచినాడు. అతని స్వాంతానికి సంబంధించిన రహస్యాన్ని గురించి చెప్పడానికి మేజరుకు కష్టము వేసిందేమో ననిపించింది.

"ఆతరువాత నేమయింది" అని మేజరే తిరిగి ప్రశ్నించినాడు. కిటికీలోనుంచి బయటికి చూస్తున్నవాడల్లా నావంక మళ్లీ చూచినాడు. ఇందాకటినుంచి కథఅంతా ఇతనికేనా చెబుతూఉంది అని అతని ఉబ్బిన కనురెప్పలలోనుంచి కనుగ్రుడ్లు చెప్పినవి.

మేజరు పెద్ద నిట్టూర్పు విడిచినాడు. తలకాయలో మహాభారముగా ఉన్న బరువును తీసి అవతల పారవేసినట్టుగా సంతోషించినాడు. సూర్యకాంతులు ఆక్రమించినవి.

తోటల్లో చిన్నచిన్న చెట్లు కనిపిస్తూఉన్నవి. పెద్ద పెద్ద మంటలు ఎవరో వేస్తున్నారు. బహుశః ఉర్ల గడ్డలు కాల్చుకొంటున్నారేమో. ఆమంటలలోనుంచి సన్నటి పొగ లేచి ఆకాశములో లీనముఅయిపోయింది.

ఆ మేజరువంక ఆయనకథ వినవలెనని కుతూహలముతో చూస్తూ ఉన్నాను. పెట్టెలో కూర్చున్న వారందరూ ఇంకా నిద్రతో తూగుతూనే ఉన్నారు.

"నాకు లోకము అంటే ఇష్టము. ఇప్పుడు దానిమీద ప్రేమ ఇంకా ఎక్కువయింది."

ఈమాటలు మేజరు అన్న తరువాత ఈ విశాల క్షేత్రాలకున్నూ, అతని కథకున్నూ సంబంధము ఉంది అని బోధపడ్డది. స్టాలిన్ గ్రాడ్ లో ఆరాత్రికిన్నీ, ఈ ప్రకృతిరామణీయతకున్నూ ఆయనమనస్సులో ఎడతెగని సంబంధము ఉన్నట్టు తోచింది. ఆయనకథకు ఆశ్చర్యపడిపోయి ఆ మనిషిలో ఉన్న గొప్పతనాన్ని గమనించినాను. ఆయనఅంతరాత్మ నాకు ద్యోతకము అయింది.

"ఆతరువాత ఇట్లా జరిగింది" అంటూ మేజరు మళ్లీ ఆరంభించినాడు.

*　　　*　　　*

"స్మృతి వచ్చింది. న సుష్టాలు ఎవరో ఊడదీస్తున్నట్టుగా తోచింది. నా లాగూ విప్పుతున్నట్టుగా ఉంది. ఇంతకూ ఆ దుర్మార్గుల పాలబడ్డాను కాబోలు అనుకొంటూ కండ్లు మూసుకొనే ఉన్నాను. ఊపిరి బిగపట్టినాను. నేను చచ్చిపోయినా నని వాళ్లు అనుకోవలెనని నాఅభిప్రాయము. ఇంతలో ఎవరో మాట్లాడుతున్న రష్యన్ భాష హఠాత్తుగా వినిపించింది.

"దానితో ఆటలాడవద్దు: కత్తితో కోసివేయండి!"

ఇంతలో నాలాగూ పైనుంచి కిందకి అల్లా లాగివేసినారు.

"ఆపర్టునుకూడా" అని అదే ధ్వని మళ్లీ ఎవరినో ఆజ్ఞాపించింది.

నేను కండ్లు తెరిచినాను—అంతా అంధకారబంధురము. నాకు ఏమీ కనబడలేదు.

నేను నిద్రపోవడములేదని తెలుసును. భయపడి పోయి పెద్దపెట్టున 'మిట్కా! మిట్కా!' అని కేకలు పెట్టినాను. నాగొంతు నాగొంతువలె లేదు. పోల్చుకోలేకపోయినాను. నాధ్వని మందగించి పోయింది. బలహీనముగా ఉంది. ఏదో మూల్గులాగా ఉంది.

"అతడూ ఉన్నాడు" అని ఎవరో చెపుతూ "సరూన్నా, అతనికి త్రాగడానికి ఏదయినా ఇవ్వు" అన్నారు.

నానోటికి అందించినటుగా ఉంది. అందులోని గుటిచూచినాను. అది మద్యము. నేను ఎంత ప్రయత్నించినా నాకు ఏమీ కనబడకుం పోయింది. ఆ అయోమయావస్థలో నాపండ్లతో ఆ కప్పును కొరికినాను. కప్పులో ఉన్న వైను అంతా నోట్లో ఒలికింది. అది కలగాదు. 'మిట్కా' అని మళ్లీ పిలిచినాను. అంతా భయంకరముగా తోచింది. అదంతా కల అయితే బాగుండునే అనిపించింది.

"మెదలకుండా పడుకో" అనే కోపవాక్కు వినవచ్చింది. చేతులతో నా ఎదురురొమ్ములు తడువు కొని చూచినాను—అవి ఎంతో బాధపెట్టినవి. పండ్లు పటపట కొరికినాను. నాముఖము అంతా చెమట పట్టినట్టు తోచింది. నేను ఊరికే ఉండలేక పోయినాను. అస్థి అంతా నిజమో మాయో నిర్ణయిం చుకోలేకపోయినాను.

అంతా అంధకారము. నేను ఎక్కడ ఉన్నానో నాకు తెలియదు. నా ఆలోచన అంతా మిట్కాను గురించే. అట్లా ఆలోచించకుండా ఉండలేక పోయినాను. పిలవగలిగినంత బిగ్గరగా "మిట్కా" "మిట్కా" అని అరిచినాను.

"మిట్కాను ఇక్కడనే ఉన్నాను కామ్రేడ్ లెఫ్టినెంటు—" అని హఠాత్తుగా మందస్వరము వినిపించింది. ఆమాటలు వినిపించినవైపుకు పోబోయినాను. నన్ను ఎవరో అడ్డగించినారు.

"మెదలకుండా పడుకో లెఫ్టినెంట్ — నీకు గాయాలు అయినవి."

అన్ని వైపులా నాతల తిప్పి చూచినాను.

"మిట్కా, ఎక్కడున్నావు?"

"ఇక్కడే ఉన్నాను కామ్రేడ్ లెఫ్టినెంట్"

"మెదలకుండా పడుకో" అనే గదమాయింపు వినిపించింది.

"మిట్కాను చూపించు అప్పుడు ఊరు కొంటాను. వాడు ఎక్కడ ఉన్నాడు? నాకు కనిపించడము లేదు."

నా దగ్గరగా సన్నగొంతుతో, ఆయాసముతో "మిట్కా ఇక్కడనే—మీదగ్గరనే ఉన్నా" అని పలికినాడు.

నేను మెదలకుండా ఊరుకొన్నాను. నా కేమీ కనిపించడము లేదు. నా చెయ్యి చాచినాను. ఎవరో చిన్నవాండ్లు పట్టుకొన్నట్టు అయింది. వెంటనే తెలిసి పోయింది—అతగాడు మిట్కా అని.

"మనవాళ్లు వచ్చి ఆ పొడుకొంపను ఆ వీథిలో నుంచి త్రవ్వివేసి మనలను బయటికి తీసినారు. అంతా అయిపోయింది. మెదలకుండా పడుకోండి. మళ్లీ బేండేజీలు వేస్తారు"అని మిట్కా నాతో చెప్పినాడు.

నాధైర్యము అంతా పోతున్నట్టు హఠాత్తుగా తోచింది. తల వాల్చినాను. నా ముఖముమీద కన్నీళ్లు కారడము మొదలుపెట్టినవి.

"మిట్కా, మిట్కా, నాకు బేండేజీలు ఎందుకు? నా కేమీ కనిపించడము లేదు. నేను గుడ్డి వాణ్ణి అయిపోయినాను."

అని మేజరు మెదలకుండా ఊరుకొన్నాడు. చెయ్యి తీసి వ్రేళ్లు చూచుకోడము మొదలుపెట్టినాడు. ఆ సమయములో జరిగినదంతా స్ఫురణకు వచ్చిం దేమో. తిరిగి చూపువచ్చినతరువాత బహుశః చేతి వేళ్లు చూచుకొంటూ ఉన్నాడుకాబోలు.

# భారతి - పార్థివ జ్యేష్ఠము

"విమానాలు నడిపేవా డొకడు ఒకప్పుడు నాతో చెప్పినాడు..." మేజరుగొంతు మారిపోయింది. బావిలో పడ్డవాడి గొంతులాంటి గొంతుకతో మొదలు పెట్టినాడు.

"విమానములో వాడు పెనముమీద అట్టుడికి నట్టు అయినాడు. విమానం బ్రహ్మాండమయిన చప్పుడుతో కిందికి వచ్చింది. దాంట్లోనుంచి దూకి ఒక పక్కకు పరుగెత్తినాడు. పెట్రోలుటాంకు ఏక్షణాన అయినా బద్దలు అయిపోవచ్చును. జనమంతా పరుగెత్తుకొని వచ్చినారు. ఆ పైలెటు విమానము దగ్గిరకు పరుగెత్తుకొంటూ పోయి కేబిన్‌లో ఏదో వెతుకుతున్నాడు. అప్పుడు అక్కడ ఉన్నవాళ్లు అందరూ అతన్ని పట్టుకొని ఇవతలకు లాగివేసినారు. మరుక్షణము పెట్రోలుటాంకు భగ్గు మన్నది. ఆపైలెటే "పైలెట్ ఏడీ" అని కేకలు వేయడము మొదలుపెట్టినాడుట. తనకోసము తన్ను చూసుకోసాగినాడుట.

నాకు అట్లాగే తోచింది. ఆపైలెట్ మాదిరిగా నా కోసము నేను వెతకడము మొదలుపెట్టినాను. నా విరిగిపోయిన ఎముకలకు ప్లాస్టరు వేసినారు. నేను గుడ్డివాణ్ణి. జీవిత మంతా అయిపోయింది. చచ్చిపోయినట్టుగా తోచింది. మిట్కా సన్నగొంతుమాత్రము వినిపించింది. అతను నా చెయ్యి పట్టుకొన్నప్పుడు ఆ ముట్టడి వేసిన యిల్లూ, ఆ ఎర్రటి పొగలూ, నాప్రాణావసానసమయము లీలగా జ్ఞాపకము వచ్చినవి. వీటిని అన్నిటినీబట్టి చూస్తే నేను ఇంకా బ్రతికి ఉన్నాను అనుకొన్నాను.

నేను బ్రతికిఉన్నా ననే జ్ఞాపకము కలగజేసిన వాడు మిట్కా. మాయిద్దరి మంచాలూ పక్కపక్కనే ఉంచవలసిందని పట్టుబట్టినాను. మిట్కా అక్కడ లేకపోయినట్లయితే నా కొనఊపిరి కాస్తా పోయి ఉండేది. మేము చాలా క్లుప్తముగా మాట్లాడుతూ ఉండేవాళ్లము. ఆ మాటలయినా వేటి వేటిని గురించో. "బయట మంచుపడుతూఉంది కామ్రేడ్ లెఫ్టినెంటు" అనీ, "ఈరోజున మనకు మురబ్బా పెడుతారు" --- ఇలాంటివి మిట్కా చెపుతూఉండేవాడు.

నేనూ అతనితో ఇట్లాంటి మాటలే చెబుతూ ఉండేవాణ్ణి. ఇంకా "ఇప్పుడు టయిము ఎంత అయింది...మిట్కా, నిద్రపోతున్నావా ?..." అని అడిగేవాణ్ణి.

జీవితాంతదశవరకూ మేము ఉభయులమూ చెట్టాపట్టాలు పట్టుకొనిఉన్నందుకు హాయిగా ఉంది."

—మేజరు కాస్సేపు మెదలకుండా ఊరుకొని పెదవులు గట్టిగా బిగబట్టినాడు.

"మిట్కాకూడా ప్రాణాపాయస్థితిలోనే ఉన్నాడు. బాగా దెబ్బలు తగిలిఉంటవి. ప్రాణాపాయస్థితిలో ఉన్న రోగులను ఉంచే వార్డులోనే మేము ఉన్నాము. అక్కడ బ్రతికినవాళ్లకన్నా చచ్చిపోయినవాళ్లే ఎక్కువమంది. నన్ను-గుడ్డిమొద్దును "కామ్రేడ్ లెఫ్టినెంటు" అని పలకరిస్తూ ఉండేవాడు. అతను పలకరిస్తే నాకు ఎంతో హాయిగా ఉండేది.

ఈవిధముగా కాలక్షేపము అయిపోతూఉంది. నాయెముకలు అతుక్కొంటున్నవని డాక్టర్లు నాకు ధైర్యము చెప్పి నాకు చూపుకూడా వస్తుందని ఉత్సాహపరిచినారు. నాకు వేసిన ప్లాస్టరు అంతా తీసివేసినారు. స్వస్థము అయ్యే వార్డుకు మార్చినారు. అక్కడ మిట్కా లేకపోయేసరికి నేను అసహాయుణ్ణి, అనాథుణ్ణి అయిపోయినాను. నన్ను మిట్కా ఉన్నచోటికి మళ్లీ పంపించమని డాక్టరును కోరినాను. డాక్టరు "వీలులేదు" అన్నాడు. పసిబిడ్డలాగా ఆ డాక్టరుఎదట ఏడ్చినాను. ఏడ్చినా లాభము లేకపోయింది. నన్ను తిరిగి మిట్కాదగ్గిరకు పంపించమని మూడురోజులు డాక్టర్లను ప్రాధేయపడ్డాను. చివరకు అతను లేకుండా నేను తినలేకపోయినాను. నాల్గోరోజున ఒక అమ్మాయి నాదగ్గిరకు వచ్చింది. ఆమె డాక్టరు. నేను ఎట్లాఉన్నాను అని అడిగింది. నేను మాట్లాడలేదు.

"మంచిది. నిన్నే హితుడిదగ్గిరకు తిరిగి పంపిద్దామనుకొంటున్నాము. అతడూ నీకోసము తాపత్రయపడుతున్నాడు"అని హఠాత్తుగా వెల్లడించింది.

ప్రాణాపాయవార్డుకు తిరిగి నన్ను తీసుకొని పోయినారు. మిట్కా గొంతు వినిపించింది. మరీ బలహీనముగా ఉన్నాడు. "కామ్రేడ్ లెఫ్టినెంట్"అని పిలిచినాడు.

"మిట్కా! మిట్కా"అని సంతోషముతో పలకరించినాను. నాకోసము సిస్టరు కుర్చీ వేసింది. నేను కూర్చున్నాను. నాచేతిలో మిట్కా చెయ్యి పెట్టినాడు. అది దుర్బలముగాఉంది. కట్టె అయినట్టుగా తోచింది. చల్లబడుతున్నది. ఆ చల్లదనము నా హృదయమువరకూ పోయింది. నాగుండెలు చల్లబడిపోయినవి. అతనిమీదికి ఒరిగి "మిట్కా—ఎట్లా ఉన్నవి స్థితిగతులు"అని అడిగినాను.

మిట్కా ఊరుకొన్నాడు. అతని చెయ్యి నాగుండెలకు వేసి మెల్లిగా అదుముకొన్నాను. వేడి ఎక్కించవలె ననుకొన్నాను. మిట్కా దిగులుతో "నేను చనిపోబోతున్నా నేమో ననిపిస్తున్నది కామ్రేడ్ లెఫ్టినెంటు" అన్నాడు.

ఈతఫా నేను మెదలకుండా ఊరుకోవలసి వచ్చింది. నాగొంతులో ఉండపడ్డట్టు అయింది.

"మిమ్మలను మళ్లీ ఇక్కడనుంచి తీసుకొని పోరు అనుకొంటాను" అన్నాడు మిట్కా.

"నేను నీదగ్గిరనుంచి ఎక్కడికీ పోను"

"చాలా సంతోషము. కామ్రేడ్ లెఫ్టినెంట్, నీవు ఇక్కడ ఉంటే సుఖముగా ఉంటుంది. మనము కలిసివుంటే ఎప్పుడూ బాగుంటుంది."

మిట్కాకు కునుకుపట్టేసరికి అక్కడవున్న నర్సుతో నన్ను డాక్టరుదగ్గిరకు తీసుకొనిపొమ్మని చెప్పినాను. డాక్టరుతో "నాస్నేహితుడి స్థితి ఏమిటి? వాడు చాలా బలహీనముగా ఉన్నాడు" అన్నాను.

"ప్రాణాపాయస్థితిలోనే ఉన్నాడు. అయితే ఇంకా ఆశ పోలేదు."

నా అంధత్వముతో మనుష్యుల సంగతి ఇట్టే తెలియడము మొదలుపెట్టింది. పుస్తకములో పేజీలు చూస్తూవుంటే విషయము తెలిసినట్టుగా మనుష్యుల గొంతునుబట్టి తెలుసుకోగలను. తన అడుగుల జాడ తెలియకుండా ఉండడానికి మంచుమీద నక్క తోకతో అటూ ఇటూ రాచుకొంటూ పోయేట్లుగా డాక్టరు అసలు విషయము కప్పిపుచ్చి చెప్పినాడు.

"అసలు ఏమయినా ఆశవుందేమో చెప్పండి కామ్రేడ్ డాక్టర్". అని అడిగినాను.

"అదేమిటి వెర్రిప్రశ్న! మేము దేవుళ్లము కాదు. మేము దేనికీ గ్యారంటీఇవ్వలేము.అయితే..."

"ఈ డొంకతిరుగుడు మాటలన్నీ ఎందుకు? అతడు నాప్రాణస్నేహితుడు. మేము ఉభయులమూ చావుకోసము ఎదురుచూస్తూ కూర్చున్నాము. నేను గుడ్డివాణ్ణి. అతడు చనిపోయే సంగతి దాచిపెట్టకుండా నాతో చెప్పవలెను. లేకపోతే నేను మన్నించను"

అతడు ఊరుకొన్నాడు. నా మనోగతము నా ముఖములో వ్యక్తము అయివుండవలెను. కంఠము మార్చి ఈవిధముగా అన్నాడు:

"నన్ను ఏమి చేయమంటారు? మేము చేయగలిగినదంతా చేస్తున్నాము."

"అదంతా బోధపడ్డది. నాకు కావలసిన దల్లా యథార్థము. మిట్కా ప్రాణావసానదశలో ఉన్నాడా?"

"అవును"

"సంతోషము. నీవు నిజము చెప్పినందుకు నమస్కారము."

నావెంటవచ్చిన నర్సుతో నన్ను మిట్కాదగ్గిరకు తీసుకు పొమ్మని చెప్పినాను.

మళ్లీ అతని మంచముపక్కను కూర్చున్నాను. అతని చెయ్యి పుచ్చుకొన్నాను. అట్లా కూర్చుని పోయినాను. ఎంతసేపు అయిందో తెలియదు. నాలుగుపగళ్లూ, నాల్గురాత్రులూ అట్లా కూర్చున్నాను.

అని ఆ తరువాత తెలిసింది. నాకు కండ్లు లేవు. మిట్కా తరుచూ స్మృతిలేకుండా ఉంటూ ఉండే వాడు అని అతని చెయ్యి పట్టుకొని ఉండడమునుంచి నాకు తెలిసేది. అయితే అతడు ఇంకా ప్రాణముతో ఉన్నాడు. మేము చిల్లరమల్లరవిషయాలు మాట్లాడు తూనే ఉన్నాము. అతనికి మెలకువ రాగానే నన్ను "కామ్రేడ్ లెఫ్టినెంట్, ఇంకా మీరు నిద్రపోలేదా?" అని అడిగేవాడు.

"నేను నిద్ర పోనేలేదు."

"కామ్రేడ్ లెఫ్టినెంట్, నిద్ర పోవడానికి ప్రయత్నము చేయండి."

"కాదు మిట్కా—వెనకటి మాదిరే. అప్పుడు నన్ను నీవు కనిపెట్టుకొని ఉన్నావు. ఇప్పుడు నిన్ను నేను కనిపెట్టుకొని ఉండవలెను."

నేను అతని మృతికోసము కనిపెట్టుకొని ఉన్నానని తెలుసుకొన్నాడు. ఇంక నాతో ఏమీ మాట్లాడలేదు. ఇద్దరిలో ఏ ఒక్కరమూ దిగులు పడనూ లేదు. గాభరా పడనూ లేదు. నీవు బ్రతుకుతావు ఫరవా లేదు అనే ఆశలు అతనికి నేను పెట్టలేదు. అలాంటివి మీరిపోయి నాము. అంతా నిశ్శబ్దముగానూ, హాయిగానూ ఉంది. హాయి అంటే—ఒకరిచేతులు ఒకరము పట్టుకొని సోల్జరుధర్మముతో ఉన్నాము. రెండో పర్యాయము మృత్యువును ఎదురు చూస్తున్నాము.

ప్రాణాలు పోయేటంతవరకూ తన మిత్రుడు దగ్గిరలో ఉంటాడని అతనికి తెలుసును. అందువల్ల మరణము అంటే భయము లేకుండాపోయింది.

"కామ్రేడ్ లెఫ్టినెంట్, నేను సెలవుతీసుకొంటాను." అన్నాడు మిట్కా.

అతని చెయ్యి వదిలి తలవంక చూచినాను. అతని ముఖముమీద ముఖము పెట్టి చూచినాను. మిట్కాకండ్లు చూడవలెనని నాసత్తువలో సగము సత్తువతో చూచినాను. కాని నాకండ్లఎదట కటిక చీకటితప్ప మరొకటి లేదు.

"ఓ రెడ్ ఆర్మీయోధుడా, సెలవు" అన్నాను.

"సెలవు"అని అతనూ అన్నాడు. నాకు అతని పెదవులు దొరికినవి. మేము ఇద్దరమూ ముద్దుపెట్టుకొన్నాము. "నిన్ను నేను ఎప్పుడూ మరిచిపోలేను" అన్నాను.

"సంతోషం కామ్రేడ్ లెఫ్టినెంట్"అని, "నేను సోవియెట్ యూనియన్ను కొలిచినాను" అన్నాడు.

పెద్దనిట్టూర్పు విడిచినాడు ఏమీ మాట్లాడ లేదు. నాచేతులలోఉన్న అతని చెయ్యి చూచినాను. చల్లబడిపోయింది. కట్టెబారిపోయింది. నర్సు నా భుజము తట్టి "కామ్రేడ్ లెఫ్టినెంట్-అతడు చనిపోయినాడు"అన్నది.

నేను ఇంకా అతని చెయ్యి వదలకుండానే "మిట్కా"అన్నాను.

జవాబులేదు. అతని ముఖముమీదికి ఒరిగి "మిట్కా-మిట్కా" అని పిలిచినాను. జవాబు లేదు. నా చెంపను అతనిదానికి చేర్చినాను. చల్లబడిపోయి ఉంది. బిరుసుగా కట్టెకు మల్లే ఎండిపోయింది. ఇక మిట్కాలేడని తెలిసిపోయింది. ఏదో మహాభయంకరము, మహాక్రూరము అయినది హిట్లరుమాదిరిగా ఆవహించి నాచేతులలోనుంచి నాస్నేహితుణ్ణి ఎత్తుకొని పోయినట్లుగా తోచింది. నేను గుడ్డివాణ్ణి. అప్రయోజకుడను. అంధకారములో-ఆదిమధ్యాంతములు లేని అంధకారములో పడిపోయినాను.

నేను జీవించివుండగానే సమాధిలో పాతిపెట్టినట్టుగాతోచింది. నేను బ్రతికివుండక పోయినప్పటికిన్నీ ప్రాణము ఉన్నట్టుగా ఉంది. వెక్కి వెక్కి ఏడ్చినాను. మిట్కా లేకపోతే నేను ఉండలేను. తునకలు తునకలుగా తెగగొట్టిన మాంసపుముద్దను నేను. ఇక నామాటలు వినేవారెవరూ లేరు. నాకు సాయము చేసేవారెవరూ లేరు. ఇతరులు జాలిపడ్డందువల్ల ప్రయోజనము లేదు. పయిగా అసహ్యము వేస్తుంది. నేను ఇక జీవితము చాలించివేయదలచుకొన్నాను. కుర్చీలోనుంచి లేచినాను. నా తల సీసముముద్దలాగా

బరువుగా ఉంది. కాళ్లు ముణుచుకొనిపోతూవున్నవి. నన్ను చేతులుపట్టుకొని నడిపించుకొని వెళ్లి మంచము మీద పడుకొనబెట్టినారు. దిండుమీద తలపెట్టుకోవడము తెలుసును. ఆతరువాత ఏమయిందో తెలియదు. రెండు పగళ్లూ, రెండు రాత్రులూ నిద్రపోయినట్లు ఆతరువాత అక్కడివాళ్లు చెప్పినారు.

నేను నిద్రలేచేసరికి మిట్కా అంత్యక్రియలు అయిపోయివుంటవి. నేను స్వాస్థ్యము వార్డులో ఉన్నాను."

ఇది చెప్పి మేజరు కాస్సేపు ఊరుకొన్నాడు. ఆతరువాత అతడు గబగబా ముక్తసరిగా "సరే, మంచిది. అప్పటినుంచి నాకు చూపురావడము ఆరంభము అయింది. నరములకు ఒక అకాండక్షోభము కలిగిందనీ, అందువల్ల చూపువచ్చిందనీ డాక్టర్లు వివరించినారు. ఒక మాసము అయినతరువాత నన్ను ఆస్పత్రినుంచి పంపించి వేసినారు. కమీషన్‌వారు సిక్కులీవు తీసుకోమన్నారు. నేను ఒప్పుకోలేదు. యుద్ధరంగములోకి వెళ్లినాను." అని ముగించినాడు.

* * *

ఇంజను కూత వేసింది. ఇటుకరాళ్ల ఫాక్టరీల పెద్దపెద్ద సౌధాలు కిటికీలోనుంచి తొంగిచూస్తున్నవి. తడిసి ముద్ద అయిపోయిన రోడ్డుమీదనుంచి లారీలు వెళ్లిపోతూవున్నవి. ఇవి అయిపోయినతరువాత చిన్న చిన్న తోటలు, ఇండ్లూ కనబడడము మొదలుపెట్టినవి. బండిలో ఉన్న జనము అంతా లేచినారు. పెట్టెలు బేడలు అన్నీ గందరగోళముగా కదిలినవి. మేజరు లేచినాడు. చొక్కా సవరించుకొని, పెద్దకోటునూ సూటుకేసునూ పుచ్చుకొని "నేను ఇక్కడ మారవలెను" అన్నాడు.

ప్రయాణీకు లందరున్నూ ఎప్పుడెప్పుడు దిగుదామా అని తలుపులదగ్గిరకు చేరుతున్నారు.

హఠాత్తుగా నాకు బాధ కలిగింది. నా హృదయము తపించింది. చనిపోయిన మిట్కాకోసము మహా విచారపడ్డాను. విన్న ఆ మహత్తరవిషయాలమీద మనస్సు లగ్నము అయింది.

రైలుబండి ఆగింది. కిటికీలలో నుంచి బయట జనము కేకలు వినపడుతూ ఉన్నవి. దిగేవారి అడుగుల చప్పుళ్లు వినబడుతున్నవి. తలుపుదగ్గిర ఒక ఆడమనిషి అణిగిపోయి శాపనార్థాలు పెడుతూ ఉంది. ఇంతలో ఎక్కడనుంచో మేజరు నా దగ్గరకు వచ్చి "నీకు తెలుసునో లేదో. నాకు అప్పుడప్పుడు భయంకర స్వప్నాలు వస్తూ ఉంటవి. నా కండ్లు మళ్లీ పోయినట్లూ, వాండ్లు నాకు బంగారపుకండ్లు యిచ్చినట్లుగానూ తోస్తూ ఉంటుంది. నాబంగారు కండ్లతో చూస్తే భూమి, ఆకాశము, ప్రజలు అంతా అయోమయముగా—అంధకారముగా ఉంటుంది. నేను నిద్ర లేచి వెలుతురు—సూర్యరశ్మిని చూడగానే మహాసంతోషముగానూ, మహాసుఖముగానూ ఉంటుంది. బ్రహ్మానందము అవుతుంది." అన్నాడు.

అని, కాస్సేపు ఊరుకొని ఏదో తేరిపార చూస్తూ నాతో కానట్లుగా "నాస్వప్నాలలో మిట్కా ఎన్నడూ కనబడలేదు. నాకు అతనిని కండ్లారా చూడవలెనని ఉంది." అని నావంక తేరిపార చూడడము మొదలుపెట్టినాడు. నాముఖములో అతనికి అత్యంతప్రియము అయిన దేదో తోచివుండవలెను. లేకపోతే అతడు అట్లా చూడడు.

"మీరు హాయిగా ఉండవలెను అని నాకోర్కె. హృదయపూర్వకముగా అంటున్నాను." అన్నాను.

"మంచిది" అన్నాడు మేజరు. వెంటనే నా చెయ్యి పుచ్చుకొని గట్టిగా కరచాలనము చేసినాడు.

"మీరు సెలవుమీద వెళుతున్నారా?" అని నేను హఠాత్తుగా ప్రశ్నించినాను. మేజరు నవ్వినాడు. "ఇప్పుడు సెలవలు చాలా తక్కువ. సెలవయితే నేను ఇంత దూరప్రయాణము చేయవలసిన అవసరము లేదు. యుద్ధరంగానికి బయలుదేరి వెళుతున్నాను." అని, వక్షఃస్థలముమీద చిటిక వేసి "ఒకటిన్నరసిఫాయి" అన్నాడు. చటుక్కున ఆ మేజరు బండి దిగి వెళ్లిపోయినాడు.

# నంతయాత్ర

= శ్రీ పొట్లపల్లి రామారావు =

ఇది అనంతాయాత్ర
యిక నిదురవిడువోయి
పయనించుటే నీదు
పరమాశయం బోయి.

పయనించు, పయనించు;
బాట ఏదీ? అనక
పదిమందిదారితో
పనిఏమి నీకోయి-? ఇది.

బాటకోసర మెవరు
పయనించగా లేదు
అడుగుపై నడుగేయ
నదె దారి యగునోయి. ఇది.

పెక్కుదారుల చూచి
చిక్కుపడగాబోకు
నీకుతోచిన త్రోవ
నీవు పోవగదోయి. ఇది.

ఏరు నాత్రోవ వ
త్తురో రారో యని వృథగ
ఆరాటపడి నీదు
దారి మరిచేవోయి. ఇది.

ఇంత నడచితి నంచు
సంతోషపడ కుబ్బి
నడకలోనే నీదు
నాణ్య మిమిడుంవోయి. ఇది.

కష్టాలు నీదారి
క్రమ్ముకున్నా నరే
ఒక్కొక్క అడుగేస్తె
యోజనము లౌనోయి. ఇది.

"బాటసారిని నేను
పయనించుటే నాదు
ఆదర్శ"మను మాట
హృది మరచిపోకోయి. ఇది.






## వాస్తవము అప్రతిహతము

మిక్కిలి ప్రజాదరణనుపొందిన మా గడియారములు పెద్ద మొత్తములో ఫ్యాక్టరీలనుండి బయలుదేరి యీ దేశమునకు వచ్చుచున్నవి. ఇపుడు లభ్యమైన అతి పరిమితమైన రవాణా యేర్పాటులవల్ల, యీ గడియారములు అనేక వేలమైళ్లు ప్రయాణము చేయవలసియుండును. కావున అవి త్వరలో చేరు అవకాశములులేవు. అందువల్ల తిరిగి సక్రమముగా స్టాకులు అనవరతము సప్లయికాగలందులకు యింకా యెన్నో నెలలు పట్టును.

ఇప్పుడు పరిస్థితులు సందిగ్ధముగా వున్నందువల్లను, స్టాకులు క్రమముగా రానందువల్లను మా కాతాదారులు వారికి అవసరమైన గడియారములను సప్లయిచేయలేనందుకు మమ్ములను మన్నించ గోరుచున్నాము.

వెస్టెండ్ వాచ్ కంపెనీ,

బొంబాయి & కలకత్తా.




**WEST END WATCH Co.**

**BOMBAY CALCUTTA**

*Makers of Quality Watches for over 75 Years.*



.. మరి అతను ఇదివరకే
లైఫ్‌బాయ్ అభ్యాసము
నేర్చుకున్నాడు !



ఆటవస్తువులతో ఆడుకొంటూ అతడు తన బుద్ధిని చేతిని కలిపి ఉపయోగించుట అభ్యాసము చేసుకుంటున్నాడు. అతను తన తల్లివద్ద నేర్చుచున్న లైఫ్‌బాయి అభ్యాసము అతనిని ఇప్పుడు ఆడుకుంటున్న సమయంలోకూడా కాపాడుచున్న విషయము — తల్లికి తెలుసును—అది వాని యింట్లోను ఆటవస్తువులలోను ఉండే ' మురికివలని అపాయము " నుండి అతనిని రక్షించే లైఫ్‌బాయి సబ్బును ప్రతిదినము వాడటమే.




లైఫ్‌బాయ్ మంచి సబ్బుల్లోకి ఉత్తమమైనది
ఇది మంచి అలవాటు

L. 80-23 TL

LEVER BROTHERS (INDIA) LIMITED

# మామూలు కొయ్య మహత్తర నిర్మాణాలు

విజ్ఞానశాస్త్రం వెల్లడిస్తూవున్న వింతలకు అంతూపొంతూ ఉన్నట్లు కనిపించడంలేదు. కనీ, వినీ ఎరుగని ఎన్నో వింతలూ విశేషాలు రోజురోజుకూ విజృంభించి పోతున్నాయి.

శిలాయుగమన్నారు; తామ్రయుగమన్నారు; లోహయుగమన్నారు; స్వర్ణయుగమన్నారు; ఇంకా ఇంకా ఏమేమి యుగాలో అన్నారు. ఇప్పుడు చూస్తే దారుయుగమొకటి కొత్తగా చరిత్రకెక్కబోతున్నదా అని తోస్తున్నది.

కొయ్య (కలప) మన భారత దేశంలో సమృద్ధిగా దొరికే వస్తువు. ఇంత సర్వసాధారణమైన ఈకొయ్యకు మనకు మామూలుగా తెలిసిన ఉపయోగాలు బహుకొద్ది: దూలాలు, దంతులు, కంబాలు ఇత్యాది గృహనిర్మాణ సామగ్రికిన్ని, బల్లలు, కుర్చీలు, మేజాలు, మంచాలు మొదలైన గృహోపకరణ సామగ్రికిన్ని మాత్రమే సామాన్యంగా కొయ్య-కలపను వాడుతూవుండడం మనము చూస్తున్నాము. మనకు తెలిసివచ్చిన కొయ్య ఉపయోగాలు ఇంతే.

వీనిని తలదన్నే ఉపయోగాలెన్నో అమెరికావారికి తెలిసివచ్చినాయి. సరికొత్త పద్ధతుల నెన్నిటినో వారు కనిపెట్టినారు; ఇంకా కనిపెట్టుతూనూ ఉన్నారు. కొత్త కొత్త పరిశోధనలుచేసి, మేధాశక్తినంతా వెచ్చించి కొయ్యకు సరికొత్త ఉపయోగాలు-బ్రహ్మాండమైనవి బహుళంగా కనిపెట్టినారు. అసంఖ్యాకమైన ఆ ఉపయోగాల్లో పక్కపుటలో ప్రదర్శించినవి రెండే రెండు మచ్చుముక్కలు. వాటిని బట్టిచూస్తే, ఇక ఇనుమూ, రాళ్లూ మూలపడిపోతాయేమోననిపిస్తున్నది. చిన్నకూ, పెద్దకూగూడా ఈ చవకబారు కొయ్యే చాలునని వారు ఋజువు చేస్తున్నారు. ఇనుముకూ, రాళ్లకూ పోయి అనవసర ఖర్చువెచ్చాలకు పాల్పడడమెందుకని సవాలు చేస్తున్నారు. మరి, ఇది దారుయుగానికి సూచనకాదూ!

ఈ కొత్త పద్ధతులను, వాటిలోని అందచందాలను, పూర్వపువాటికీ వీటికీ ఉన్న తేడాలనూ సోదాహరణంగా ప్రదర్శించడానికై న్యూయార్కు నగరంలో ఒక ప్రదర్శనం కూడా ఏర్పాటు చేయబడింది. అందులో ఈ కొత్త పద్ధతులన్నీ వివరాలతో సహా ప్రదర్శింపబడినాయి.

కొయ్యఇండ్లు కట్టుకొనేటప్పుడు ఆ నిలువుమొద్దులకు నిప్పు సోకకుండానూ, చెదలు అంటకుండానూ ఉండేటట్లు ఒకరకమైన కాగితాలూ, అట్టలూ వాటికి నాలుగువైపులా జోడించి అతికిస్తారు. ఈ కొయ్య ఇండ్లు బహుచౌకగా తయారౌతాయట.

ఇకేమిటి—ఆ విమానాశ్రయాల సంగతే చాలా విచిత్రమైనది. ఒక్కొక్క కమానూ 177 అడుగుల నిడివి. సుమారు నలభైయేసి అడుగుల పలకలు నాలుగు ఆపొడుగుకంతా సరిపుచ్చుతారు. పలకకూ, పలకకూ మధ్యన ఉక్కు ఉంగరాలు వేసి బిగించి అతుకులు పూర్తిచేస్తారు. ఈ తుండుపలకలకు వంపులు దిద్దీ, కొలతలకు సరిపుచ్చి సర్వసిద్ధం చేయడానికి కొన్ని కార్ఖానాలు కార్ఖానాలే పని చేస్తాయి. అక్కడనుంచి ఆపలకలు ఓడల్లోనూ, రైళ్లలోనూ వచ్చి అసలు కట్టేచోటికి చేరుకొంటాయి. అక్కడ ఎంతతంతు జరుగుతుందో చిత్రంలో తెలుస్తూనే వున్నది.



పొరలుపొరల మామూలు ప్లైవుడ్డు పలకలతో కమానులు కమానులుగా కట్టుతున్న ఒక బ్రహ్మాండ విమానాశ్రయం.
ఇది వందలకు వందల విమానాలకు నిలువ నీడ ఇస్తుంది.



ప్లైవుడ్డు మొద్దులు ఒకటిపై ఒకటిగాపెట్టి గోడలుపేర్చి కట్టిన ఒంటమ్మని హాయ్యైఇల్లు. ఎంత ముచ్చటగా ఉన్నదో చూడం:

# పుష్కరి



= శ్రీ గొడవరి రామదాసు =

పుష్కరః, పుష్కరము అనగా నొక యాత్రా స్థలము (Apte). పుష్కరతీర్థము, పుష్కర ద్వీపము, పుష్కరపర్వతము (సర్వశబ్దసంబోధినీ).

రాజపుత్రస్థానములో ఆజ్మీరు పట్టణమునకు ౧౦ మైళ్ళ దూరమం దున్న సరస్సునకు గూడ నీ నామము గలదు. ఇప్పుడు దానిని 'పోఖర్' అందురు. ఇది యొక యాత్రాస్థలమట. కాని శ్రీమన్మహాభారతములో (వనపర్వము, అధ్యా ౮౦) జెప్పిన రూపము దీనికి అన్వయించలేదు.

సర్వతీర్థేషు రాజేంద్ర తీర్థం త్రైలోక్యవిశ్రుతం,
పుష్కరం నామ విఖ్యాతం మహాభాగసమావిశేత్. ౨౦
యదా సమాగతాం సర్వేషా మాదిస్తు మధుసూదనః,
తథైవ పుష్కరం రాజం స్తీర్థానా మాదిరుచ్యతే. ౩౫

ఈ పుష్కరము చుట్టు అడవి యున్నదట:—
అత్యేకం ప్రోజనసో ద్వ్యస్రం పుష్కరారణ్యమాశ్రితః ౨౮

దీని దగ్గర నొక పర్వత మున్నదట. అందులో రత్నము లున్నవట.

పుష్కరే పుష్కరో నామ పర్వతో మణిరత్నవాన్.
(భీష్మ ౧౨-౨౪)

అన్ని తీర్థములు కృతయుగములో పుణ్యమైనవి గాని త్రేతాయుగములో పుష్కరమే పుణ్యప్రదమైన దట.

"సర్వం కృతయుగే పుణ్యం త్రేతాయాం పుష్కరం స్మృతమ్." (వన ౮౩-౯౦)

అడవిమధ్యను పర్వతముప్రక్కను పుష్కరతీర్థ స్థల మున్నట్లు శ్రీమన్మహాభారతము వక్కాణించు చున్నది. రాజపుత్రస్థానమం దున్న పోఖర్ అను పుష్కర కట్టి గుణములు లేవు.

కాలాతీతముచేతను, జనులు దేశములు విడచి పారిపోయి యుండుటచేతను పురాణకాలమునాటి జనసమ్మర్దభూములు వనములకు, వన్యమృగములకు ఆస్థానములై, ఆయా దేశముల ఖ్యాతి నశించి మరచి పోబడి పుక్కిటిగాథలైనవి. మన పుష్కరము గూడ నీ గతియే బట్టినది. అయినను పూర్వఖ్యాతి గల స్థలముల చిహ్నములను (తల్లి పిల్లలను కడుపులో బెట్టుకొని దాచినట్లు) భూమాత తన గర్భమం దిముడ్చుకొని యుంచి నిజము వెదకెడి వారికి గనపరచు చున్నది. మొహెంజదారో మొదలైన సింధు నదీప్రాంత నాగరికత, అచ్చటి కట్టడములు, బొమ్మలు, ఫలకములు మొదలైనవి భూగర్భమందు జాగ్రత్తగా నుండుటచేతనే గదా వేదములకు పూర్వముగూడ మన భారతభూమియందు గొప్ప జ్ఞానము ప్రబలియుండెడిదని తెలిసినది. భూగర్భము లోనుండి బైలువెడలిన ప్రాచీన నాగరికతా చిహ్నములను జూచి యానాటి జనుల సంతతివారు అప్పటి భావను వాడక పోయినను వారి యాచార చిహ్నముల నింకను ప్రపత్తితో నాచరించుచున్నవా రున్నారని నానమ్మకము. ప్రాచీన పట్టణములు, మందిరములు, రాజ్యములు భూగర్భమందు పాతుపడుటయేగాక ఆ భూమిపై సాంద్రమైన అడవులుగూడ పెరిగిపోవును.

ఆయడవులలో నొక పిట్టకూతయైన వినిపించదుగదా! అట్టి ప్రదేశములందు ఘనతకెక్కిన రాజ్యములుగాదు, సామ్రాజ్యము లుండినవని యెవరు నమ్మగలరు? కాని ప్రాచీనగ్రంథములు, శిలాతామ్రశాసనములు ఒకొక్కప్పుడు పరిశీలనజేయువారికి లభించి, ఆయాప్రదేశముల యష్టసౌభాగ్యమును వెల్లడిజేయును. అట్టి నిదర్శనములవలననే మరుపబడిన పుష్కరీఘనత యిప్పుడు బయలుపడినది.

చాలకాలము విశాఖపట్ణంజిల్లాలో పెద్దభాగమై మదరాసు ప్రభుత్వములోనుండి ౧౯౩౬ లో ఒరిస్సా ప్రభుత్వములో బడిన జయపురసంస్థానము పరదేశపు పామరజనులకు తెలియనే తెలియదు. ౧౯౪౧ లో ఒకనాడు నేను మదరాసు వెళ్లుచుండగా రైలులో జనులు “జయపురం యెచ్చట నున్న” దని యడిగిరి. కాని యిప్పుడు జయపురపు బియ్యము ఎగుమతి యగుటచే నాసేతు హిమాలయము వరకు పామరులకు జయపుర మనే ప్రదేశ మున్నదని బోధపడినది. దీని కంటె సహస్రాధికముగా మచ్చకుండు నదీజలపాత విద్యుచ్ఛక్తి నుద్భవము జేయు తర్కవితర్కముల వలన జయపుర సంస్థానఖ్యాతి దేశమందంతటను వెల్లడియైనది.

అది యట్లుండె. ఈసంస్థానపటము జూచినచో ఈశాన్యమూలగా నొకటి, ఆగ్నేయమూలగా పెండవది రెండు చేతులు జాపినట్లు కనబడును. అందులో ఉమ్మరకోటతాణాప్రదేశము ఈశాన్యముగా జాచియున్న బాహువు. ఉమ్మరకోట గ్రామము సంస్థానమువారి తాణాయాస్థానము. దీనికి సుమారు ౧౨ మైళ్లదూరముగా నైఋతిమూలగా నున్నది పొడాఘర్ అను నొక చిన్న పల్లె. దానిప్రక్కనే సుమారు ౩,౦౦౦ అడుగులకు పైగా ఎత్తుగల పర్వతశిఖరము ఒక్కటే శిల. ఆపర్వతముపైన నున్న దొక శిలాశాసనము. ఇది యున్నట్లు సూయెల్ (Sewell) గారు తమ శాసనములజాపితాలో వ్రాసినారు. ౧౯౩౩-వ సంవత్సరములో మదరాసుప్రభుత్వమువారి ఎపిగ్రఫీఅసిస్టెంటు సూపరింటెండెంటుగారు వచ్చి దీనికి అచ్చొత్తి, ఛాయాచిత్రముదీసి, దానితోగూడ నాశాసనమందు గల అంశములను సంక్షిప్తముగా ౧౯౩౩ మదరాసు ఎపిగ్రాఫికల్ రిపోర్టు ౧,౨ భాగములలో ప్రచురించిరి. ౧౯౩౮లో నీశాసనమును, దీనియర్థమును, కొంత భాష్యముతో ఎపిగ్రాఫియా ఇండికా ౨౧-వ సంపుటములో ౨౪-వ నెంబరుగా సి. ఆర్. కృష్ణమాచార్యులు గారు ప్రచురించినారు.

నలవంశజుడైన భవదత్తుని కుమారుడు స్కంద వర్మ తన పూర్వీకుల కాలమందు బోయిన రాజ్యమును తిరుగ జయించి, నిర్జనమైపోయిన పుష్కరీ యను రాజ్యస్థానమును తిరుగ స్థాపించి సన్యాసులు, బ్రాహ్మణులు మొదలుగాగల అతిథి అభ్యాగతుల కొరకు ఒకసత్రము గట్టించినారట.

ఈ శాసనకాలము క్రీ. శ. ౫-వ శతాబ్దాంత్యార్థమైయుండవోపునని భాష్యకర్తలు వ్రాసిరి.

ఎపిగ్రాఫియా ఇండికా ౧౯-వ సంపుటములో ౧౮-వ నెంబరుగా ప్రచురమైన రిథాపూరులో దొరికిన భవదత్తవర్మయొక్క రాగిశాసనములోకూడ శాసనదాత నలవంశోద్భవుడైన ట్లున్నది. కాని యందు పుష్కరీ పట్టణమును జెప్పలేదు. ఈశాసనముగూడ సుమారు ఆకాలమునకే జెందియుండు నన్నారు దీని భాష్యకారులు.

౧౯౩౩-వ సంవత్సరమునుండి నాకు పొడాఘడ్ శాసనమును, దాని స్థానమును జూడ కుతూహల ముండెడిది. కాని యారోజులలో రోడ్లు లేకపోవుట చేతను, ఉద్యోగస్థులకుగాని, జమీందార్లకుగాని చారిత్రకపరిశోధనయందు దాసక్తిలేకపోవుట చేతను నాయాశ నిరాశయై నిద్రించినది. గతసంవత్సరము జూనుమాసములో ఆ యాశ మేల్కొంచి, యుద్రేకించుట కవకాశము గలిగినది.

ఇప్పుడు జయపురసంస్థానానికి అసిస్టెంటు దివానుగానున్న శ్రీ తలిశెట్టిరామారావుగారు గతజూను నెలలో నన్ను వారితో తీసుకొనివెళ్లిరి. అప్పుడు

పాడాగుడా వెళ్లితిమి. అచ్చట పర్ణశాలలలో నాలుగు రోజు లుండి ఆప్రదేశమెల్ల బరిశీలించితిమి. కొండపైకి ఎక్కనారంభించినది మొదలు రాజభవన చిహ్నము లనేకములు కనిపించెను. పడిపోయిన సింహద్వారము యొక్క దక్షిణపుశిల సుమారు ౧౬ అడుగుల యెత్తున నున్నది. ఇటుకలు (౧౫ × ౮ × ౨అం. కొలతలు గలవి) పడిపోయిన కట్టడము అగుపడెను. కొంత దూరము ఎక్కగా నచ్చటినుండి రాతిపలకలతో కట్టిన సోపానములు. ఆపై చదునుస్థలము. అందున్నది శాసనము జెక్కిన శిలాఫలకము. ఎడమవైపున సరిగా నిడుపుగా ౩౨ అడుగులు, తలభాగమున తిన్నగా ౧అ, ౧౦అం. వెడల్పుఉన్నది. కుడివైపుఅంచు అచ్చటచ్చట శిథిలమైనప్పటికి ౨౨ వరకు తిన్నగానే యుండెను. దానికి దిగువనున్న మిగిలిన ౧ అడుగు భాగము తోరణమునకుగాను మూలలుగా మలచినారు. తోరణము పోగా దిగువమట్టము సుమారు ౧౦ అంగుళములు ఇది తోరణముమోసిన కంబములలో ఎడమకంబపు శిఖరముపై నిల్చిన పాదము. ఈరాతిఫలకమునకు సమానముగా నుండి తోరణపు కుడిభాగమైన ఫలకముగాని, తోరణమునుమోసిన కంబములుగాని కానరాలేదు. అచ్చట త్రవ్వించి వెదకిన రెండవవైపుఫలకము దొరకునేమో! అందుగూడ నొక శాసనము గన్పించునేమో యని యాశ.

శాసనమున్న స్థలమునకు సుమారు ౨౦ అడుగులు గల శిలామయ పర్వతశిఖరము. అచ్చట రాజుగారి డిండిమములుంచెడి స్థలము, కోట. శిథిలప్రాకారములు మొదలైన చిహ్నములను గాంచితిమి. అచ్చట కొన్నికొన్ని చోట్ల సున్నముతో జేసిన గచ్చుపెల్లలు గన్పించినవి.

ఈ కొండ కుత్తరమున నొకమైలు లోయ. అందున్నవి శిథిలదేవాలయములు. ప్రాచీన మట్టిపాత్రశకలములు. ఆ లోయ కుత్తరముగా నొక పర్వతపంక్తి. ఈ పర్వతపంక్తి దక్షిణపాదతలమున పశ్చిమముగా కొంతదూరమున నొక చెక్కని రాతిబండ. సుమారు ౧౦౦ పౌనుల బరు వుండును. ఎండకు వానకు శిథిలమై అచ్చటచ్చట ముక్కలు పోయియున్నవి. దీనిపై నున్నది సుమారు ౧౨ అంగుళముల నిడివి గల మనుష్యపాదము ఒక్కటే. ఇది చెక్కినట్లు లేదు. కొంచెము పదునుగానున్న మట్టిపెల్లపై మనిషి యడుగు వేసిన నెటులుండునో యటు లున్నది. రాయి మెత్తగా నున్నకాలమున మనిషిపాద చిహ్నమును ధరించి, తరువాత గట్టిపడిపోయినను ఆ ముద్రను విడనాడకయున్న దని మాకు తోచినది. దీనినిబట్టి భూశాస్త్రజ్ఞులు ఆ పాదము పడ్డ కాలనిర్ణయము చేయగలుగుదురేమో? కొన్ని గట్టిబడ్డ బురద మట్టి పనిముట్లు (**Cambridge History of India Vol. I, plate ix** లో **No.** 9 లో జూపిన దాని వంటివి) ఇంకా యితర రకములు ఈ జయపుర సంస్థానములో దొరకినవి యున్నవి.

పాడాఘుడ్ పర్వతమునకు నైఋతిగా నున్న యడవిలో నొక పాడు శివాలయ మున్నది. అందలి తీర్థంకరవిగ్రహము చాల ప్రాచీనమైన ట్లున్నది. ఈ యాలయమునకు తూర్పున సహగమనశిలాస్తంభము లనేకము లున్నవి. కొన్ని కంబములపై మంటపముల చిహ్నము లున్నవి. సుమారు ౩౦ కంబములు లెక్క చేసితిమి. ఈ ప్రదేశమునకు ఒక ఫర్లాంగు తూర్పుగా మరికొన్ని కంబము లున్నవి. అందులో నొకదానిపైని గుఱ్ఱముపై స్వారిజేయుచున్న యోధుడు చెక్కబడి యున్నాడు. ఈ ప్రదేశమందు మేము జూచిన చిహ్నములను బట్టి యిచ్చట నొక గొప్ప పట్టణ ముండెడి దనియు, అదియే శిలాశాసనమున జెప్పబడిన పుష్కరీ యనియు దోచినది. కాని యాధారములు చాలకపోవుటచే ఇదమిత్థమని వక్కాణించ సాహసించలేదు. అందుకు దగిన ప్రమాణము ఈసంవత్సరము ఫిబ్రవరి నెలారంభమున లభించినవి.

రామారావుగారు ఉమ్మరకోట తాణాకు ఉద్యోగరీత్యా పర్యటనకు వెళ్లుచు నన్ను గూడ పిలుచుకొనిపోయినారు. "కేసరీబేడా యను గ్రామాట

విలో రెండు సంవత్సరముల క్రిందట నొక రాగిశాసనము దొరికిన" దని ఉమ్మరకోటలో వింటిమి. వెంటనే బండ్లుచేయించుకొని యడవిమధ్యను చీకటిలో గుట్టలు, లోయలు దాటి ౧౫ మైళ్లు ప్రయాణముచేసి రాత్రి ౧౧-౩౦ గంటలకు కేసరిబేడా చేరితిమి. మరునాడు ఉదయము గ్రామపూజారికి వర్తమానము చేయగా వాడు ఒక రాగికడియములో గుచ్చియున్న మూడు రేకుల తామ్రశాసనమును తెచ్చినాడు. రేకు లేమియు శిథిలము కాలేదు. కాని వెలుపలిరేకులు రెండు మైలతుత్తపురంగు గలిగియున్నవి. అక్షరములు చదువ శక్యముగానే యున్నవి. రేకులను జాగ్రత్తగా పట్టియుంచుటకు రేకుల యెడమకొనల సమీపమందు జేయబడిన రంధ్రములలో నుండి దూర్చబడిన కడియము యొక్క కొనలు ఒక బాదముకాయ యాకారము గల రాగికాయలో నిముడ్చబడి యున్నవి. దానిపైని రాజముద్ర యుండెనేమోగాని అది యిప్పుడు లేదు. ఆ ముద్రను అమర్చియుంచుటకు జేసిన దొక బిల మున్నది. ఆ బిలముగూడ బాదామి ఆకారముగానే యున్నది. రేకులు ఒకొక్కటి ఆరంగుళముల పొడవు, ఒక అంగుళము వెడల్పు గలిగి తాటియాకుదళసరిని ఉన్నది. "అందు వ్రాసియున్న శాసనమును తరువాత జదువవచ్చు. శాసనము దొరికిన స్థలము చూత" మని బయలుదేరి వెళ్లితిమి. మాకు బసకేర్పరచిన పర్ణశాలల కొక ఫర్లాంగు పశ్చిమముగా నొక యడవి. అందులో నొక చెట్టుక్రింద బడియున్నవని చూపిరి. ఆ చెట్టునుండి తిరిగి తూర్పుగా ౫౦ గజముల దూరమున నొక యిటుకల దిబ్బ గన్పడినది. ఇటుకలు పెద్దవిగా నుండుట జూచి యచ్చట త్రవ్వించుట కేర్పాటు జరిగినది. మనుష్యులు పారలు, గునపాలు పట్టుకొని త్రవ్వుట కారంభము జేసినారు. ఇంకా యేమున్నదో యీ యడవిలో నని చూచుటకు బయలువెడలితిమి. మరి ౫౦ గజముల తూర్పుగా దూరములో నొక జలాశయము. సుమారు ౧౦౦ గజములు గల సమచతుర్భుజాకారమైనది. ఇప్పుడుకూడ నీరున్నది గాని గడ్డి గాదర మొలచి యుపయోగకరముగా లేదు. ఈ చెరువు తూర్పుగట్టున పూర్వము సోపానాలున్నట్లు చిహ్నాలున్నవి. ఈమెట్లకు పశ్చిమముగా రెండు ప్రక్కల రెండు ఇటుకదిబ్బ లున్నవి.

త్రవ్వుచున్న మొదటిదిబ్బగద్దకు వెళ్లితిమి. పైని మొలచిన చెట్లుచేమలు కొట్టివేసి యిటుక ముక్కలను పెరుకుచుండిరి. ఒక ఫుట్టు త్రవ్వుచుండగా పారకు ఒక రాయి తగిలినది. అచ్చట జాగ్రత్తగా త్రవ్వించగా నొక నారాయణవిగ్రహము బయలు వెడలినది. ౨ అడుగుల యెత్తు గలిగి అతి సొంపుగా, ఒకాకారముగా నిలిచియున్న మూర్తి. చతుర్భుజుడు. పొగసీల్లోపివంటి కిరీటము; చిరునవ్వు పెదవులు, సృష్టి; అలంకారముగ మెడయందొక పూసలహారము; చేతులకు కడియములు తప్ప మరేమియు లేవు. కుడిచేతులందు మీదిచేతిలో చక్రము; గదపైని ఆనియున్న దిగువ చేతిలో తామరమొగ్గ. ఎడమ పైచేతిలో శంఖము. దిగువ చేయి నందకఖడ్గశిరముపై నానుకొనియున్నది. ఈఖడ్గమునకు గట్టిన పటకా గ్రంథపుముడుల మట్టు నున్నది. ధరించిన వస్త్రము మోకాళ్లవరకే యుండి, కుచ్చెళ్లు నెమోకులు నడుకను రెండుకాళ్ల మధ్యనుండి దీసి దోపినట్లున్నది. ఇటుకలు పైనిబడినప్పటికి మూర్తి గోరంతయైన శిథిలముకాలేదు. మెత్తని పాలశిలతో జేసిన విగ్రహము.

ఈమూర్తి యొక్క గదికి పశ్చిమపుగోడ కాని యున్నది. దీని కెదురుగా తూర్పుగోడలో నున్నది ద్వారము. గది సుమారు ౬ అడుగుల చౌకము. గది గోడలు బైటపడినవి(పోగా మిగిలినవి)౨౩ అడుగుల యెత్తున్నవి. ఇటుకలు ౧౬"×౮"×౨౨" కొలత గలవి.

చెరువుగట్టున నున్న రెండు దిబ్బలలో దక్షిణపుదిబ్బను మరునాడు త్రవ్వించుటకు ప్రారంభించితిమి. ఈ జలాశయమున కీశాన్యముగా ౨ ఫర్లాంగుల దూరమున నున్నది మరియొక చెరువు. దీనికి దక్షిణముగా చేరువనే యున్నది కేసరిబేడాయూరు. ఈ

చెఱువుపక్కనుపుగట్టుసమీపమందే మరియొక యిటుకల దిబ్బ. ఇదికూడ త్రవ్వించితిమి. ఇది త్రవ్వించుచు ఆపగ్ణశాలలో చలి దెబ్బ తింటూ.

ఉమ్మరకోటతాలూకా ప్రతిపల్లెయందును పూజ చేయబడు దేవత "పెంద్రాయుంద్రియాణి". ఈమె మొదట ఏడారిజాతిలో పుట్టిన పిల్ల. ఈమెకు ఏడుగురు అన్నదమ్ములు. ఈమెకు వివాహమైనది. అన్నదమ్ములు వ్యవసాయము చేయుచున్న భూమిపై వచ్చు వరదను ఆపుటకు వారెన్నిసార్లు గట్టెంత గట్టిగ వేసినను అది కొట్టుకొనిపోవుచుండెడిదట. నరబలి నిస్తే గట్టు నిలుచునని అందులో నొకరికి స్వప్నము వచ్చినదట. మరునాడు తమ చెల్లెలి పెనిమిటిని గట్టుకట్టే మిషపై పొలమునకు దీసుకవెళ్లి వానిని చంపి, వాని కళేబరముపై గట్టు కట్టివేసి మధ్యాహ్నము భోజనమున కింటికి వచ్చినారట. తన పెనిమిటి రాకపోవుటను, తన యన్న లేమియు చెప్పకపోవుటచే నామె గట్టుదగ్గరకు వెళ్లి, తన పెనిమిటి చిహ్నములను జూచి, మన్ను త్రవ్వి కళేబరము బయటికి తీసినది. చెడిపోని ఆకళేబరముతో నామె సహగమనము జేసినది. ఇది జరుగుట మధ్యపరగణాలలో బిలాసపూరునకు కొంతదూరమున్న పెంద్రా యను నూరు. ఆనాటినుంచి నీ పిల్ల పేరంటాలైనదట. ఈపేరంటాలనిశానాలు ఏ పల్లెలోనైనా యున్నవి. ముఖ్యముగా పొడుగాటి వెదురుగడకు కట్టిన జండా. ఆ జండాగుడ్డ క్రింద గంటలు, మువ్వలు, గవ్వలసరాలు వ్రేలగట్టియుండును. ఇట్టి నిశాని యుమ్మరకోట ప్రాంతములం దున్నది. ఉమ్మరకోటలో నొక దేవాలయమును సంస్థానమువారు గట్టించినారు. ఈపెంద్రేయాణీదేవత తనను గొలిచిన వారిని గాపాడునట. సోదగాళ్లు (ఈదేశములో 'శిరాలంటారు')కు పూని జనుల కోర్కెలకు ప్రత్యుత్తరము లిచ్చుననియు, ఆప్రత్యుత్తరములు సత్యములగు ననియు నమ్మకము.

రెండు దిబ్బలు త్రవ్వి యిటుకలు తీసేసరికి గోడలు, గదులు బైలుదేరినవి. అందులో నున్న చెఱువు గట్టుపై నున్న దిబ్బలో రెండు అడుగుల యెత్తు, సుమారు ౮ అడుగుల చౌకముగ నున్న గదిలో రెండు ఇటుకల వరుసను గోడ వారనే పాదవున గట్టిన యొక యిటుకదళసరిచపటా పైని ఒక రాతిఫలకము బైలుదేరినది. అది ౮' × ౨౦' × ౮" కొలతలు గలది. దానిపైని అక్కరములు జెక్కినట్లు చిహ్నాలున్నవిగాని నునుపుజేసిన ముఖము పైని ౦.౧"దళసరిని పొర యూడిపోయినది. కాన, వ్రాత జదువుటకు వీలైనదికాదు.

అచ్చటనుండి బయలుదేరి కంపెనాగ్రామము గుండా బామినీగ్రామము చేరితిమి. మాకు దొరికిన రాగిశాసనములో, బ్రాహ్మణీ అని చెప్పిన గ్రామమే యిది. మాత్రోవలో నున్న ప్రతిగ్రామములోను జనులు గోందులు, భొత్తడాలు అనే జాతులవారైనప్పటికిని శివలింగాలుమాత్ర మున్నవి. బామినీలో ఉమామహేశ్వరవిగ్రహ మొకటి చాల ప్రాచీన చిహ్నాలు గలది ఉన్నది. ఈగ్రామమునకు నొక మైలు ఉత్తరముగా వైక్రాంత (Quartz) శిలామయమైన కొండ ౨౨౧౫ అడుగుల యెత్తు గల శిఖరము గలది ఉన్నది. ఇందు మరియొక జాతి రాయి లేదు. ఈ బామినీకి నైఋతిమూలగా నొక మైలుదూరమున నొక బైలులో చెట్టుక్రింద నొక లింగమున్నది. భూమిపైకి ఒక బొత్తుగడ్డ ఒక కొనను నిలబెట్టినట్లు కన్పించెను. అది తెల్లని వైక్రాంతపురాయిలో చేసినది. దాని నంతనునుపుగా జేసినవాని నేర్పును గొనియాడితిమి. దీనిపైని ఒక గడ్డివేసిన యాలయమును కట్టి యీ చుట్టుపట్లగ్రామస్థులు వారమున కొకసారి పూజ చేయించుచుందురు. కోళ్లను, గొఱ్ఱెలను బలియిచ్చుచుందురు.

బామినీనుండి ఉమ్మరగాం వెళ్లితిమి. అచ్చట నొకరాత్రి యుండి ఉమ్మరకోట వెళ్లితిమి. ఈ పది రోజులలోను సుమారు ౨౦ చదరపుమైళ్ల వైశాల్యము గల ప్రదేశము జూచితిమి. ఈ ప్రదేశములో నడవుల మధ్య త్రవ్విన చెఱువు లున్నవి. ఒక్కొక్క గ్రామములో ఫర్లాంగున కొక చెఱువు. చిన్నవి గావు. ౨౦

గజాలకు తక్కువైన పొడవు వెడల్పులు గలవి లేవు. వీటినిబట్టియు, మాకు గన్పడ్డ శిల్పములను బట్టియు ఆ ప్రదేశము పూర్వకాలములో చాల జనసమృద్ధమై యుండునోపు నని పోల్చితిమి. ఈ యాలోచనను బలపరచుచున్నది మాకు దొరికిన రాగిశాసనము.

పుష్కరినుండి నలనృపతికులోద్భవు డైన మహారాజు అర్థపతి భట్టారకుడు బ్రాహ్మణీయిలాఖా కేసెలక మను గ్రామమును కౌత్ససగోత్రీకు లైన నలుగురు బ్రాహ్మణుల కిచ్చిరి. ఈ శాసనమును వ్రాసినవారు మహారాజుగారి రహస్యకార్యనిర్వాహకు లైన బులెన. ౫౪-వ సంవత్సర మార్గశిర అమావాస్యనాడు దాన మివ్వబడిన ట్లున్నది. గుప్తశకమై యుండునని శాసనపు వ్రాతనుబట్టి తెలియుచున్నది. కాన క్రీ. శ. ౪౦౪-వ సంవత్సరము నవంబరు ౧౧ మంగళవారమునకు సరి పోవుచున్నది. ఆనాడు సూర్యగ్రహణము గూడ నున్నది. గ్రహణముమాట శాసనములో చెప్పకపోయి నప్పటికిని భూదానము చేయుటకు పుణ్యదినము గావున దాన మారోజుననే సూర్యగ్రహణకాలమున జేసియుండ వచ్చు నని యూహ.

పైన పేర్కొనిన రిథాపూరు రాగిశాసనమును వ్రాసినవారు బులెనయే కాని యీశాసనము వ్యాఖ్యానము వ్రాసినవారికి బాగుగా అర్థమైన ట్లగపడదు.

ఈ మూడు శాసనములనుబట్టి నలనృపవంశజు లైన రాజుల పాలనలో నున్న రాజ్యమునకు ముఖ్యస్థానము పుష్కరీ. మాకు దొరికిన శాసనములో నిచ్చిన తారీఖు నిల్చినయెడల క్రీ. శ. ౫-వ శతాబ్దాదియందే యీ రాజ్య ముండినటుల కన్పించుచున్నది. అర్థభట్టారకుడు, భవట్ట (భవదత్త) వర్మ, స్కందవర్మ అని మూడు తరాల రాజు లేలినట్లు శాసనములు నిశ్చయపరచుచున్నవి. అయితే ఈ మూడు తరములతో నంతమైనదా యీరాజ్యము?

హీరాలాలుగారి బీరారు, మధ్యపరగణాల శాసనముల వివరముల జాబితాలో ౨౪౦ నెంబరుగా జెప్పిన గోపాలదేవుని పూజారిపల్లె శిలాశాసనమునందు గోపాలదేవమహారాజు అనేక రాజ్యములు జయించినట్లు చెప్పియున్నది. అట్టి రాజ్యములలో నొకటి పుష్కరి. ఇది రాజపుత్రస్థానమం దున్న దన్నారు గ్రంథకర్త. రాజపుత్రస్థానములో నున్న పుష్కరి రాజ్యము కాదు సరేగదా గోపాలదేవుగారి శాసనమున్న పూజారిపల్లి ప్రస్తుతము సారంఘుడ్ అనే సంస్థానములో నున్నది. ఇది ఉమ్మరకోట తాణా ఉత్తర సరిహద్దుకు సమీపమం దున్నది. మన పుష్కరిరాజ్యము ఉమ్మరకోటతాణా ప్రదేశమునుగూడ ఆక్రమించియే యుండెడిది. కావున గోపాలదేవ మహారాజు జయించిన పుష్కరి మన శాసనములలో జెప్పినదే. పూజారిపల్లి శాసనదాత యిచ్చినట్టిది మరియొకటి భైరమదేవ దేవాలయశాసనము (Bairamadeo Temple Inscription No 233, D. C. C. P. & B.) కలదు. అందులో నిచ్చిన సంవత్సరమునుబట్టి ఆశాసనకాలము క్రీ.శ. ౧౦౪౭ అని నిర్ధారణజేసిరి గావున నీగోపాలదేవుగారు అప్పటివారే.

ఈ గోపాలదేవు మహారాజే డోంగ్రా శిలాశాసనము (M. E. R. 1922 Part ii Para 2) వ్రాసి మిచ్చినవారు. సిప్పలాఖుండీ, కోమ్నా అను రెండు గ్రామములు తమ గురువుగారి కిచ్చిన ట్లున్నది. ఈ శాసన మున్న యవెల్లిప్రదేశమే యీ సిప్పలాఖుండి. ఇది పొడాఘుర్ (పుష్కరి) కు ఆగ్నేయమూలగా నున్నది. కోమ్నా అను గ్రామము కుసూరి యను పేరుతో పొడాఘుడ్ పర్వతపంక్తికి ఉత్తరపాదము ననుసరించి పారుచున్న నాగినది యొడ్డున నున్నది. పుష్కరికి ఇంత సమీపములో నున్న గ్రామములు గోపాలదేవుగా రెట్లివ్వగలరు? పుష్కరి రాజ్యమును తమ స్వాధీనము జేసికొనకపోతే?

అందుచే క్రీ. శ. ౫ వ శతాబ్దము మొదలు క్రీ. శ. ౧౧వ శతాబ్దమువరకు, అనగా ౬౦౦ సంవత్సరములు పుష్కరరాజ్యము ప్రబలియుండెను. దీనిని బాలించిన రాజులు నిషధదేశాధీశుడైన నలమహారాజు వంశమునకు జెందినవారు. కాన నీప్రదేశము పూర్వమున నిషధదేశమని స్పష్టము.

పైని భీష్మపర్వాధ్యాయము ౨౮వ శ్లోకములో "పుష్కరో నామ పర్వతో మణిరత్నవాన్" అని చెప్పియున్నది. పాడాఘడ్ పర్వతము చుట్టుపట్ల నున్న జనులు ఆ రాళ్లనుండి యినుమును దీసి, తాళపుచిప్పలు మొదలు పెద్దకత్తులవరకు అన్నిరకముల పనిముట్లు, వ్యవసాయ సామగ్రులు, ఆయుధములను చేయుచున్నారు. భామినీవద్దనున్న కొండ నైక్రాంతమయమని యిదివరకే చెప్పినాను. నైక్రాంతమున్న దగ్గర బంగారము, వజ్రములు ఉండునట. నవనిధులు ఈపర్వతమందున్నవని చెప్పవచ్చును.

హుయంగ్ సాంగ్ అను చీనా యాత్రికుడు క్రీ. శ. ౬౨౯-౬౪౫ న మనదేశమందు బౌద్ధక్షేత్రములు చూచుటకు పర్యటనము జేసెను. ఇతడు కళింగమునుండి కోసలమునకు వెళ్లెను. కళింగదేశపు ముఖ్యపట్టణమునుండి కోసలము ౧,౮౦౦ లీలు, లేక ౧,౯౦౦ లీలు ఉండునని వ్రాసెను. ఇది ౩౦౦ ఇంగ్లీషు మైళ్లుండు నని లెక్కతో బేరారు లేక గాండ్వానా స్థానమందు కోసలము (దక్షిణ, లేక మహాకోసల) అని కన్నింఘామ్ (Cunningham) గారు తమ ప్రాచీన భూగోళశాస్త్రము (Ancient Geography) లో వ్రాసినారు. కన్నింఘాముగారి కొన్నికొన్ని పోలికలు తప్పని, కన్నింఘాముగారి జాగ్రఫీని ప్రచురించిన మజుందారుగారన్నారు. కళింగదేశపు ముఖ్యపట్టణము రాజమహేంద్రవరమని డొంకతిరుగుడు వాదనతో కన్నింఘాముగారు వ్రాసి, ౧౦౦ లీలు ౬ మైళ్లని తలచి బేరారుకు సరిపెట్టినారు కోసలమును. ఏనాడును రాజమహేంద్రవరము కళింగరాజ్యస్థానము కాలేదు. "మహేంద్రగిరి కౌత్తూరక, పైష్టపురక స్వామిదత్త" అని సముద్రగుప్తుని అలహాబాదు రాతిస్తంభశాసనములో జెప్పియున్నది. "విజయపిష్టపురాత్ కళింగాధిపతి మార్గదకులాంకరిష్ణుర్వా శిష్ణీ పుత్రో మహారాజశ్రీ శక్తివర్మా కలింగవిషయే రాకలువగ్రామే" అని యుండుటచే సముద్రగుప్తుని కాలమునాటికి 'మహేంద్రగిరి, పిష్టపురము' రెండు రాజ్యస్థానములు కళింగమున నున్నట్లు కన్పించుచున్నది. కాళిదాసుని రఘువంశములో రఘుమహారాజు దిగ్విజయయాత్రలో కళింగమందు మహేంద్రమునే పట్టుకొనినట్లు చెప్పియున్నది. ఇది క్రీ. శ. ౮-వ శతాబ్దాంతమువరకు. గంగవంశీయుల శాసనములలో 'విజయకళింగనగరాత్' అని యుండుటచే ముఖలింగము గంగరాజులకు ముఖ్యపట్టణమైనది తరువాత. ఈ చైనాయాత్రికుడు క్రీ. శ. ౭-వ శతాబ్దములో వచ్చినాడు గాన ముఖలింగమే అప్పుడు కళింగనగరమై యుండెను. ఈపట్టణమునుండి సరిగా యీచగొట్టినట్టు 'పాడాఘుర్'కు కొలిచినచో ౧౦౮ మైళ్లున్నది. రోడ్డుదారిని సుమారు ౩౦౦ మైళ్లుండును. ఈ ప్రాంతమే, అనగా ప్రస్తుతము ఛాటిస్ ఘుర్ అని పేర్కొనబడు ప్రదేశము (అందులోనిదే కోరాపుట్టిజిల్లాభాగము) మహాకోసలము. హీరాలాలుగారు కూడ నట్లే వ్రాసినారు.

హుయాంగ్ సాంగ్ గారు మహాకోసలముయొక్క ముఖ్యపట్టణమును జెప్పలేదు. కాని ఆ ముఖ్యపట్టణము చుట్టుకొలత ౪౦ లీలుండునని వ్రాసినారు. మహాకోసల రాజ్యములో నైఋతిమూలగా ౩౦౦ లీల దూరమున నొక యెత్తైన కొండ పొ-లో-మొ-లో-కి-లి (అనగా 'నల్లశిఖర'మని యర్థమట) యున్నది. చాలఉన్నతమై, శాఖలుగాని, లోయలుగాని లేక ఒక పెద్దరాయి స్వరూపము గలదట. దీనిలో శాలివాహనరాజు అయిదంతస్తులు గల మందిరము దొలిపించినాడని, దానికి వెళ్లు మార్గము గుహామార్గమని వ్రాసినారట. ఈ చైనా యాత్రికు డచ్చటికి వెళ్లి చూడలేదు. వినికిడివల్ల వ్రాసియున్నాడు.

వీటినిబట్టి చూచిన మన పుష్కరీ(పాడాఘడ్) పర్వతమునకు సరిపోవుచున్నది. ఈ పర్వతము ఒక్కటే వేరుగా నుండి సుమారు ౩౦౦ అడుగుల యెత్తు గల నల్లరాతికొండ. శాఖలుగాని, లోయలుగాని దీనికి లేవు. దీనికి త్రోవ పైని అల్లుకొనియున్న

కొమ్మలు గల ఇరుపార్శ్వముల చెట్లమధ్యనుండి యగుటచే గుహలాగుననే యున్నది. పాడై, పడి పోయిన మందిరములు కొండయంత స్తంత స్తునం దున్నవి. ఇట్టి యంతస్తులు ౫ ఉన్నవి. ఇచ్చట ఇనుము దొరుకుచున్నదిగాన 'నల్లరాయి' అనే యర్థము నిచ్చు చైనాపదమును వాడినారు. హుయాంగ్ సాంగ్ గారి కాలమునాటికి మహాకోసలకు నిదే ముఖ్య స్థానమైయుండెడిదని తోచుచున్నది.

ఈ పరిశీలనవలన జయపురసంస్థానమున గల పాడాగడప్రాంతమే పుష్కరి యనియు, నిదియే మహాకోసలమునకు ముఖ్యస్థానముగ నుండెననియు, ఈప్రాంతములే నిషధదేశమనియు తేలినది.

## మన గొప్పతనము

(ఇంట వస్తు, మీసాలకు సంపంగి నూనె)



# విజయోత్సవము

[ కథానిక ]

= శ్రీ క్రొవ్వి ల న్న =

మొన్న ఏదో తారీకునాటి ముచ్చట. పెళ్లివారిల్లులాగుంది జానకమ్మగారిల్లు- ఎంతో సందడిగాను. ఉదయాన్ని నాలుగింటే లేచి మా వెంకట్రావుగది అలంకరించి, తానూ ముస్తాబై ఏడు గంటలు కాకుండానే నన్ను కేకేసింది జానకమ్మ. ఆవేళకు నేనూ సిద్ధంగానే ఉన్నాను. అసలు నాకు నిద్దరపట్టి చచ్చింది కనకనా? అందులోనూ యీవిడ అలారం టైంపీసులా మొదలెట్టిందాయిరి, కావలసినంత గల్లంతు చేసుకుంటూనూ. తీరా స్టేషనుకు వెళ్లేసరికి రైలు రెండు గంటలు లేటు. మహా విసుక్కుంది ఆవిడ. అవును మరి విసుగుకాదూ? స్నేహితుణ్ణి అయినంతమాత్రాన్నే పరిపరివిధాల ఆలోచనలతో నాకు రాత్రి అల్లా నిద్దరపట్టింది కాదు గదా, మరి కట్టుకున్న ఆడదానికి యింకా యెంత ఆతృతగా వుండాలి? ఆమె అయితేనేం, నేనయితేనేం ఇప్పటికి అయిదేళ్లయింది వెంకట్రావును చూసి. (గారం లో ఉద్యోగాలకోసం ప్రయత్నిస్తూన్నప్పుడు కలిసివుండే వాళ్లం. తరవాత నేను ఢిల్లీ వెళ్లిపోవడం, వాడు మిలిటరీలో వి. సి. ఓ. గా చేరిపోవడం జరిగేయి ఆగ్రాలోనూ, అక్కడా వాడు తర్ఫీదులో వున్నంత కాలమూ వుత్తరాలు సక్రమంగానే వచ్చేవి; కాని అచిర కాలంలోనే సింగపూరు వేసేరు వాణ్ణి. మరికొన్నాళ్లకే అది కాస్తా జపానువాడు ఆక్రమించేడనీ, మనవాళ్లు కొందరు యుద్ధఖైదీ లయిపోయేరనీ వార్త! జానకమ్మ గుండెల్లో పిడుగుపడినట్టయింది. రేడియోలో ఆకబురు విన్ననాడు కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చింది. మేం ఎంతో ఓదార్చేం యీయుద్ధం ఎన్నాళ్లో వుండదనీ, వెంకటి త్వరలోనే తిరిగివచ్చేస్తాడనినీ. మొదట్లో ఆ అమాయకురాలు మా మాటలు నమ్మింది; కాని ఆర్నెల్లయినా వాడి భోగట్టాయే లేదు. రెడ్ క్రాస్‌వాళ్లకు రాస్తే "చెడుగు తెలిపేదాకా మంచి అనే యెంచండి" అని జవాబు వచ్చింది. రోజుకు రోజూ ఆవిడ మరీ శుష్కించిపోతూ వచ్చింది. మేం ఎంత ఓదార్చినా ఉస్సుమని ఒక్కనిట్టూర్పు తప్ప ఆమెలో ఆశాజ్యోతి లేశమయినా వెలిగించలేకపోయే వాళ్ళం. అప్పటికీ నేను ఎప్పుడయినా పట్టుగా మాట్లాడితే "నేనే చిన్నపిల్లనయితే ఏ బిస్కట్ల టిన్నో కొనియిచ్చేవాడివి కాదూ బావా" అనేది అతిదీనంగా. దాంతో నాకూ కళ్లంట నీళ్లు తిరిగి పోయేవి, ఆమెధీరలలితస్వభావం అర్థంచేసుకుంటూం టేను. పాపం! బారసాలపీటలమీద చూసిన వాడి కూతురుకు యిప్పుడు అయిదోయేడు. పసితనపు అమాయికత్వంచేత తండ్రిని స్మరించి తల్లికళ్లు చెమ్మగిల్ల చేస్తూవుంటుంది

గత రెండేళ్లబట్టీ వాడిదగ్గిర్నుంచి వుత్తరాలు— సంతకం మాత్రం స్వహస్త లిఖితం గా—వస్తూనే వున్నాయి గాని వాటిలో "నేను క్షేమం. మీరు క్షేమంగా వున్నారని తలుస్తాను" అన్న రెండు ముక్కలూ తప్ప యింకేమీ వుండేది కాదు. ఇలాంటిదైనా ఆర్నెల్లకో వుత్తరం! జానకమ్మకైతే యివి దొంగవుత్తరాలేమో నని అనుమానం కూడాను.

ఏమీ పాలుపోయేది కాదు. ఓనాడు మన సేనలు బర్మాలో పురోగమిస్తున్నా యనీ, కొంతమంది యుద్ధఖైదీలు విడుదల ఔతున్నా రనీ విని చాలా సంతోషించింది ఆమె. కాని ఒక్కనిమిషమే. "ఏమో, అంతమాత్రాన వీరిని ఏ ఖైదీల కేంపులో వుంచేరో మిత్రసేనలకు ఎల్లా తెలుస్తుంది? తెలిస్తే సరా, వీళ్లు వెళ్లి వారిని విడిపించవద్దూ? తీరా విడిపించేక మళ్లీ యుద్ధం చెయ్యమంటారేమో. అలాగంటారా? యిన్నాళ్లూ హింసలుపడ్డ వాళ్లకి కాస్త విశ్రాంతి యివ్వరూ? మిగతా కొంతమంది ఖైదీలను యిళ్లకు పంపేస్తున్నారుటగా? అయితే వీరి కబురెందుకు తెలియడం లేదూ" యిలాగ్గా ఆలోచనా తరంగాల్లో పడికొట్టుకుని, తను ఎప్పటిచోటనే వున్నానని తెలుసుకుని మళ్లీ విచారాంబుధిలో క్రుంకి పోయేది జానకమ్మ. వాడి మాట యెలాగ వున్నా యీవిణ్ణి చూస్తే పరాయివాడికైనా యీబాధ వద్దు బాబూ అనిపించేది మాకు.

ఇలాగ్గా కృత్యాద్యవస్థల్లో కొట్టుకుపోతూవుంటే మొన్న వచ్చిందో తంతి, వెంకట్రావు యివాళ వస్తున్నాడని. వెంటనే మా దొరదగ్గిర సెలవుపుచ్చుకుని యింటికి వచ్చేసి జానకమ్మతో చెప్పేను యీ సంగతి. పరమానందభరితురా లయిపోయింది; ఇహ ఆశలన్నీ నిరాశలే అనుకుని అశోకవృక్షంక్రింద సీతాఅమ్మవారిలాగున్న పరమపతివ్రతకు మర్నాడు ఉదయాన్నే పతిసందర్శన లాభం కలుగబోతోంది. అప్పటి ఆమె మనస్తత్వం ఊహించుకోవలసిందే కాని వర్ణించడానికి వీలుకాదు. తీరా వెళ్లేసరికి రైలు లేటుకావడంతోటే విసుగు వొచ్చింది. అయినా "యీపాటికి ఆ స్టేషను దాటి వుంటుంది, యీ స్టేషను దాటివుంటుంది" అని కబుర్లు చెప్పుకుంటూనే వున్నాం. ప్రాణాహుతులు మాత్రమే పుచ్చుకుని పరిపుచ్చుకునే జానకమ్మకు ఆనాడు లెమొనేడు ఎంతో రుచికరంగా కనపడింది. "నువ్వు ఏమీ అనకుండా వుంటావా నాన్నా, యిప్పుడే వస్తా" నంటూ నాలుగడుగులు అటు వెళ్లింది. ఎందుకో అనుకున్నాం. కొర్ల ఓకాటిన్నూ, అగ్గిపెట్టే కొని పట్టుకు వచ్చింది. "వారికి సిగరెట్లు వుంటే భోజనం కూడా అక్కర్లే"దంటూనూ. ఎంతలోకి ఎంతమార్పు వచ్చింది! చూస్తూండగానే మెయిల్ సైట్ అని అరుపూ, వెంబడే ఆరాధ్యదేవతకు హారతి జేగంటలాగ మనోహరమయిన ఘంటానాదం వినవచ్చేయి. జానకమ్మ హృదయం కనిపెట్టినదానిలాగ రోజుకుంటూ వచ్చి మా ముందు ఆగింది రైలు. వీడు వి. సి. ఓ. గదా అని ఇంటరు క్లాసు వెతుకుతూవుంటే ప్రక్కనున్న ఫస్టులోంచి దిగి భుజం తట్టేడు వెంకటి. "ఓరి నీ యిల్లు బంగారం గానూ! కెప్టెనువి ఎప్పుడయ్యేవురా" అని వాడి భుజకీర్తులు చూస్తూ నే నడిగిన ప్రశ్నకు "చాలా గాథ వుందిలే, రాత్రి చెబుతా" నంటూ మామగారికి నమస్కరించేడు. ఆయనా ఆశీర్వదించి లేవనెత్తేడు, కళ్లనీళ్లు కనబడకుండా తుడుచుకుంటూనూ. తరవాత జానకమ్మపక్కన నిల్చున్నాడు. ఆమె అనంతమయిన ఆనందబాష్పాలతోనే భర్తకు స్వాగత మిచ్చి తన సంతోషాన్ని వ్యక్తపరుచుకుంది. చిట్టితల్లిని ఎత్తుకో బోతే ఏడ్చింది కొత్తచేసి. స్టేషనులో వున్న బొమ్మలూ, బిస్కత్తులూ కొని లంచం యిచ్చి మచ్చికచేసుకున్నాడు. ఆ రాత్రి వాడి భుజంమీదే నిద్దరోయింది పిల్ల......

౨

రాత్రి తొమ్మిదవుతుంది. భోజనాలు చేసి వాకిట్లో మంచాలమీద కూర్చుని ఆరంభించేం; బాతాఖానీ అంతులేకుండా సాగిపోతూంది. వెంకటి చెపుతూవుంటే ఒళ్లు ఝల్లుమనేది ఒకొక్కప్పుడు—

"అంత చులాగ్గా వచ్చిం దనుకున్నావట్రా యీకెప్టెన్సీ? ఓహూ లేం జరిగిందనుకున్నావ్? మేం ఫీల్డులో వున్నప్పుడు మందూ గుండూ వచ్చే యని కబురు తెలిసింది. అవి తీసుకురమ్మని దొర నన్ను దగ్గిరున్న రైలుస్టేషనుకు పంపించేడు లారీ లిచ్చి. తీరా వెళ్లేసరికి "ఇ దేమిటి? ఓ ఘంటక్రితమే

మీ మేజరు ఎవరో వచ్చి సామాన్లు పట్టుకెళ్లేరు. ఇవిగో వాచర్ల మీద సంతకాలు" అని చూపించేడు స్టేషను మేస్టరు. నేను నిర్ఘాంతపోయి వెళ్లి మా దొరతో యీ సంగతి చెప్పేసరికి, "అయ్యో జపానువాడు మనవాళ్లను ఖైదీలుగా పట్టుకుని యిలాగే ఆడిస్తున్నాడు" అన్నాడు. తరవాత రెండు మూడుసార్లు తను వెళ్లినప్పుడూ యిలాంటి సంగతే జరిగింది. దీనికి వుపాయం ఆలోచించడం మొదలెట్టేం. ఎన్ని ప్లాన్లు వేసినా సరిపోయిందికాదు. పదేపదే సగుకుపోతూవుండడంవల్ల మాకు ప్రాణసంకటంగా వుండేది.

"మంత్రియుగంధరుడికి మాతృభూమి అయిన ఆంధ్రదేశంలో జన్మించి నువ్వుకూడా ఏమీ ప్రత్యుపాయం ఆలోచించలేకపోతున్నావుకదా సుబేదార్ సాహబ్" అన్నాడు దొర.

"చిత్తం. నాకు ఒక్కటే శరణోపాయం గోచరిస్తోంది"

"ఏమిటది ?" అన్నాడు బహు ఆతృతగా— నూతిలో మునిగిపోతున్నవాడు ఏదైనా పట్టు దొరుకుతుందేమోనని తడుముకుంటున్నట్టు.

"మరేమీ లేదు. జపానుసైన్యాల్లో మనవాళ్లు వున్నారుకదా ; వాళ్లలో ప్రతికూలంగా సంచలనం బయలుదేరతీయ్యాలి. లేదా వాళ్లలాగే మనలో కొందరు నటించి ఆచోకీ పూర్తిగా కనిపెట్టాలి."

"కష్టసాధ్యమయిన పని"

"అయినా పట్టుదలగా పనిచేస్తే నెగ్గకపోలేం..."

అమర్నాడు మామూలుగా పటాలాన్ని తీసుకు వెళుతూవుంటే ఎక్కణ్ణుంచో ఓ గ్రెనేడు వచ్చి బంతిలా మామధ్యన పడింది. వెంటనే ముగ్గురు గాయపడ్డారు. నేను "ఫైరుఆర్డరు"(Fire Order)యిచ్చేను. మాపటాలం తుపాకులు పేల్చేరు నాలుగుదిక్కులా గురిచేసి. ఎక్కడ చూసినా ఢాంఢాం అన్న శబ్దం, పొగా తప్ప యింకేమీ లేదు. పదినిమిషా లయింతరవాత అటునుంచి ధ్వని లేకపోవడంతోటే కాల్చడం మానేసి పస్తాయించిచూసేం. ఏక్కడా శత్రువుజాడ లేదు. వెధవలు చచ్చేనే రనుకున్నాం ; పురోగమనం ప్రారంభించేం. చిన్న అడివిలోంచి పోవాలి. చెట్లు దట్టంగా పెరగడంచేత చీకటిగా వుంది ; దానికి తోడు కొండలోయ. అంతా జీమూతంగా వుంది. అడివి దాటేక నది ఒక్కటి వుంది. అందాకా వెళితేనేకాని నీళ్లచుక్కలు లేవు మాకు. యుద్ధం బహిలికమూలాన్నయితేనేం, మూణ్ణాళ్లనుంచీ అలా సాగుతూ వుండడంమూలాన్నయితేనేం— మాకు మహా దాహం, ఆకలీ వేస్తున్నాయి. సంచీల్లో రొట్టెలు ఎండిపోయి తోలుముక్కల్లా గయిపోయినాయి. మీలా సావకాశపు భోజనాలుగనకనా ? మార్చి చేస్తూనే తినాలి. తింటే తాగడానికి నీళ్లచుక్క లేవు. అంచేత ఎలాగో ఒహలాగ అడివి దాటడానికే నిశ్చయించేం. తీరా పదిఅడుగులు పెట్టేమో లేదో, పడపడ పళ్లు రాలినట్టు రాలేయి చెట్లమీదినుంచి హేండ్ గ్రెనేడ్లు అసలే తిండీ తిప్పలూ లేకుండావున్నారేమో, మా పటాలం యీదెబ్బతో నానాబీభత్సం అయిపోయింది. చూస్తూవుండగానే కోతుల్లా దిగిపోయినారు చెట్లమీదినుంచి కొంతమంది జపానువాళ్లు. మేం యుద్ధఖైదీలమైపోయేం. ఇదే గోరిల్లాయుద్ధం అంటేను.

తుపాకుల బేయొనెట్లు మావీపులకు ఆనించి మూడుమైళ్లు దిక్కుమాలిన ముళ్లదారిని నడిపించి వాళ్ల కేంద్రస్థానానికి తీసికెళ్లేరు. అక్కడ నా "భుజకీర్తులు" (Shoulder titles) తీసుకున్నారు. వాళ్ల ఆఫీసరు ఏమిటో అడిగేడు. నేను జవాబివ్వలేదు. ఫెడేల్మని లెంపకాయ లాగేడు గూబ గుయ్యిమనేటట్టు. మొహం తిరిగి క్రిందపడిపోయేను...... తెలివివచ్చి చూచుకునేసరికి, మరి కొంతమంది యుద్ధఖైదీలతోసహా కాన్సెన్ట్రేషన్ కాంపులో వున్నానని తెలుసుకున్నాను. ప్రక్కనున్న హిందూస్థానీవాడితో "మీపేరేమిటి?" అన్నాను హిందీలో. "ఇంగ్లీషులో ఏడవ్వోయి"

అంటూ కాలిబూటుతో తన్నేడు జపానుప్రిజను గార్డు. తరవాత సూరబాయదీవికి పంపించేరు. అక్కడ మాచేత రోడ్లు తుడిపించేవారు. పొద్దున్న అయిదింటి నుంచీ చీకటిపడేవరకూ మేం చేసిన హీనమయిన చాకిరీకి లెక్కలేదు. దానికితోడు బుర్రలు నున్నగా గీయించేసేరు, ఎండలో బాధపడాలని. ఇహ తిండి ఏమిటో తెలుసా? మూడుముద్దలు అన్నం, ఓడొక్కుతో నీళ్లున్నూ. ఒహొక్కనాడు మినప్పప్పు "పప్పు" చేసేవారు. వెధవజిగట! నాకు వాంతిఒచ్చేది. అలా మూడుఏళ్లు గడిచేను. ఆ తరవాత నన్ను మెడికల్ యూనిట్‌కు బదిలీచేసేరు, మన యుద్ధఖైదీలను బాగు చెయ్యడానికి. అక్కడ స్ట్రెచ్చెర్లుమొయ్యడం, గాయాలకు కట్లు కట్టడమున్నూ. పేరుకే మెడికల్ యూనిట్టు గాని ఒక్క మందూ వుండేదిగాదు. కట్టిన గుడ్డలే మళ్లీ బేండేజి చేస్తూ వుండేవాళ్లం. ముప్పాతిక చావులే. బ్రతికిన పాతికా అదృష్టం బావున్న వాళ్లన్నమాట... మరి కొంతకాలానికి మమ్మల్ని న్యూగినీ పంపించేరు. ఆ స్టీమరుప్రయాణం నువ్వు ఊహించుకోలేవు. ఓ చిన్న కేబినులోకి మమ్మల్ని నూటయాభైమందినీ తోలేరు పశువుల్లాగ. పశువులగుంటడు గేదెమీద కూర్చుని అటూ యిటూ గొడ్లమీద కర్ర తిరగేసినట్టు, కేబినులోకి వెళుతూవుంటే ఆ గుమ్మందగ్గిరున్న జపానువెధవ మా బుర్రలమీద టింగుటంగుమని బేటనుతో కొడుతూనే వుండేవాడు. ప్రొద్దున్న ఒకమారు, సాయంత్రం ఒకమారు మాత్రం డెక్కుమీదికి రానిచ్చేవారు. అంతే. మళ్లీ ప్రకృతిమాతదర్శనం లభించేది కాదు.

మేమూ న్యూగినీతీరాన్ని అడుగుమోపేమో లేదో, ఆ ద్వీపానికి అవతలప్రక్క మిత్రసేనలు దిగి వున్నాయనీ, చాలా నష్టం కలగజేస్తున్నాయనీ అలజడి కలిగింది జపానువాళ్లలో. ఆరాత్రే అకస్మాత్తుగా ఓ విమానదాడి జరిగింది. మా కాపలావాళ్లు రహస్యస్థలాల్లోకి పారిపోయేరు తల దాచుకోడానికి. పుచ్చపువ్వులాంటి వెన్నెట్లో నే నిదంతా గమనిస్తూనే వున్నాను. చుట్టుపక్కల నిర్బంధం లేకపోవడంతోనే పదిగజాలు అలా వెళ్లబోయేసరికి కాలి కేదో తగిలింది. యుద్ధరంగంలో అలా శవాల్ని తన్నుకుంటూపోవడం మామూలే మాకు. అయినా మనవాడెవడయినా నేమో నని వంగి చూసేను. జపానువాడు! వాడి చేతిని వున్న వాచీ తీసుకుని అప్పుడు నాలుగున్నర అయిందని తెలుసుకున్నాను. వాడి జేబులూ, సంచీ తడిమేసరికి నాలుగు బిసకత్తులూ, కొంచెం టీ దొరికింది. వాటితో క్షుద్బాధ తీర్చుకుని యింకా శోధించగా కొన్ని మాపులూ, ఓ కెమేరా, ఫోటోలూ, టార్చిలైటూ, బ్రాందీబుడ్డీ దొరికేయి. ఇవి అన్నీ భద్రపరుచుకుని, ఆప్రదేశం అంతా తిరిగి తిరిగి మూర్తిగార్నీ, రావుగార్నీ—ఖైదీలు కాక ముందు వాళ్లు యిద్దరూ కేప్టెన్లు—కలుసుకున్నాను. మూర్తిగారు స్మారకం లేకుండా పడివుంటే మూడు మైళ్లు మేం యిద్దరం మోసుకెళ్లి ఓ గుహలాంటి దాన్లో చేర్చేం. అక్కడయినా అరఘంట అవస్థపడితేనే కాని ఆయనకు తెలివిరాలేదు. మేము బడలిక తీర్చుకుంటూంటే తెల్లవారింది. ఆ ప్రభాతరాగోదయంలో ఆ ప్రకృతిదృశ్యం ఎంతో రమణీయంగా కనిపించింది. కాని పైకి కదిల్తే ఎక్కడ ఏమి కీడు మూడుతుందోనని భయం. ఎనిమిదింటిదాకా అలానే వుండిపోయేం. అప్పటికీ చడి రేమీ లేదు. ఎదరనున్న తుప్ప ఒకటి పీకి ఆకొమ్మలతో పళ్లు తోముకున్నాం. కనుచూపుదూరాన్ని చెట్లు కనిపించేయి ఏవోను. మొదట్లో పోకచెట్లనుకున్నాం; కాని కొబ్బరి చెట్లేను. అక్కడే మా కొంపు. కొబ్బరిగుజ్జు ఆహారం, ఆనీళ్లే పానీయమున్నూ. ఆచెట్లే ఎక్కి నాలుగుమూలలా చూస్తూవుండేవాళ్లం మిత్రసడా రాలు కనిపిస్తాయేమోనని. రెండురోజులు ఏమీ ఆచోకీ దొరకలేదు. అకస్మాత్తుగా నాకు దొరికిన మాపులసంగతి జ్ఞాపకంవచ్చింది. అందులో మార్కు చేసివున్న డేంజరుస్థలాలే (Danger zones) మిత్రసైన్యాలు విడిసివున్న చోట్లని నిశ్చయపరుచుకొన్నాం. అడివిలోంచి మార్గం చేసుకుని వెళ్లి అక్కణ్ణుంచి మళ్లీ చూసి స్థిరమయిన వార్త తెలుసుకోవాలి.

రావుగారు యీపనికి పూనుకున్నారు. వెళ్లి రెండు రోజులయినా అతని కబురే లేదు మాకు. ఏమో కొంపమునిగింది అనుకుంటూ వుండగా, మూడో నాటి పొద్దున్నే రొప్పుకుంటూ వచ్చేడు ఆయన. మనవాళ్ల కాన్వాయి పడమరగా వెళ్తోందనీ, తనకు జ్వరం తగలడంచేత అంతకన్నా త్వరగా రాలేక పోయినా ననీ చెప్పేడు. ఇహ మా ఆనందం ఏమని చెప్పను! రావుగారికి నా దగ్గరున్న బ్రాందీ యిచ్చేను. మా మాపుల సహాయంతో కాన్వాయిని ఎంతదూరంలో కలుసుకోగలమో అంచనాకట్టి సులువుగా చేరు కున్నాం. కాన్వాయికమేండరు మమ్మల్ని చాలా ఆదరించేడు. ఆ రాత్రి సుష్టుగా భోంచేసిన తరవాత ఓ లారీ యిచ్చి మమ్మల్ని బేస్‌కాంపుకు పంపించేడు. రూల్సు ప్రకారం అక్కడ దొరదగ్గిరకు తీసుకెళ్లేరు మమ్మల్ని. అతను ఎవరనుకున్నావ్? మొదట్లో సింగ పూరులో నాపైని వుండేవాడేను. సెల్యూటుచేసి, "నేను ఫలానా వాణ్ణి. అల్లావేళ జపాను సైన్య విన్యాసం గురించి నేను మనవిచేసిన మాటలు తమకు జ్ఞాపకం వున్నాయా?" అన్నాను. దొర విస్తుబోయి చూస్తున్నాడు. మాపులు, ఫోటోలు అన్నీ అతని ఎదుట పెట్టి "యిహ మీరు పూనుకోవడమే తరవాయి; నా ప్రతిజ్ఞ నేను నెరవేర్చేను" అన్నాను. దొర అమాంతం కౌగిలించేసుకున్నాడు. నాకు కేప్టినుపోదా వెంటనే యివ్వవలసిందని తంతి యిచ్చేడు. ఆ రాత్రీ, మర్నాడూ నాతో యుద్ధ సన్నాహాలు ముచ్చటించి, నాసౌకర్యాలకు అన్ని ఏర్పాట్లూ చేయించి పంపేడు."

—అని యింకా ఏమిటో చెప్పబోతున్నాడు వెంకట్రావు. మేం యింత వేగిరం తెమిలేటట్టు లేమనుకుని ఆ అర్ధరాత్రి కాఫీ కాచి యిచ్చింది జానకమ్మ. అలా కబుర్లతోనే తెల్లారిపోయింది. ప్రక్కనున్న రేడియో పెట్టేం వార్తల కోసమని. జయభేరీ మ్రోగింది. పశ్చిమయుద్ధం అంతం అయి పోయిందనీ, విజయోత్సవాలు ఫలానానాడు జరుగు తాయనీ తాజావార్త!

"వాళ్ల మొహం. యీ విజయోత్సవం నాదీ. చూడండి ఎల్లా చేస్తానో" అంది జానకమ్మ—యిడ్లీ, కాఫీ యిస్తూనూ.





ప్రపంచ శాంతి వ్యవస్థా నిర్మాణానికై శాన్ ఫ్రాన్సిస్కో మహాసభలో పాటుపడుతున్న మిత్రరాజ్య కార్యవర్గ ప్రతినిధులు.

# నర్సింగు ప్రపంచములో సర్వోత్తమమైన పని

మానవసేవకు సంబంధించిన పనులన్నింటియందునూ నర్సింగు సర్వోత్తమమైనది. తెలివితేటలుగల స్త్రీలకు దానిపై స్వభావ సిద్ధంగా ఆసక్తి కలుగుతుంది. అది నిజంగా యుద్ధానికి సంబంధించిన పని. తెల్లని ఏ. ఎన్. ఎస్. యూనిఫారం దుస్తులు ధరించిన వారు సైనికుల గాయముల బాధను తగ్గించగలరు.

ఇంటివద్ద సోమరులుగా కూర్చొనుట కంటె ఒక పనిచేయుట ఈ రోజులలో స్త్రీలకు ఫేషనుగా వున్నప్పుడు వైద్యశాలలయందు బాధానివారణ పనులలో వున్న ఈ ఉత్తమ నారీమణులతో చేరవలెను.

యుద్ధానంతరము పౌరజీవితములో అమూల్యముగా వుండగల శక్తిసామర్థ్యములను ఉత్తమమైన ఏ. ఎన్. ఎస్. శిక్షణవలన కలుగును. కాని, మీకు ఆ ఉద్యోగము లేకపోవచ్చు. గృహవసతిలో మీ జీవితాంతమువరకు, లేదా, సాంఘిక సేవలో వైద్యవృత్తికి చెందిన ఈ అనుభవము అమూల్యముగా నుండగలదు. అవకాశమును పోనియ్యవద్దు!

ఏ. ఎన్. ఎస్. జీతము తగినంతగా హెచ్చింపబడినది. ఉదాహరణముగా క్రొత్తగా జనరల్ సర్వీసు జీతము నెలకు రూ. 135-175. బస. భోజనము. సేవకులతో సహా ఉచితము. లేదా. అవి లేకుండా జీతము నెలకు రూ. 203-243. 17 నుండి 45 సంవత్సరముల వరకు వయస్సుగల యే స్త్రీ అయినను ఇందులో చేరవచ్చును వీరు బ్రిటిష్ ఇండియాలోని వారుగాని. స్వదేశ సంస్థానములలోని వారుగాని అయివుండవలెను.

ఇంతకు ముందు అనుభవ మేమియు అవసరము లేదు. కాని నర్సింగులో అనుభవము వున్నట్లయితే పెద్ద జీతములో చేరవచ్చును.

నర్సులను జాగ్రత్తగా చూస్తారు. తమంతట తామే విదేశాలకు వెళ్లదలచినవారు తప్ప, మిగతా వారందరు ఇండియాలోని ఉద్యోగములలోనే నియమించ బడుదురు.

పూర్తి వివరములకు లేడి డిస్ట్రిక్టు సూపరింటెండెంటు సెంట్ జాన్ అంబ్యులెన్సు బ్రిగేడ్ ఓవరుసీస్, మదరాసుకు వెంటనే వ్రాయండి.

అభ్యర్థు లందరునూ ఆంగ్లమున ధారాళముగ సంభాషించుట, రచనచేయుట తెలిసియుండి అప్లికేషన్ పారమ్‌ల కొరకు పెట్టుకొను దరఖాస్తులను ఆంగ్లములో వ్రాయవలెను.



# కాకతిగణపతిదేవుడు - కులోత్తుంగరాజేంద్రచోళుడు

= శ్రీ నేలటూరి వెంకటరమణయ్య =

[ ఫిబ్రవరి సంచిక తరువాయి ]

డాక్టరు మారేమండ రామరావు పంతులుగారు వెలనాటి రాజ్యపతనమును వేరొక తీరుగ వర్ణించియున్నారు. కాకతిరుద్రదేవుడు వెలనాటిపై నెత్తివచ్చి రెండవ కులోత్తుంగ రాజేంద్రచోడని వధించి గోదావరీతీర దేశము నాక్రమించుకొనెననియు, దత్కారణమున పృథ్వీశ్వరుడు గోదావరికి దూర్పున నుండిన రాజ్యభాగమునుమాత్రమే యేలుచుండె ననియు వ్రాసి యున్నారు.[29] కాకతిరుద్రుడు రెండవ కులోత్తుంగ రాజేంద్రచోడని జంపె ననుట కేయాధారమును గానరాదు. దీనినిరుజువుసేయదగిన సాక్ష్యము లభ్యపడువఱకు దీని నంగీకరించుట యుక్తము గాదు; కాని రుద్రుడు గోదావరీతటమునందలి సముద్రతీర దేశమును నీ కాలమున నాక్రమించె ననుట వాస్తవమే. ఇతని శాసనము లీవిషయమును స్పష్టముగ దెలుపుచున్నవి. ఇవి రెండు: ఒకటి శకాబ్దము ౧౧౦౧, అనగా క్రీ. శ. ౧౧౭౯-౮౦ నాటిది.[30] మఱియొకటి శకాబ్దము ౧౧౦౮, అనగా క్రీ.శ. ౧౧౮౬-౭ నాటిది.[31] ఈ రెండు శాసనములును ముఖ్యమైనవి. ఇందలి మొదటి శాసనమును, వెలనాటి చోడ నిర్మూలను డనియు వెలనాటి చోడరాజ్యనిర్మూలను డనియు గాలచుర్య సంకముని దండనాయకు డగు కావణయ్య దండనాథుని పరాక్రమమును బ్రకటించు బెళగుత్తిశాసనము నొక్కకాలమున వ్రాయించినవే. రెండును క్రీ. శ. ౧౧౭౯-౧౧౮౦ నాటివే. ఇది కేవలము కాకతాళీయము గాదనియు, నీరెండుశాసనముల కాలమును సరిపోవుటకు ప్రబలకారణము గల దనియు దలచెదను. రెండవశాసనమున నొక విశేషము గానవచ్చుచున్నది. రుద్రదేవుడు కేవలము శకాబ్దమున గాని, నిజరాజ్యవర్షమున గాని శాసనము వ్రాయింపక శకాబ్దము ౧౧౦౮ కి సరియైన సర్వలోకాశ్రయవిష్ణువర్ధన మహారాజుల ౫-వ రాజ్యమున వేయించియున్నాడు. ఇట్లు శాసనములు వ్రాయించుకొనుట సామంతలక్షణము. ఈ సర్వలోకాశ్రయవిష్ణువర్ధను డెవ్వడో తెలియదు; ఏ కారణముననో రుద్రదేవు డితని యాధిపత్యము నంగీకరించినట్లు తోచుచున్నది. శకాబ్దము ౧౧౦౮ ఈ విష్ణువర్ధనుని ఐదవ రాజ్యవర్షమునకు సరిపోయిన ట్లీ శాసనమున జెప్పియుండుటచేత నితని రాజ్యారంభకాలము శకాబ్దము ౧౧౦౩, అనగా క్రీ.శ. ౧౧౮౧-౨ అని యూహించుటకవకాశము గలుగుచున్నది. కాని ద్రాక్షారామము నందలి మఱియొక శాసనమున శకాబ్దము ౧౧౦౭, అనగా క్రీ. శ. ౧౧౮౫-౮౬ ఇతని ౬-వ ప్రవర్ధమాన విజయరాజ్యవర్షమునకు సరియని యుండుటచేత ఇతని రాజ్యారంభకాలము క్రీ. శ. ౧౧౭౯-౮౦ అని తేలు

---

29. కాకతీయసంచిక. పుటలు ౨౭-౮

30. Mad. Govt. Or. Mss. Lib. (Elliot's Collection) 15-6-26 P. 207.

31. S. I. I. IV no. 1155.

చున్నది. 32 ఇదియే నిశ్చయమైనచో నీ విష్ణువర్ధనుని రాజ్యారంభకాలమును, నితనికి సామంతుడో మిత్రుడో యగు కాకతిరుద్రునిగోదావరీతటసముద్రతీరదేశాక్రమణ కాలమును, గాలచుర్యసేనాపతి కావణదండనాయకుడు వెలనాటి చోడరాజ్యనిర్మూలన మొనర్చిన కాలమును సరిపోవుచున్నది. ఈ యంశముల నన్నిటిని సమాలోచనము జేసి చూడగా వీ రందఱును గలసి వెలనాటి రాజ్యముపై దండువెడలి వెలనాటివారి యధికారమును గూలద్రోసిరని తోచుచున్నది.

ఇట్లు కాకతిరుద్రుడు గర్ణాటకుల గూడియో, లేక వారి ధాటి తన యుద్యమమున కనుకూలపడుటచే ప్రత్యేకముగనో తీరాంధ్రదేశముపై నెత్తివచ్చి వెలనాటి రాజుల యధీనమందుండిన ద్రాక్షారామపరిసరగోదావరీతటప్రదేశము నాక్రమించికొన్నను చిరకాల మచట నతని యధికారము సాగలేదు. క్రీ. శ. ౧౧౮౬ తరువాతివి అతని శాసనములు తీరాంధ్రమున గానరాక పోవుటచే నతని యధికార మటుతరువాత నశించెనని చెప్పవలసియున్నది. ఇట్లు కాకతీయుల యధికారము క్షీణమగుటకు వాస్తవమైన కారణము తెలియదు. ఒకవేళ దక్షిణదేశమునుండి యప్పుడు తీరాంధ్రదేశముపై వచ్చిన చోళదండయాత్రమూలమున నిర్వహించుకొనలేక రుద్రుడు వెడలిపోయినను బోయియుండవచ్చును.

చోళదండయాత్ర:—వెలనాటిరాజులు పాశ్చాత్యులను స్వబలపరాక్రమములచేతనే వెడలవడచి పారతంత్ర్యవిముక్తి బొందినను చోళచక్రవర్తుల యెడ దమకు గల భక్తివిశ్వాసముల పెంపుననో, వారి మఱుగున దమ యధికారము నభివృద్ధిపఱచుకొనుట కనుకూలపడుటచేతనో అశక్తులును, సత్వహీనులును నైనను చోళచక్రవర్తుల పేరనే తీరాంధ్రము నేలసాగిరి. రెండవ రాజరాజచోళచక్రవర్తి రాజ్యాంతకాలము వఱకును ఈతీరున నడచినది. అంతటితో కులోత్తుంగచక్రవర్తివంశ మంతరించినది; వెలనాటివారి యధికారము ముఖలింగము మొదలు నెల్లూరుపర్యంతము గల తీరాంధ్రదేశమున నెలకొనెను. వెలనాటివారికి చోళచక్రవర్తుల పేర రాజ్యముసేయవలసిన యావశ్యకతయు దీఱిపోయినది; కావున వారు చోళచక్రవర్తుల యాధిపత్యము నంగీకరించక స్వతంత్రులైరి. చోళచక్రవర్తి రెండవరాజరాజుకు దరువాత చోళసింహాసనము నధిష్ఠించినవాడు రెండవ రాజాధిరాజు చోళసింహాసనము నధిష్ఠించి ద్రవిడ దేశమున నితడు రాజ్యము సేయుచున్నంతకాలమును ఇతని శాసనములు దీరాంధ్ర దేశమున నెచ్చటను గానరావు; మఱియు నితనికి సమకాలికుడైన వెలనాటి ప్రభువు రెండవ కులోత్తుంగ రాజేంద్రచోడుడు దా నీ చోళచక్రవర్తికిగాని, మఱియొకరికి గాని సామంతుడనని యెచ్చటను జెప్పకొని యుండలేదు. కావున చోళచక్రవర్తుల యధికారము తీరాంధ్రమున సంపూర్ణముగ నశించెనని చెప్పవచ్చును.

కాని ఇతని మరణానంతరము చోళసామ్రాజ్యమున సంభవించిన విప్లవమువలన చోళచక్రవర్తియగు రెండవ రాజాధిరాజు స్థానభ్రష్టుడై తీరాంధ్రదేశమునకు వచ్చి యచ్చట క్రీ. శ. ౧౨౧౫ వఱకును దన యేలుబడి నొకరీతి సాగించుకొనుచుండెను. 32-a

ర్తిశేషుడైన డాక్టరు కీల్‌హోర్‌న్‌గారు తమ కప్పుడు లభ్యమైన రెండవ రాజాధిరాజు శాసనముల నన్నిటిని బరిశీలించి యతడు క్రీ. శ. ౧౧౬౩-వ సంవత్సరమున ఫిబ్రవరి ౨౮ మార్చి ౩౦ వ తేదులమధ్య నేదోయొకనాడు రాజ్యాభిషిక్తు డాయెనని ఎపిగ్రాఫియా ఇండికా ౯-వ సంపుటమున నిర్ధారించియున్నారు. ఈ కాలనిర్ణయమునే తరువాత వ్రాసిన పరిశోధకు లందఱు నంగీకరించిరి. ఇటీవల బయల్పడిన శాసనములనుబట్టి చూడగా నీకాలనిర్ణయము సరి

32. Ibid. no. 1201.

32-a ఈయంశమును నాదృక్పథమునకు దెచ్చి యుత్తర చాళుక్యచోళ ఆంధ్రదేశచరిత్రలో నిగూఢమైన సమస్యలకు సమాధానమును సూచించినందులకు మద్రాసు విశ్వవిద్యాలయ చరిత్రశాఖయందు పరిశోధక విద్యార్థిగా నుండిన శ్రీ మామిడిపూడి వెంకటేశ్వరులు గారికి గృతజ్ఞుడను.

పమట లేవనిన్ను, కొన్నింటివల్ల నితడు క్రీ. శ. ౧౧౬౬ ప్రాంతమున రాజ్యముసేయుట కారంభించి నట్లు తెలియవచ్చు చున్నదనియు నీలకంఠశాస్త్రిల వారు చెప్పియున్నారు.32b ఇది వాస్తవము. శ్రీనీలకంఠశాస్త్రిలవారుదాహరించిన శాసనములకంటె రెండవ రాజాధిరాజు నవమరాజ్యవర్షమునకు సరియైన శకాబ్దము ౧౦౯౫ నాటి తిరుప్పాచ్చూరు శాసనము ఈ విషయమును జక్కగా విశదపఱచుచున్నది. 32-c దీనివల్ల నీరాజాధిరాజు రాజ్యారంభకాలము శ. ౧౦౮౬, అనగా క్రీ. శ. ౧౧౬౪-౫ అని తేలుచున్నది. అరవదేశమునం దితని ౧౬-వ రాజ్యవర్షమునకు దరువాతివి కానరాకపోవుటచేతను, ఇతనికి బిమ్మట చోళసామ్రాజ్యాధిపత్యమును వహించిన ముమ్మడి కులోత్తుంగ చక్రవర్తి క్రీ. శ. ౧౧౭౮ న రాజ్యము సేయుటకు బ్రారంభించియుండుటచేతను ఇతని యేలుబడి క్రీ. శ. ౧౧౭౯ లోనో, లేక రాజ్యారంభము క్రీ. శ. ౧౧౬౬ నందని యంగీకరించిన క్రీ. శ. ౧౧౮౨ లోనో తుదముట్టెనని చరిత్రకారు లభిప్రాయ పడి యున్నారు. 32-d ఈయభిప్రాయ మంగీకరింప దగినది. ఏలనగా తీరాంధ్రదేశమున గానవచ్చు కొన్ని శాసనములవల్ల నితడు ద్రాక్షారామ ప్రాంతదేశమందు క్రీ. శ. ౧౨౧౨ వఱకు రాజ్యముసేయుచుండినట్లు తెలియవచ్చుచున్నది. ఇందు ముఖ్యమైనవి రెండు :

(౧) శకాబ్దము ౧౧౧౫ అగు నేంటి శ్రీ రాజాధిరాజదేవర సంవత్స ౨౮ శ్రాహినాటిది. (S. I. I. IV. No. 1223.)

(౨) శకవర్షంబులు ౧౧౩౪ గు నేంటి శ్రీమత్రిభువన చక్రవర్తి శ్రీ రాజాధిరా (జదేవర) విజయ రాజ్య సంవత్స ౪౭ శ్రాహినాటిది. (S. I. I. IV. No. 1118.)

ఈ రెండు శాసనములవల్లను ఈ రాజాధిరాజు శకాబ్దము ౧౦౮౭ న, అనగా క్రీ. శ. ౧౧౬౫-వ సంవత్సరమునందు రాజ్యముసేయుటకు ప్రారంభించి నట్లు తెలియవచ్చుచున్నది. ఇదియే చోళచక్రవర్తి రెండవ రాజాధిరాజు రాజ్యమునకు గడగిన యేడగుట చేతను, అతనివలెనే ఇతనికిని చోళసామ్రాజ్యపదచిహ్నమగు త్రిభువనచక్రవర్తి యను బిరు దుండుటచేతను వీరిరువురు నొక్కరేకాని భిన్నవ్యక్తులు కారని నిశ్చయమగుచున్నది.

అట్లగునేని ఈ రెండవ రాజాధిరాజు శాసనములు మొదటి ౧౬ యేండ్లవఱకును ద్రావిడదేశమునందే కానవచ్చుటకును, దరువాతివి యొక్కటికూడ ద్రావిడ దేశమునగాక తీరాంధ్రదేశముననే కానవచ్చుటకును గారణము నారయవలసియున్నది. ఇతని తరువాత చోళసామ్రాజ్యము నేలిన ముమ్మడికులోత్తుంగ చోళచక్రవర్తికి, నితనికి బాంధవ్య మెద్దియేనియు గలదో తెలియదు. అతడు చోళవంశీకుడగు సంగమరాజపుత్రుడు. క్రీ. శ. ౧౧౭౮ కి ముం దతనిగురించి మనకేమియు దెలియదు. మఱియు నీ ముమ్మడి కులోత్తుంగ చక్రవర్తి రెండవ రాజాధిరాజు వెంగియం దధికారము సేయుచుండిన కాలమున నాదేశముపై నెత్తివచ్చియుండుటచేత వారి కొండొరులయెడ వైషమ్యము గలదని యూహింపవలసియున్నది. ఈ రెండు విషయములను మనస్సునం దుంచుకొని యోచించి చూడగా నేకారణముచేతనో ముమ్మడి కులోత్తుంగుడు రెండవ రాజాధిరాజుపై దిరుగబడి యతని నోడించి ద్రావిడదేశమునుండి వెడలనడచి చోళసింహాసనము నాక్రమించుకొనెననియు రాజ్యభ్రష్టుడైన రాజాధిరాజు వెంగిదేశమునకు వచ్చి యచ్చట సామంతుల నాశ్రయించి క్రీ. శ. ౧౨౧౫ వఱకును నచట కాలము గడపుచుండెననియు దోచుచున్నది.

వేంగిదేశమునకు రాజాధిరాజు రాకకు సంతసించి యతనికి నమ్రులైన సామంతులలో నగ్రగణ్యుడు వెలనాటి పృథ్వీపతి. ఈ యంశ మీక్రింది ద్రాక్షారామ శాసనమువల్ల దెల్లమగుచున్నది.

32-b. Colas. II. Part I. pp -94.

32-c. 134 of 1930.

32-d. Colas. II. Part I. P. 115.

౧.

౨. వనచక్రవర్త్తిగళ్ శ్రీ రాజాధిరాజదేవర విజయరాజ్య.

౩. సంవత్స[ర*]ంబులు ౩౧ గు శ్రాహి
మమున

౪. శ్రీ భీమేశ్వర మహాదేవరకు అక్షయ త్రితియ్యనాండువె

౫. [ల] నాణ్టికులోత్తుంగ ప్రిధివీశ్వరదేవ మహారాజు

౬. లతలాఱి ముప్పప్రమాణి నాయకుకొడుక్క తెలాఱపలి నాయ

౭. కుండు..................పెట్టి

౮. న అఖం[డ]వర్త్తిగళ్లో [హ*] దండు [ది*] వి ౧ ణ్టి [S. I. I. IV. No. 1100.]

ఇందుదాహరింపబడిన రాజాధిరాజు ౩౧-వ రాజ్యవర్షము క్రీ. శ. ౧౧౯౬న కు సరిపోవుచున్నది. ఈ శాసనలేఖకుడగు సూరాచార్యుడే క్రీ. శ. ౧౨౦౩ నాటి మఱియొక శాసనమునుగూడ ద్రాక్షారామముననే లిఖించి యుండుటచేత (S. I. I. No. 1125) పై చెప్పిన శాసనకాలము సరియైనదని నిశ్చయమగు చున్నది.

రాజ్యభ్రష్టుడై వచ్చిన రెండవ రాజాధిరాజును ఇంకను చోళచక్రవర్తి యని యంగీకరించి తన సామంతపదమును సూచించుట కాతని రాజ్యవర్షము నుదాహరించి శాసనములను పృథ్వీశ్వరుడు దన భృత్యులచే వేయించినందుకు గారణము లేకపోలేదు. ఛిన్నమై పోయిన వెలనాటిరాజ్యమును బునరుద్ధారణసేయుటకు సమకట్టి రాజాధిరాజు మరుగున దన కార్యమును సులభముగ సాధించవచ్చునని నమ్మి తా నాతని సామంతుడ నని ప్రకటించుకొని తీరాంధ్రదేశమును జయించుటకు ప్రయత్నపడెను.

ముమ్మడి కులోత్తుంగచోళుడు రెండవరాజాధిరాజును దఱుమగొట్టి సామ్రాజ్యపీఠము నధిష్ఠించిన పిమ్మట తీరాంధ్రదేశమును తన యేలుబడిక్రిందికి దెచ్చుకొననిశ్చయించి సమయమనుకూలమైనపుడెల్లదండువెడల నారంభించెను. ఇందు మొదటిదండయాత్ర క్రీ.శ.౧౧౯౬ ప్రాంతమున నడచినట్లు శాసనములవల్ల దెలియవచ్చుచున్నది. ఇతడు తన ౧౯-వ రాజ్యవర్షమున (క్రీ. శ. ౧౧౯౭) శ్రీరంగమున వేయించిన శిలాశాసనమునం"దసమానసత్వ సంపన్నములైన ఏనుగుల నంపి కలితనము నెఱపి యుత్తరదిశయందలి మన్నియలనఢఃకరించి, తన కోపము శాంతించినపిమ్మట కచ్చిని ప్రవేశించి యచటి మన్నియలచే గప్పము గొంటి"నని చెప్పియున్నాడు. 33 ఈశాసనమున చేర్కొనబడిన కచ్చి కాంచీపురము; ఇతనిచే నోడి కప్పము సమర్పించిన ఉత్తరాదిమన్నియలలో ముఖ్యమైనవారు నెల్లూరు తెలుగుచోడరాజులు. పాశ్చాత్యచాళుక్యచక్రవర్తి యాఱవ విక్రమాదిత్యుడు తీరాంధ్రభూమి నాక్రమించినప్పటినుండి యుగంచియు, దానికి జెందిన ద్రవిడరాజ్యమును వీరి యధీనమున నుండినవి. కావున ముమ్మడి కులోత్తుంగ చక్రవర్తి కంచిని ప్రవేశించుటకు ముందు అతడు జయించిన యుత్తరాది మన్నియలు నెల్లూరు తెనుగుచోళులును, వారికి బ్రాపువచ్చిన మన్నెవారును నై యుండవలయును. ముమ్మడి కులోత్తుంగుని కంచివిజయము ప్రప్రథమమున నతని ౧౯-వ రాజ్యవర్షమునకు సరియైన క్రీ. శ. ౧౧౯౭-వ సంవత్సరము నాటి శ్రీరంగశాసనమునందే చెప్పబడియున్నను నంతకంటె గొంతకాలమునకు మునుపే యది చేకూడినట్లు సూచనలగపడుచున్నవి. క్రీ. శ. ౧౧౯౦ నాటి నెల్లూరుమండల శాసనములం దొకదానియందు మధురాంతక పొత్తపి చోళసిద్ధిరాజు, అనగా చోడతిక్కరాజు తండ్రి మూడవ కులోత్తుంగుని యాధిపత్య మంగీకరించి శ. ౧౧౧౨ నకు సరియైన యతని ౧౨-వ రాజ్యవర్షమున (క్రీ.శ.౧౧౯౦) నొక దానముజేసి శాసనము వేయించియున్నాడు. 34

33. S I I. III No. 88.

34. నెల్లూరు మండలశాసనములు. నెల్లూరు నెం. ౪౦ ద.

క్రాంతమిం చుమిం చుగ నీకాలమునకు జెందిన మఱియొక శాసనములో నెల్లూరు ఇమ్మడినల్లసిద్ధిరాజు ముమ్మడి కులోత్తుంగుని క్రింద తాను మండలీకుడనని చెప్పుకొని యున్నాడు. 35 ఇందు శాసనకాలమును దెలుపు భాగము కొంత మాసిపోయి 'పదావదు' అను మాట మాత్రము నిలిచియున్నది. ఆచార్య శ్రీ కె. ఎ. నీలకంఠ శాస్త్రిలవారు దీనిని '[ఒం] పదావదు'అనగా'తొమ్మిద వది' అని పూర్తిచేసి క్రీ. శ. ౧౧౮౭ నాటిదని చెప్పి నారు. 36 దీనిని పత్తొంపదావదు, లేక ఇప్పత్తొం పదావదు అనియేని పూర్తిచేయవచ్చును. కాని ముమ్మడికులోత్తుంగుని పండ్రెండవ రాజ్యవర్షమునాటి మధురాంతక పొత్తపిచోళసిద్ధిరాజు శాసనమును బట్టి చూడగా శ్రీ నీలకంఠశాస్త్రిగా రన్నట్లు "[తొం] పదావదు" అని చదువుటయే యుక్తమని తోచు చున్నది. ఈశాసనకాలము వాస్తవముగ ముమ్మడి కులోత్తుంగుని తొమ్మిదవ రాజ్యవర్షమే (క్రీ. శ. ౧౧౮౭) యైనచో నతని కంచివిజయమంతకుపూర్వమే జరిగియుండవలయును; నెల్లూరు తెనుగు చోళులుగూడ నప్పటినుండియే యతనికిసామంతులై యుండవలయును.

ముమ్మడి కులోత్తుంగుని యాంధ్రదేశ ప్రథమ దండయాత్ర ఉత్తర మెంతదూరము వ్యాపించెనో నిశ్చ యించి చెప్పుటకు దగిన సామగ్రి చాలదు. తీరాంధ్ర ము నప్పుడు కులోత్తుంగు నెదిర్చి యాపగల రాజెవ్వ డును లేడు. వెలనాటి రాజ్యవిప్లవకారణమున నాంధ్ర రాజకీయ వాతావరణ మంతయు సంక్షుభితమై యుండెను; మఱియు రాజ్యభ్రష్టుడైన రెండవ రాజాధి రాజు వెంగియందు తలదాచుకొని యచట దన యధి కారమును నెలకొల్ప ప్రయత్నములు సల్పుచుండెను. కావున ముమ్మడికులోత్తుంగు డొకవేళ వెలనాటి రాజ్యమును నిరాటంకముగ బ్రవేశించియుండిన నుండ వచ్చును. ఇతని దండయాత్రకాలమును, గాకతిరుద్రుని కడపటి ద్రాక్షారామ శాసనకాలమును సరిపోవుచుండు టచే నొక వేళ ముమ్మడికులోత్తుంగుడు వెంగిపర్యం తము బోయి కాకతిరుద్రు నచటినుండి తఱిమెనేమో యను నూహ కలుగుచున్నది. కాని నిజమైన చరిత్ర భావిపరిశోధనమూలమున తెలియవలయును.

వెలనాటి రెండవ కులోత్తుంగరాజేంద్రచోళుని మరణముతో వెలనాటివారి ప్రభుత్వము సంపూర్ణముగ తుదిముట్టలేదు. క్రీ. శ. ౧౧౮౦,౧౧౮౬ ల మధ్య వీరిని గూర్చి యేమియు దెలియరాకపోయినను తదనంతరము పై రెండవ కులోత్తుంగరాజేంద్రచోడని మనుమడైన పృథ్వీశ్వరుడు గోదావరికి దూర్పున నుండు దేశమును బాలించనారంభించె నని ఇంతకుపూర్వము చెప్పి యున్నాను. ఇతని కాలమున నడచిన చరిత్రాంశము లనుగూర్చి విస్పష్టముగ నేమియు దెలియదు. లభ్య మైన సామగ్రి కూడ పరిశోధన నెదురుచూచు చున్నది. పృథ్వీశ్వరుడు క్రీ. శ. ౧౨౦౧ వఱకును రాజ్యముచేసినట్లు సర్కారు శాసనపరిశోధకశాఖవా రభిప్రాయపడియున్నారు. 37 ఇది సరియని తోచదు. శకాబ్దము ౧౧౨౯, అనగా క్రీ. శ. ౧౨౦౬-౭ వఱకు నితడు రాజ్యముసేయుచుండినట్లు శ్రీకూర్మములోని యొకశాసనమువల్ల దెలియవచ్చుచున్నది. 38 తరువాత అతని శాసనము లెవ్వియు గానరాకపోవుటచే క్రీ. శ. ౧౨౦౬-౭-వ సంవత్సరమే యతని కడపటి రాజ్య వర్షమని చెప్పవలసియున్నది. రాజ్యారంభదశయం దితడు పశ్చిమమున వెంగివెలనాడులందు నష్టమై పోయిన రాష్ట్రమునకు బ్రత్యామ్నాయముగ దూర్పున కళింగమున నూతనరాజ్యసంపాదనకు గడగినట్లున్నది. పృథ్వీశ్వరుని మంత్రియు, రాజ్యభారధురంధరుడును, రాజ్య సముద్ధరణుడును నైన కొఱవి పెన్నయా మాత్యుడు వీరఘోట్టవిభాళు డనియు, గళింగదేశ నిర్ధూ మధాము డనియు నితని మనుమడగు గోపరాజు తెలియ జేయుచున్నాడు.

35. డిటో నెం ౧౨౮ రు.

36. చోళులు, సం. ౨ పుట ౧౩౭.

37. ARE. 1936-37 Part II pp 64-5.

38. SII v. No 1254.

" కలువమండలికభేకఫణీంద్రుడన రాయ
  గజగంధవారణఖ్యాతి మెఱసి
వీరఘోట్టవిభాళు డారూఢబిరుదవి
  రోధికళింగనిరోధి యనగ
వెలసి నానాటికి వెలనాటి పృథ్వీశ్వ
  రుని రాజ్యభారధుర్యుం డనంగ
నాలెలు గన్నడీ లఱవలు దెలుగులు
  దన బిరుదందియదగిలి కొలువ
నెగడె సనదవోలు నెలవుగా భూసుర
వంశసాగరామృతాంశుమూర్తి
చక్రవర్తిమాన్యసౌజన్యధన్యుండు
విక్రమార్కనిభుడు వెన్నవిభుడు." 39.

ఈవిషయమునే ఆశ్వాసాంతగద్యలయందు —

"రాయగజగంధవారణ, వైరిమండలిక భేక ఫణీంద్ర, వీరఘోట్టవిభాళాదిబిరుద...కళింగదేశనిర్ధూమధామ ......కర్ణాటద్రవిళాంధ్రమహారాష్ట్రభూపాల రూపనూపుర సుందరచరణారవింద, సనదవోలి పురవరాధీశ్వర వెలనాటిపృథ్వీశ్వరరాజ్య సముద్ధరణ" ఇత్యాది వాక్యములును దెల్పుచున్నవి. ఇందు ముఖ్యముగ పరామర్శించదగినవి మూడు: (౧)కళింగనిర్ధూమధామ; (౨) వీరఘోట్టవిభాళ; (౩) సనదవోలి పురవరాధీశ్వర వెలనాటి పృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ.

(౧) 'కళింగదేశ నిర్ధూమధామ' యనగా కళింగదేశమును నిర్జనముగ జేసినవాడని యర్థము. నిర్ధూమధామ మనగా పొగలేని యిల్లు. ధూమము పచనాదికృత్యములను సూచించును. కావున, ధూమరహితమైన గృహమున పచనకృత్యము లుండవు; పచనాదికృత్యములు లేని ఇండ్లు అన్నాది ఆహారపదార్థములవల్ల జీవధారణ సేయు మనుజులకు నివాసయోగ్యములు గావు. కావున కళింగదేశము నతడు జననివాసమునకు యోగ్యమునుగాక చేసెనని విదితమగుచున్నది.

ఎట్లనగా నిరోధించుటచేత, అనగా నాశముసేయుట చేత నని సీసపాదము తెల్లముసేయుచున్నది.

(౨) 'వీరఘోట్టవిభాళ'— వీరఘోట్టమును జయించినవా డని యర్థము. వీరఘోట్టము కళింగదేశాంతర్గతమైన యొక దుర్గము. దీని నునికిపట్టుచేసికొని యాకాలమున తత్పరిసరప్రదేశమును పల్లవ వంశీకులైన క్షత్రియు లేలుచుండిరి. వెలనాటి పృథ్వీశ్వరుని పక్షమున నతని యమాత్యుడగు కొఱవివెన్నయ దండు వెడలి వీరఘోట్టప్రభువుల నోడించి యాకోటను స్వాధీనపరచుకొనిన ట్లున్నది.

(౩) ఇంతవఱకు సుసంగతమే. గోదావరి మొదలు శ్రీకూర్మము వఱకును గల దేశమున పృథ్వీశ్వరుని శాసనములు గానవచ్చుచుండుటచేత కళింగముపై నతని యధికారము జెల్లెననియు, నాదేశము నతడు జయించియుండుననియు నొప్పదగిన విషయములే. కాని పై బేర్కొనబడిన మూడవ యంశమునకు శాసనాధారము గాని, సమకాలికవాఙ్మయాధారముగాని ఇంకను లభ్యపడలేదు. 'సనదప్రోలి పురవరాధీశ్వర' యను బిరుదువల్ల పృథ్వీశ్వరుడు దన పూర్వీకులను బోలి సనదప్రోలు రాజధానిగ ప్రజాపాలన మొనర్చినట్లు తెలియుచున్నది. కాని దీని కొక ప్రబలమైన యాక్షేపము గలదు. సనదప్రోలుపురవరాధీశ్వర యను నది తెలుగుచోళుల. యొరయూరిపురవరాధీశ్వర, రాష్ట్రకూటుల లట్టలూరు పురవరాధీశ్వర, పాశ్చాత్య గాంగుల తలకాడుపురవరాధీశ్వరులవలె కులక్రమాగతమైన బిరుదే. కావున తెలుగుచోళుల కొరయూరును, రాష్ట్రకూటులకు లట్టలూరును, పాశ్చాత్యగాంగులకు తలకాడును రాజధాను లనుట ఎంత సమంజసమో పృథ్వీశ్వరునికి సనదప్రోలు రాజధాని యనుటయు నంత సమంజసమే. ఈ యాక్షేపణ యొప్పుకొనదగినదే యైనను కొఱవి గోపరాజు తన తాతయైన వెన్నయామాత్యుడు "నెగడె సనదప్రోలు నెలవుగా" నని చెప్పియుండుటచే నతే డచట నివసించుచుండెననియు, దత్కారణమున నతడు గొలుచుచుండిన ప్రభువగు వెలనాటి పృథ్వీశ్వరుని యునికిపట్టు గూడ

---

39. సింహాసనద్వాత్రింశిక, ౧ : ౪౨.

## కాకతిగణపతిదేవుడు - కులోత్తుంగ రాజేంద్రచోళుడు

సనదప్రోలే స్థానముండవలయు ననియు చెప్పవలసి వచ్చుచున్నది. పృథ్వీశ్వరునికి సనదప్రోలు రాజధాని యగుట వాస్తవమైనచో నతడు వెంగివెలనాడులపై దన యధికారమును మరల స్థాపించి యుండవలయును. అట్లని తెల్పు సాధనము లన్యత్ర యెచ్చియు గానరావు. కాని ఈ సట్టున స్మరించదగిన శాసనము క్రీ. శ. ౧౨౧౩ నాటిది నెల్లూరుమండలములోని వెంకటగిరి సంస్థానమునందలి నిందలి యనుగ్రామమునకు దూర్పున నందిరాతిపై గలదు. ఇందు అచళనాథదేవమహారాజును, ప్రతిమల్ల బాచయదేవచోడమహారాజును ద్రాక్షారామభీమేశ్వరునకు సిద్ధపరగ్రామమును సర్వమాన్యముగ దానముచేసిన ట్లున్నది. శాసనగ్రంథమున ముఖ్యముగ గమనించదగిన వీక్రిందియచళనాథదేవమహారాజు బిరుదులు: "రాజమహేంద్రవీర చాళుక్యచంద్ర ప్రతిపక్షమండలికభయప్రాణభీకర, త్రివిక్రమచక్రవర్తి కులలలామ, సపాదలక్షగణిక గ్రామవెంగివిషయాధీశ, యశోవిత (?) ద్రవిడమండలిక పల్లకిపల్లవ(?) మదగజేంద్ర, విష్ణువర్థన, విష్ణుసింహాసన" ఇత్యాది. 40 ఈ బిరుదులనుబట్టి చూడగా అచళనాథదేవమహారాజు నెల్లూరుప్రాంతములవాడు కాడనియు, వెంగినుండి రాజ్యసంపాదనార్థమై యెత్తివచ్చిన విజిగీషు వనియు దోచుచున్నది. దానప్రతిగృహీత ద్రాక్షారామభీమేశ్వరు డగుటకూడ నీయూహను బలపఱచుచున్నది. కాని

ఈశాసన కాలమునం దన్యదేశములపై దిగ్విజయార్థము వెడలగలశక్తిసామర్థ్యములుగల చాళుక్యరాజెవ్వడును వెంగిరాజ్యమునందు గానరాడు. పైనూహించిన ట్లీయచళనాథదేవరాజు విజిగీషువై యెత్తివచ్చుట వాస్తవమేని అతడు స్వయముగ రాక తనకంటె బలవత్తరుడైన మఱియొక రాజు ననుసరించివచ్చియుండవలయును. అప్పుడు అంతటి బలము గలవాడు వెంగిని పాలించుచుండిన రాజు వెలనాటి పృథ్వీశ్వరుడే. కావున నత డొకవేళ వెంగివెలనాడులను జయించినపిమ్మట ద్రావిడదేశపర్యంతము దండయాత్ర జరిగించెనా యేమి యను సంశయము పొడముచున్నది.

ఇందలి సత్యాసత్యము లెట్లున్నను పృథ్వీశుడు దాక్షిణాత్యరాజులతోడి యుద్ధమున నిహతు డాయెనని నిశ్చయముగ జెప్పవచ్చును. నెల్లూరుచోడతిక్కరాజుపరాక్రమమును బ్రశంసించుచు దిక్కనామాత్యు డిట్లు వ్రాసియున్నాడు:

"కేశవసన్నిభుండు పరిగీతయశోనిధి చోళతిక్కధాత్రీశుడు కేవలుండె? నృపు లెవ్వరి కా చరితంబు గల్గునే? శైశవలీలనాడె పటుశౌర్యధురంధరబాహుడైన పృథ్వీశనరేంద్రు మస్తకము నేడ్తెర గందుకకేళి సల్పడే." 41

ఈయంశమునే కేతనయు "బలిమిచే బృథ్వీశుతల ద్రుంచె" నని ప్రస్తావించియున్నాడు. 42 తిక్కనయు, కేతనయు బృథ్వీశునికి వెనుకటి తరమువారు; వారి సాక్ష్యము ననుసరించి పృథ్వీశుడు తిక్కరాజుచే నిహతు డాయెనని నిశ్చయముగ జెప్పవచ్చును. నెల్లూరు తెలుగుచోళుల చరిత్ర నెఱిగినవారి కిది చిరపరిచితమైన విషయమే. కాని తిక్కరా జెప్పుడెక్కడ నేసందర్భమున పృథ్వీశ్వరుని వధించెనో కనుగొనుట కెవ్వరును బ్రయత్నము సల్పియుండలేదు. ఇది కరము విచారణీయమైన యంశము. మొదట పృథ్వీశ్వరుని నిధనకాలమును గనుగొందము. ఇతడు శకాబ్దము ౧౧౨౪, అనగా క్రీ. శ. ౧౨౦౨-౩ వఱకు రాజ్యము సేయుచుండినట్లు శ్రీకూర్మములోని యొక శాసనమువల్ల తెలియుచున్నదని ఇంతకుముందు

---

40. **Mackenzie** Mss. **15-4-2 p 91.** ఇది బట్టర్ వర్త్ వేణుగోపాలుసెట్టిగారలచే బ్రకటింపబడిన నెల్లూరుమండల శాసనసంపుటములలో చేరలేదు. ఇట్టివి పెక్కు కలవు. నెల్లూరుజిల్లాను సర్కారుశాసనపరిశోధకశాఖవారు బట్టర్ వర్త్ వేణుగోపాలసెట్టిగారలొక్క శాసనములైన విడువక ప్రకటించినారని భ్రమజెంది యుపేక్షించియున్నారు. ఈ జిల్లాను ఇతరజిల్లాలవలె పరిశోధించి చూచిన పెక్కు నూతనశాసనములు బయలుపడగలవు.

41. నిర్వ. ౧: ౯౩

42. దశ. ౧: ౧౬

వివరించియున్నాను.[43] అటుతరువాత నతని శాసనము లెవ్వియు గానరాకపోవుటచే నదియే యతని కడపటిరాజ్యవర్ష మనియును, నిర్వచనోత్తరరామాయణమునందును దశకుమార చరిత్రయందును జెప్పినట్లు నెల్లూరు చోడతిక్కరా జతని వధించిన దప్పుడే యనియు మన మనుకొనవచ్చును. ఇక నత డెచట నేసందర్భమున నిహతు డాయెనో పరికింతము. ఈ పట్టున స్మరింపదగినది చోళచక్రవర్తి ముమ్మడి కులోత్తుంగుని ౨౬-వ రాజ్యవర్ష మునకు సరియైన క్రీ.శ. ౧౨౦౪-వ సంవత్సరము నాటిశాసన మొకటి పుదుక్కోట సంస్థానమునకు జెందిన ఇడైయాత్తూరు గ్రామమునందు కలదు.[44] ఇం దితడు రణభయంకరు లైన వడుగులను (అనగా తెలుగువారిని) జయించి వెంగిమండలమును దన యధికారము క్రిందికి దెచ్చుకొని స్వర్ణవర్షమును బ్రసాదించుచు స్వర్ణమయమైన ఉరంగై పట్టణమును ప్రవేశించె నని చెప్పియున్నది. ఈశాసనమున బేర్కొనబడిన ఉరంగై పట్టణము కాకతీయులకు రాజధానియైన వోరుంగల్లని శ్రీ నీలకంఠశాస్త్రిగా రభిప్రాయపడియున్నారు.[45] ఇదిసరియాని వోరుగంటికోటలోని స్వయంభూనాథుని గుడియందలి ముమ్మడికులోత్తుంగచక్రవర్తి యొక్క యరవశాసన మొకటి రుజువుచేయుచున్నది.[46] ఇచట ముఖ్యముగ గమనించవలసిన విషయము ముమ్మడికులోత్తుంగ చక్రవర్తియొక్క దండయాత్రా కాలము. ఇది పృథ్వీశ్వరుని రాజ్యాంతకాలముతో సరిపోవుచున్నది. రెండును క్రీ. శ. ౧౨౦౪-వ సంవత్సరముననే నడచినవి. ఈ కాలసంయోగము కేవలము కాకతాళీయ మని యెంచరాదు. నెల్లూరు తెలుగు చోడరాజులు ముమ్మడికులోత్తుంగ చక్రవర్తికి సామంతు లగుటచేతను, నెల్లూరు చోడతిక్కరాజు వెలనాటి పృథ్వీశ్వరుని యుద్ధమున జంపినట్లు తెలియుచుండుటచేతను, వెలనాటి పృథ్వీశ్వరుని రాజ్యాంతిమవర్షము నందే ముమ్మడికులోత్తుంగచక్రవర్తి వెంగిపై నెత్తివచ్చి దాని జయించుటచేతను, వీనికి గార్యకారణ సంబంధము గల దని తలచుచున్నాను.

ఈ దండయాత్రాచరిత్ర విపులముగ దెలియదు. ఇడైయాత్తూరు శాసనమువల్ల మూడు విషయములు విశదమగుచున్నవి : (౧) వడుగులపై విజయము; (౨) వెంగి ఆక్రమణము; (౩) ఒరంగల్లు ప్రవేశము. మఱియు నిర్వచనోత్తరదశకుమార చరిత్రలయందు వర్ణింపబడిన పృథ్వీశ్వరుని వధయు నీదండయాత్రా సందర్భముననే నడచె నని తోచుచున్నది.

(౧) వడుగు లనగా తెలుగువారని పైన జెప్పియున్నాను. ఇది యాంధ్రుల కెల్ల నన్వయించెడి సామాన్యపదమగుటచే ముమ్మడికులోత్తుంగ చోళచక్రవర్తియొక్క ప్రతిపక్షులు వీరని నిర్ధారించి చెప్పుటకు వీలులేదు; కాని వారినానవాలుపట్టుట కవకాశము గలదు; పాకనాటిపాలకులగు నెల్లూరి తెలుగుచోళులతనికి సామంతులైయుండుటచే వా రతని ప్రత్యర్థులై యుండజాలరు; వెంగిని జయించినాడనియు, వోరుగంటిని ప్రవేశించినాడనియు నిడైయాత్తూరు శాసనము నందుండుటచేత నాదేశముల రాజులే యతనిచే జయింపబడిన వడుగులైయుందురని తోచుచున్నది.

(౨) వెంగిదేశమునప్పు డెవ్వరేలుచుండిరో నిశ్చయముగ తెలియదు. శాసనములవలన ఈవిషయము స్పష్టముగ దెలియవచ్చుట లేదు. బెజవాడ పరిసర దేశమును క్రీ. శ. ౧౨౦౦ సం. ప్రాంతమున నతవాడి రుద్రు డేలుచుండెను. ఇతడు కాకతీయగణపతి దేవునికి బావమరది.[46a] కొలను ప్రాంతమును క్రీ. శ. ౧౧౯౬ మొదలు ౧౨౧౨ వఱకును మన్నియదేవేంద్రుడగు మండలిక కేశవదేవరాజు పాలించుచుండెను.[47]

---

43. SII v No 1254.

44. పుదుక్కోట శాసనములు నెం ౧౬౧.

45. చోళులు, సం. ౨ పుట ౧౩౩.

46. ఈ శాసనప్రతిబింబమును హైదరాబాదు శాసనపరిశోధకశాఖవారు తీయించినా రని వినికిడి. కాని ఇంక నెచ్చటను అది ప్రకటితముగాలేదు.

46a. E. I. VI P. 159.

47. S. I. I. v. Nos. 175, 181.

వెంగి వేయింటిని వంగి మహాదేవరాజు తండ్రి అయ్యపరాజు పాలించుచుండెను. 48 అయ్యవంశజులు దివిప్రాంతము నేలుచుండిరి. 49 గోదావరి తీరతటమునందు ప్రోలునాటిపై పూర్వ చాళుక్యవంశములోని పిఠాపురశాఖకు జెందిన విష్ణువర్ధనుడును, మల్లప విష్ణువర్ధనుడును రాజ్యముసేయుచుండిరి. 50 వీరందఱును ఎవరంతట వారు స్వతంత్రులై రాజ్యమొనర్చుచుండిరో, లేక యొక యధిరాజునాధిపత్యమునకు లొంగియుండిరో చెప్పుటకు సాధ్యముగాదు. కాని వెలనాటి పృథ్వీశ్వరుడు వనవప్రోలు రాజధానిగ రాజ్యమొనర్చినట్లును, వతని మంత్రియగు కొఱవి సన్నయ "కర్ణాటద్రవిడాంధ్ర మహారాష్ట్ర భూపాల నూపురసుందర చరణారవిందు" డైనట్లును కొఱవి గోపరాజు చెప్పియుండుట చేత పైజెప్పినట్లు పృథ్వీశ్వరుడు చరమదశయందు వెంగివెలనాడులపై దన యాధిపత్యమును నెలకొల్పియుండవచ్చు ననుట కేవల మసంగతము గాదు. మఱియు పృథ్వీశ్వరుడు ముమ్మడి కులోత్తుంగచక్రవర్తికి ప్రతిపక్షీయగు రెండవ రాజాధిరాజునకు హితసామంతుడగుటచే వారికి వైరము గలుగుట సహజము. ఈ యభిప్రాయము సరియైనదేని, ముమ్మడికులోత్తుంగచక్రవర్తిచే వెంగియందు నిర్జించబడిన శత్రువు పృథ్వీశ్వరుడు కావలయును. అగునేని చోడతిక్కరాజుచే నతడసువుల గోల్పోయిన దీసందర్భమునవేయని చెప్పవలసివచ్చును.

(3) ఓరుగల్లు కాకతీయుల రాజధాని. క్రీ. శ. ౧౧౯౬ వఱకును గాకతిరుద్రుడు మిగుల వైభవముతో నిచట రాజ్యమొనర్చెను; అతని యనంతర మతని తమ్ముడు మహాదేవరాజు రాజ్యాభిషిక్తుడై మూడేండ్లు ప్రభుత్వము సల్పి సేవుణులతో యుద్ధమున మడిసెను. అతని పుత్రుడు గణపతి శత్రులచే జిక్కి కారాగార నిబద్ధు డాయెను. కాకతీయులపై సేవుణుల విజయ మాద్యము శకాబ్దము ౧౧౨౮ కి సరియైన క్రీ. శ. ౧౨౦౬-౭ నాటి యొకశాసనమున ప్రస్తాపింపబడియున్నది. 51 ఇందు గణపతిమాట లేదు; కాని క్రీ. శ. ౧౨౨౨ నాటి మఱియొక శాసనమునందు సేవుణరాజగు మొదటి జైత్రపాలుడు గణపతిని కారాగారమునుండి విముక్తునిగావించి యతని రాజ్యము నతనికొసగెనని చెప్పియున్నది.52 ఈవిషయములు తరువాతి శాసనముల యందును గానవచ్చెడిని. గణపతిదేవుడు క్రీ. శ. ౧౧౯౯ లో రాజ్యము సేయ నారంభించినట్లు అతని శాసనముల వల్ల దెలియవచ్చుచున్నను క్రీ. శ. ౧౧౯౯, ౧౨౦౯ లమధ్య నతని శాసన మొక్కటియేనియు లేకపోవుట చూడగా సేవుణశాసనములచే సూచింపబడిన ట్లతడు కారాగారబద్ధుడైయుండినట్లు తోచుచున్నది. దీని కనుగుణముగ క్రీ. శ. ౧౨౧౩-వ సంవత్సరమునాటి పాలంపేటశిలాశాసనమున కాకతిరుద్రుని మరణానంతరము కాకతీయరాజ్యస్థితి యిటు వర్ణింపబడియున్నది:

"శ్రీమద్రుద్రనరాధిపే రిపుమహీపాలాద్రివజ్రే దివం
యాతే కాకతినాథభోగ్యవిలసత్పృథ్వీకరాకర్షణే
సంభ్రాంతాః సమ ముద్ధతాః సరభసం వైరిక్షమాపాలకా
యే[ - - ◡ ర]ణాంగణేషు విజితా విఖ్యాంత[?
వి క్రాం]తినా॥

ఉద్దండమండలికతోంగశిరోవఖండ్య
తుంగధ్వజాగ్రనిహితం ప్రకటం స్వభర్తుః
పుర్యాం న్యవేశయ దశేషసమృద్ధిసస్య
క్షేత్రేఽరిభూపతిమృగవ్రజభీతయే యః॥
యత్సేనా ధ్వజదండాగ్రపతాకాభిః ప్రతర్జితః
ద్రుతం నాగతిభూపాలః పలాయనపరోఽభవత్॥
శూరః స్వామిహితః సునిశ్చితమతి ర్యః కాకతీశ శ్రియా
పాదేభూరిషుకంటకేషు నిహితేతీక్ష్ణేషు మోహాత్ క్షణం

48. S. I. I. V No. 203 VI No. 96.
49. E. I. III P. 88.
50. Sewell Hist. Ins. P. 128.
51. E. I. p. 338.
52. EI, iii. P. 110, IA Xiv. P. 316. xxi P. 198.

త్రైవిద్యే వ్యథితే చ తాక్ష భుజబలాం దుష్కృత్య పిష్ట్వా హఠాత్
తామస్థాపయ దవ్యథాం స్థిరతరం శేచర్ల రుద్ర స్స్వయం॥" 53

ఇందువల్ల కాకతీయరాజ్యము రుద్రుని మరణానంతరము శత్రువుల యాటోపమువల్ల సంక్షుభితమాయెనని తెల్లమగుచున్నది. వీరిలో గాకతిరాజునకు వశంవదులై కప్పముగట్టుచుండిన మాండలికులు కొందఱు; వారికి బ్రాపుగ నెత్తివచ్చిన పరరాజన్యులు మఱికొందఱు. ఈరెండవతరగతికి జెందినవారిలో బ్రముఖుడు నాగతిభూపాలుడు. ఇతని యాటపట్టును, ఆనవాలును గనుగొన నిందెవ్వియు సాధనములు గానరావు. "నాగతి"యను పేరును జూడగా నీతడు కర్ణాటకుడని తోచుచున్నది. ఆకాలమున హానగల్లునందు కదంబవంశజుడగు 'నాగతి'యను రాజపుత్రుడొకడుండినట్లు తెలియుచున్నది. 54 వీరిరువురును నొక్కరేయని తలచినచో కాకతీయరాజ్యముపై కదంబులుగూడ నెత్తివచ్చిరని చెప్పవలసియున్నది. కాకతిరాజ్య మిట్టి యరాజకస్థితియం దుండుటచేతనే, వెంగిని జయించిన పిమ్మట ముమ్మడికులోత్తుంగచక్రవర్తి నిరాటంకముగ దండయాత్రసాగించి రాజధాని బ్రవేశింపగల్గెను.

ముమ్మడికులోత్తుంగ చోళచక్రవర్తియొక్క వడుగవిజయ మిటు జయావహముగ ముగిసెను; తలచిన కార్యమును గొనసాగించుకొని యతడును నిజరాజ్యమునకు దరలిపోయెను; కాని ఈ దండయాత్ర వల్ల నతనికి గలిగిన లాభమేమియును గానరాదు. చోళదండయాత్రమూలమున వెలనాటిరాజ్యము చిదిగిపోయెను. దేశమున కళవళ మతిశయించెను. చిన్న చిన్న సంస్థానాధిపతులు కొందఱు బ్రబలిరి. వీరియందు నెల్లూరు చోళులు ముఖ్యులు. చోళచక్రవర్తి బ్రసాదమున వీరికి యేఱువ గుంటూరు మున్నగు రాష్ట్రములు స్వాధీనపడెను. ఏఱువపై వీరి యధికారము సాగెననుటకు కేతన సాక్షి;54a గుంటూరు మండలము వీరి యేలుబడిక్రిందికి వచ్చెననుటకు తిక్కన సోమయాజి సాక్షి. తన పితామహుడగు మంత్రిభాస్కరుడు గుంటూరిని పాలించెనని,

"సారకవితాభిరాము గుంటూరి విభుని
మంత్రిభాస్కరు మత్పితామహునిదలచి" 55

అనియు, తన తండ్రి గుంటూరునకు దండనాథుడనియు జెప్పియున్నాడు.56

తిక్కన వంశమువారు నెల్లూరుతెలుగుచోళరాజులకు గులక్రమాగతులైన మంత్రులని కేతన చెప్పియున్నాడు. 57 అనగా నెల్లూరు తెలుగు చోళరాజులకు తిక్కనవంశమువారు తరతరములుగ మంత్రులై యుండిరనియు, నెల్లూరుతెనుగుచోళసంస్థానములోని మంత్రిపదవి వారి కొణయాచి యనియు దెలియవలసియున్నది. ఈ విషయము తిక్కనవంశీకుల నామధేయమువల్లగూడ విదితమగుచున్నది. భృత్యులు తమరాజుల యాజమాన్య చిహ్నముగ వారి నామములను దాము వహించుటయు, బిడ్డల కిడుటయు బ్రాచీన

---

53. Hyd. Arc. Series, no 3, p 4. vv 21-24.

54. Dynasties of Kanarese Districts. P. 564.

54a. దశ ౧: ౧౬.

55. నిర్వ ౧: ౧౩

56. భార. విరా. ౧: ౧౦.

"మజ్జనకుండు సన్మాన్య గౌతమగోత్ర
మహితుండు భాస్కరమంత్రితనయు
డన్నమాంబాపతి యనఘులు కేతన
మల్లనసిద్ధనామాత్యవరుల
కూరిమితమ్ముడు గుంటూరివిభుడు కొ
మ్మనదండనాథుండు."

57. దశ. ౧: ౨౦.

కాలమునుండియు వాడుకయం దుండిన యాచారము.[58] దీని ననుసరించి తిక్కనవంశమువారియం దనేకులు నెల్లూరు తెలుగు చోళరాజుల నామములను స్వీకరించిరి. సిద్ధన (దళ ౧-౩౪), నల్లసిద్ధి (౩౭, ౫౨) మనుమ సిద్ధి (౫౮), సిద్ధి సేనాపతి(౬౨), తిక్కన (౬౪)-ఈ పేరులు నెల్లూరు తెలుగు చోళవంశమునకును, తిక్కనవంశమునకును సామాన్యములు. ఇవి తిక్కనవంశమువారు నెల్లూరు తెలుగు చోళరాజులకు కులక్రమాగత భృత్యులని చాటుచున్నవి. కావున మంత్రిభాస్కరుడును, నాతనిపుత్రుడగు కొమ్మన దండనాథుడును గుంటూరును బాలించినారనగా వారు దమ ప్రభువుల పంపున నచట స్థానికపాలకులుగ నుండిరని గ్రహించవలయును. ఇందుకు దోడు నాగార్జునకొండ కెదుట కృష్ణ కవ్వలియొడ్డున నుండు ఏలేశ్వరమందు నెల్లూరు మనుమసిద్ధి రాజు శాసన మొకటికలదు. ఇతడు తిక్కరాజు తండ్రియగు మొదటి మనుమసిద్ధి. 59 ఇతనికే తిక్కనామాత్యుని పితామహుడగు భాస్కరుడు మంత్రి.

పై బేర్కొనబడిన విషయముల నన్నిటిని సమాలోచనము జేసి చూడగా నెల్లూరు తెలుగుచోళరాజులు చోళచక్రవర్తి యనుగ్రహమును బొంది తత్పూర్వము వెలనాటిరాజుల పాలనయం దుండిన గుంటూరి ప్రాంతదేశమును దమ యధికారముక్రిందికి దెచ్చుకొనిరని తోచుచున్నది. [సశేషము]

58. విక్ర. చ. ౪:౬౦. శకమహీశ్వరుని గొలిచిన సామంతులను వర్ణించుచు జక్కన ఇట్లు చెప్పియున్నాఁడు: 'ప్రియతనూజుల పేళ్లువెట్టి పెంపొందిరి మాళవనేపాళమగధపతులు'.

59. ఈ శాసన మింకను బ్రకటితము గాలేదు. మ. ఘ. వ. నైజాము సర్కారువారి శాసనపరిశోధకశాఖవారు దీని ప్రతిబింబమును దీయించియున్నారు.



ప్రకృతి సౌందర్యము

# నిశీథినీసతీ!



శ్రీ సుందరాచారి =

తారల తీరులో వెలుగు దారులకన్నను, చందమామలో
జారి స్రవించు వెన్నెలల చల్వలకన్నను—నల్లనైన నీ
జారుపయంటచీర తెరచాటులలో తలదాచుకొంటయే
సారతరం బటంచు మనసారగ నెంతు నిశీథినీసతీ!

తొలివల పాని, లోకులకు దూరముగా విడిపోయి, తిన్నగా
వెలుగులు చూడలేక విలపించెడు జంటకు ప్రాపు చూపగా
వలచిన జాలితో పిలిచి; వాకిలిమూసిన చీకటింటిలో
పలను సుఖింపజేయగల బంధువు నీవె నిశీథినీసతీ!

జేనెడు పొట్ట నింపుకొను చేతలలో పడిపోయి, తీరికే
కానగరాని పాటులకు గాసిలి చెమ్మట లూడ్చి పోసి నా
బోనములేక పస్తుపడిపోయిన జీవికి జోలపాడి, రే
పే నవజీవ మున్న దనిపింతువు నీవె నిశీథినీసతీ!

కడుపులుగొట్టి, కావలయు కల్మిని దోచి, పసిండిమేడలో
పడుచుపడంతికౌగిళుల పట్టులలో పవళించువారి యా
గడములు దీర్పగా పగటికాలముగాచిన చోరకోటికిన్
జడుపులు మాన్పి రక్షనిడు జాణవు నీవె నిశీథినీసతీ!

నెత్తురుచిమ్ము కత్తులును, నీతికి గోతులు త్రవ్వు కుట్రలున్
కుత్తుకగోయు యత్నములు, కోమటిమెత్తులు, కన్నెకానుపుల్
పెత్తనమంది నీ నలుపుపేటలబాటల కొల్వు దీరగా
వత్తు మటన్న నీ సహానభావ మదెంత నిశీథినీసతీ!



# జాతకముహూర్తముల పరస్పరసంబంధము



= శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు =

ఒకటే ముహూర్తమున ననేకవివాహములు జరుగుటయు, అట్టి దాంపత్యములలోఁగొన్ని సత్సంతానసుఖసౌభాగ్యములతో తులదూగుచు భూలోకమును స్వర్గతుల్యముగాఁ జేయుచుండుటయు, మఱికొన్ని వైవాహికజీవితమున నానావిధక్లేశములపాలయి ఇహలోకమందే నరకయాతన లనుభవించుచుండుటయు పాఠకమహాశయులకుక్రొత్తవిషయముగ నుండదు. అట్టి ముహూర్తములందలి గ్రహభావస్థితులు ఆవివాహము లన్నింటికిని సమానముగా నుండుకారణమున, ముహూర్తమందలి యోగముల ఫల మావివాహములకు సమానముగా నుండవలయు నని తలంచుట సామాన్యముగా తప్పనరాదు. కాని, అనుభవములో సమానఫలము కానరానందున ముహూర్తశాస్త్రసూత్రములకు వాస్తవముగ వెల యున్నదా యని పలువురు శంకించుట కవకాశ మున్నది. జ్యోతిషశాస్త్రముపైననే ధ్వజమెత్తువారి కిట్టి సందర్భములు మరింత సాహాయ్యకారి.

"అఘటితఘటితం ఘటయతి,
సుఘటితఘటితాని దుర్ఘటీకురుతే,
విధిరేవ తాని ఘటయతి,
యాని పుమాన్ నైవ చింతయతి."

అను యదృవిష్యసంప్రదాయము ననుసరించి "వారి వారి ప్రాప్తికి తగినట్లు వారు ఫలము ననుభవింతురు."అని చెప్పు సమాధానము ముహూర్తశాస్త్రమును పూర్వపక్షము చేయువారికి తృప్తికరమగు ప్రత్యుత్తరము కాఁజాలదు. ఇది సత్యమగునేని, ఇంత ముహూర్తశాస్త్ర మేల ?

"ప్రయోజన మనుద్దిశ్య న మందోపి ప్రవర్తతే."

అనుట మరచి దివ్యజ్ఞానసంపన్నులు, తపోధనులు నగు ప్రాచీనమహర్షులు శాస్త్రరచనకై తమ యమూల్యకాలమును వ్యర్థపరచుటేకాక, దాని వ్యాసంగమునకై మన కాలమునయితము వ్యర్థపరచుటచే వారికి వచ్చిన మోక్షమేమి ? జాతకశాస్త్రపు మాట యెట్లున్నను, ముహూర్తశాస్త్రమువిషయమునమాత్రము మన ప్రాచీనులు చేసినంత పరిశ్రమ, సాధించినంత ఫలము ఏ యితరఖండములవారు కాని చేయలేదు ; సాధించనులేదు. ప్రశంసావిషయమున మనకు కానవచ్చు లోపములు మౌహూర్తికశాస్త్రసూత్రములను మనము నిరాదరించుటవలన కలిగినవే యని, ఇంచుక విమర్శించినచో, మనకు సుబోధమగును.

ముహూర్తనిర్ణయసూత్రములను రెండు తెగలుగా విభజించవచ్చును:— (1) సామాన్యవిధులు, (2) విశేషవిధులు అని. తాత్కాలిక గ్రహభావసామగ్రికి చెందినవి సామాన్యవిధులు. వివాహకాలమున నెట్టి లగ్న ముండవలయునో, ఏయే గ్రహ మెందుండిన పురుషార్థములు సిద్ధించునో, ఏయే యోగములు దాంపత్యజీవితమున ప్రమాదద్యోతకములో, ఆయంశములనుగూర్చినవి సామాన్యవిధులు. పంచాంగశుద్ధి, గండాంతదోషములు, మౌఢ్యదోషము, గ్రహణాదులు, సప్తమశుద్ధి, సగ్రహచంద్రము, భృగుషట్కము ఇత్యాదు లీజాతికి చేరినవి. మన పంచాంగములలో వ్రాయఁబడు వివాహముహూర్తము లీసామాన్యవిధుల ననుసరించి నిర్ణయించఁబడినవే. ఇఁక, విశేషవిధులు వ్యక్తిజాతకములతో తాత్కాలికలగ్నగ్రహములకుఁగల శుభాశుభరూపసంబంధమును దెలుపునట్టివి. చంద్రతారాబలము, గోచారబలము, జన్మాష్టమలగ్నము, వైనాశికనక్షత్రము, అష్టమాధిపతిదోషము, దుష్టదశాకాలము మున్నగునవి యీ తెగకు సంబంధించినవి. ఇవి ఆయావధూవరుల జాతకములతో తాత్కాలికముహూర్తమును పోల్చి నిర్ణయింపఁదగిన వగుటచే, పంచాంగకర్తలకు సాధ్యమగునవి కావు. సామాన్యవిధులు క్షేత్రమువంటివి, విశేషవిధులు బీజరూపమయినవి. ఈరెండును చక్కఁగ నుండినఁగాని, ఉద్దిష్టార్థము నెరవేరుట సాధ్యముకాదు.

కాని, ఇప్పటి వాడుకలో సామాన్యవిధులకే దైవజ్ఞులు ప్రాధాన్యము నిచ్చుటయు, విశేషవిధులను త్రోసిరాజు చేయుటయు సంభవించుచున్నది. శాస్త్రదృష్టిలో నిది మిగుల శోచనీయ మగు స్థితి. చంద్రతారాబల మనునది యొక్కటి తప్ప వ్యక్తిసంబంధ మగు విశేషవిధులు సామాన్యముగ గమనింపఁబడుటయే లేదు. గ్రహస్ఫుట భావస్ఫుటములు చేయు వాడుక తప్పిపోవుటచే కలిగిన లోపములలో నిది నయిత మొక్కటి. పెండ్లిపెద్దలకు శాస్త్రముపైఁ గల యశ్రద్ధ మఱియొక గొప్ప కారణము. "ఈస్టరు సెలవులలో మా అబ్బాయికి విరామ ముండును. అప్పుడు లగ్నము పెట్టండి." అనియో, "క్రిస్‌మస్ రజాదినములలో నయినచో క్యాజుయలు లీవు అక్కర యుండదు. ఆ దినాలలోనే ముహూర్తము కావలయును." అనియో కోరునంతటి ముహూర్తశాస్త్రాభిమానము పెండ్లిపెద్దల కున్నప్పుడు కార్తాంతికు లేమి చేయఁగలరు? ఇదికాక, వధూవరుల జాతకములను స్పష్టపరచి, వానికి సరిపడునట్టి ముహూర్తమును సామాన్య విశేషవిధులతో నిర్ణయించు శ్రమకు దైవజ్ఞుఁడు పూనుకొనెనేని, ఇప్పటి కాలమున నతనికి రాఁగల బహుమతి అంద రెఱిఁగినదే. పెండ్లిపెద్దల కక్కర లేని, తమకు ప్రయోజనము లేని కార్యమునకై వృథా పరిశ్రమ చేయుట కెవ రంగీకరింతురు?

వస్తుస్థితిని విమర్శించితిమేని, వ్యక్తిజాతకములకు సంబంధించిన విశేషవిధులే ముఖ్యముగా గమనించఁదగిన వని సులభముగా మన కర్థము కాఁగలదు. ముహూర్తము వెలకలదే కావచ్చును. కాని, అది అపాత్రన్యస్తము కారాదు. వ్యస్తుల కుపయోగకారిగా నుండుట ముహూర్తపు ప్రధాన గుణము. ఆఁకటితో మలమల మాడుచున్న బిచ్చగానికి పట్టెఁ డన్నమో, పిడికెఁడు బియ్యమో పనికివచ్చినట్లు పచ్చలపతకము పనికిరాదు గదా? ఆ పతకమును కాపాడుకొనవలసిన బాధ్యత, దాని నమ్మఁజూపుటకై పడవలసిన శ్రమ, దొంగసొమ్మని సామాన్యముగా నూహించుటకు వీలుండుటచే కలుగు ప్రమాదము, వీనికి తోడుగా, బిచ్చమెత్తకపోవుటచే వచ్చు నన్నదారిద్ర్యము, ఇవి వాఁ డనుభవించక తప్పదు. ఇట్లని దానము చెడ్డదని కాని, పతకము దుష్టమని కాని చెప్పఁజాలము కదా! కాని అపాత్రదానము మాత్రము దోషముగనే పరిగణింపఁబడుచున్నది. అట్లే వ్యక్తి జాతకములతో సమన్వయపడని ముహూర్త మెంత మంచిదయినా, సత్ఫలము నీయఁజాలదు.

"త్వయి వర్షతి పర్జన్యే సర్వే పల్లవితా ద్రుమాః,
అస్మాక మర్కవృక్షాణాం పూర్వపత్రేషు సంశయః."

అను న్యాయము ముహూర్తముల విషయమునందు నయిత మన్వయించుచున్నది.

వృషభ లగ్న జాతకునికి బృహస్పతి అష్టమాధిపతి. మీనలగ్నమందు పుట్టినవారికి శుక్రుని కట్లే అష్టమాధిపత్యము వచ్చును. గురు శుక్రులు శుభగ్రహములు కాదని ఎవ రనఁగలరు? సామాన్యముగ వివాహకాలమున ఈ గ్రహముల కేంద్రస్థితి సర్వోత్తమము కదా? కాని, వృషభలగ్నపు కన్యకు మీనలగ్నపు వరునితో వివాహమగు సందర్భమున గురు శుక్రులను లగ్నమం దుంచి ముహూర్తమును సాధించి ఇచ్చి,

"ఉక్తానుక్తాశ్చ యే దోషా
స్తా న్నిహంతి బలీ గురుః
కేంద్రస్థిత స్సితోవాపి,
పన్నగా న్గరుడో యథా."

అను నారదవాక్యముపై నాధారపడవచ్చునా? సామాన్యవిధికంటె విశేషవిధి బలవత్తర మగుటచే, పై జాతకుల వివాహవిషయమున గురుశుక్రులు—సహజ శుభగ్రహము లయిన నేమి—కేంద్రస్థితికి పనికిరారు. పైతృక కర్మ చేయించు వాడుక గలవానిని పరిణయమునకు పురోహితుఁడుగా రమ్మని పిలుచుటకు పెద్దలు జంకుదురు. అట్టిచో, అష్టమ (మృత్యు) స్థానాధిపతిని పెండ్లి పెద్దగా నుండు మని లగ్న కేంద్రమున కాహ్వానించుట యేమి నీతి? విషము కలిసిన పదార్థమైనా పెరుమాళ్ల ప్రసాద మని స్వీకరించుట పరమైకాంతుల దృష్టిలో పవిత్రకార్యము కావచ్చునేమో కాని, సామాన్యసంసారుల మాట యేమి?

అట్లే, జన్మలగ్నమునకు, జన్మచంద్రునికి అష్టమ రాశియొక్క కాని, వరకు దాని నవాంశయొక్క కాని స్పర్శ వివాహలగ్నమునకు రాహిద దని శాస్త్ర ముద్ఘోషించుచున్నది. చూడుఁడు :

"దంపత్యో రష్టమం లగ్నం రాశిర్వా యది లగ్నగః,
అర్థహాని స్తయో ర్వ్యాప్యా త్తదంశం స్వామినం త్యజేత్."
(నారదమహర్షి)

మఱియు, జన్మలగ్నమునుండికాని, జన్మచంద్రరాశి నుండికాని చతుర్థాష్టమద్వాదశరాసులు వివాహకాలమున



# సౌందర్యముయొక్క ప్రాముఖ్యత నిలబెట్టుట

ముఖ్యమైన అన్ని విషయాలలో వనితలకు చిన్నతనములో తమ తల్లులకంటె మంచి సలహాను ఎవరు యివ్వలేరు. ఈ తల్లి తనకుమార్తెకు ముఖ్యముగా బోధించినదేమంటే, పియర్సు సబ్బు నిర్మలమైన నీటితో తన చర్మసౌందర్యమును నిలబెట్టుకొనుటయే. ఈ పద్ధతిని తన తల్లివద్దనుంచి నేర్చుకొని అనుసరించుచున్నది. ఇదే ఆమె సౌందర్యము చెడకుండా వుండుటకు కారణము. తన కుమార్తెకూడా యీ విధంగానే చేయుచున్నది. కనుక ఆమెయొక్క సౌందర్యము కూడా ఏమాత్రము చెడకుండా వుంటుంది.

ఇండియాలో నలభై సంవత్సరములనుంచి అందమైన స్త్రీలు ప్రత్యేకముగా పియర్సువే వాడుచున్నారు. దీని పరిమళము, మృదువైన నురుగు దీనికి సబ్బులలో ప్రాముఖ్యత వచ్చినవి.




# పియర్సు సబ్బు

శాశ్వతముగా సౌందర్యమును కాపాడుటకు

TG. 39-172 TL. A. & F. PEARS, ISLEWORTH, ENGLAND

లగ్నములో నుదయమందరాదని వామదేవుఁడు కఠినముగా శాసించుచున్నాఁడు:—

"యే ఛిద్రబంధువ్యయగాః ప్రసూతౌ
విధో ర్విలగ్నాచ్చ వధూవరస్య,
తే రాశయః ప్రాప్య విలగ్నరేఖాం
భావాంశశుద్ధాఅపి మృత్యవే స్యుః." (వివాహపటలము)

ఇట్టి విధు లింకను కొన్ని కలవు. మచ్చున కివి యుదాహరించితిని. ఇవన్నియు వ్యక్తిసంబంధవిశేషవిధులు. సామాన్యవిధుల ననుసరించి లగ్న మెంత మంచిదైననేమి, విశేషవిధులను గమనింపనినాఁడు "ఫలము దైవాధీన" మను కొనక తప్పదు. వృషభలగ్నజాతకుని వివాహమునకు గురువును లగ్నమం దుంచుటకంటె శని నుంచుటయే స్పృహణీయ మనవచ్చును. ధర్మకర్మాధిపతి యగుటచే శని వృషభలగ్నమునకు రాజయోగకారకుఁడు. నిసర్గపాపుఁ డయినను, వృషభలగ్నజాతకునికిమాత్రము శని యుపయోగకారి కాకమానఁడు. ఎంత బందిపోటు దొంగ అయినా, తన భార్యాపుత్రులను తాను పోషించక పోఁడుకదా? చీవాట్లు పెట్టినమానె, ఆఁకలిగొన్నవాని కన్నము పెట్టఁగలఁడు శుభుఁడగు శని. పాపియగు బృహస్పతి 'అడియేన్‌దాసోహ' మని అర్ఘ్యపాద్యము లర్పించి ఉపచారవాక్యములతో విషము కలిపిన పాలు త్రావనిచ్చును. సహజపాపగ్రహము శుభుఁడైనచో, నిసర్గశుభగ్రహము పాపుఁడైనచో వచ్చు ఫలముల తారతమ్య మిట్టిది.

"సాంప్రతఫలద స్స్వాతౌ
బలాన్వితో యో దశాధిపతిమిత్రంచ,
పాపోఽపి స శుభద స్స్యాత్."

అను వరాహమిహిరాచార్యుని సూత్రము మరువరానిది.

సారాంశ మేమన, జన్మకాలికగ్రహభావస్థితులకు, దశాపరిపాకమునకు అనుగుణముగనే ముహూర్తపుఫలముండు ననుట. చెడ్డదశలలో మంచి ముహూర్తము కాని, మంచిదశలలో చెడ్డ ముహూర్తము కాని సామాన్యముగా లభించదని పెద్ద లందురు. చెడ్డదశలో మంచిముహూర్తము లభించినా, ముహూర్తమువలన చేకూరు సత్ఫలము తాత్కాలికమే అనియు, మంచిదశలో చెడ్డ ముహూర్తము లభించినపుడు తాత్కాలికస్వల్పక్లేశముతో మంచిఫలమే సిద్ధించుననియు సాధారణముగా మనము విశ్వసించవచ్చును.

ఈ క్రింది యుదాహరణముం జూడుఁడు, ఇది యొక రాజపుత్రుని వివాహముహూర్తపు కుండలి. సామాన్య

<table>
<tr><td></td><td></td><td>కు 14-55</td><td>కే 10-52<br>ర 15-7<br>బు 24-2<br>ఇ 26-16</td></tr>
<tr><td></td><td colspan="2" rowspan="2">(సాయనము)<br><br>వివాహము</td><td>శు 22-2<br>I లగ్నము<br>23-0</td></tr>
<tr><td>శ 2-59<br>(వ)</td><td></td></tr>
<tr><td>రా 10-52<br>వ 10-17<br>గు 4-47</td><td></td><td></td><td>చ 24-0</td></tr>
</table>

దృష్టితో చూచినచో, ఇంత చక్కని ముహూర్తము దొరకుట దుర్ఘటము. గొప్ప శాస్త్రజ్ఞు లగు మహనీయులు నిర్ధరించిన లగ్నమిది. సుఖసౌభాగ్యసంధాత యగు శుక్రుఁడు లగ్నమం దుదయించుచున్నాఁడు. మూఁడింట నున్న చంద్రుఁ డభివృద్ధిని సూచింపఁగలఁడు. సత్సంతానసౌభాగ్యవరప్రదుఁడై పంచమకోణమందు ప్రబలుఁ డగు బృహస్పతి ప్రకాశించుచున్నాఁడు. ఆరింటి శనిరాహువులు, లాభస్థానమందలి కుజుఁడు ఇష్టార్థసిద్ధి నిచ్చుటకు బద్ధకంకణులై నిలిచి యున్నారు. ముహూర్తమునకు ప్రబల గుణాధిక్యమున్నది. రాహు వారింట శుభుఁ డగుటచే ద్వాదశమందలి కేతుస్థితిని తప్పనలేము. ఇఁక, రవిబుధుల వ్యయస్థితి యొకటి తప్ప ఈ లగ్నమునకు వేరుదోషము లేమియు కానరావు.

వివాహముహూర్తమున శుభఫలదాత లగు గ్రహములలో నేయేగ్రహ మెన్నిగుణముల నిచ్చునో, వానిలో ప్రశంసలోని లగ్నమున కెన్ని గుణములు వచ్చినవో ఈక్రింది జాబితా చూపఁగలదు:—

| గ్రహము | శుభస్థానములో నున్నపు డిచ్చు గుణములు | ప్రశంసలోని ముహూర్తమునకు వచ్చిన గుణములు |
|---|---|---|
| 1. చంద్రుఁడు | 5 | 5 |
| 2. రవి | 3½ | .... |

| గ్రహము | శుభస్థానములో నున్నపు డిచ్చు గుణములు | ప్రశంసలోని ముహూర్తమునకు వచ్చిన గుణములు |
|---|---|---|
| 3. గురువు . | | 3 |
| 4. శుక్రుఁడు . | 2 | 2 |
| 5. బుధుఁడు .. | 2 | .... |
| 6. శని . | $1\frac{1}{2}$ | $1\frac{1}{2}$ |
| 7. కుజుఁడు . | $1\frac{1}{2}$ | $1\frac{1}{2}$ |
| 8. రాహువు, లేక కేతువు | $1\frac{1}{2}$ | $1\frac{1}{2}$ |
| మొత్తము .... | 20 | $14\frac{1}{2}$ |

మొత్తపు గుణములు 20 టికి $14\frac{1}{2}$ గుణములు వచ్చుటచే (నూటికి $72\frac{1}{2}$ వచ్చినది) లగ్న ముత్తమమయిన దనుటకు సందేహము లేదు. *

ముహూర్తపు ఫలము గమనించుటకు పూర్వ మా దంపతుల జాతకము లెట్టివో, వారికిఁ గల పరస్పరాకర్షణ మెట్టిదో కనుఁగొనుట మిక్కిలి ప్రయోజనకారి. వారి సాయనజాతకచక్రము లివి:—

<table>
<tr><td>.</td><td>శు 4-15<br>బు 4-31<br>ర 27-4</td><td>ఇ28-33</td><td>చ 24-51</td></tr>
<tr><td>కే 5-37</td><td colspan="2" rowspan="2">రాజపుత్రి</td><td>శ 29-50</td></tr>
<tr><td></td><td>రా 5-37</td></tr>
<tr><td>I 5-30<br>గు 5-22</td><td></td><td>వ 14-42<br>(వ)<br>కు 19-43<br>(వ)</td><td>X 11-30</td></tr>
</table>

లగ్నబిందువందే ఉదయించుచున్న ప్రబలుఁడగు ధనుర్గురువు (లగ్నాధిపతి) జాతకురాలి అభిజాత్యసౌశీల్యముం తోడి యుత్తమశ్లోకతను చాటుచున్నాఁడు. బుధశుక్రులు పంచమకోణములో సంయోగము నొంది లగ్నాధిపతితో పూర్ణత్రికోణశుభదృష్టి నార్జించుటచే విద్యావివేకసంపన్న మగు నుత్తమసుమనస్కతను జాతకురాలికి ప్రసాదించుటలో వింతలేదు. లాభస్థానమం దున్న కుజవరుణసంయోగము వంశమున కనురూపమగు ధైర్యప్రతాపముల సూచింపఁ గలదు. ఈకుజవరుణులతో లగ్నగతబృహస్పతికిఁ గల అర్ధకేంద్రప్రాతికూల్యదృష్టి స్వాభిమానపరవశమైన ప్రచండకోపశీలత నీఁగఁగలిగినది. అరింటి రవి, నవమరాహువు ఉత్తమఫలముల నీఁజాలినవారే. అష్టమస్థానమందలి చంద్రుఁ డరిష్టమును సూచించువాఁడేకాని, బాలారిష్టదోషమును ప్రబలగురువు నివారించినాఁడు. శనివలని కేంద్రవేధ నభిలషించుచున్న రవి స్త్రీజాతకమున భర్తృసౌఖ్యమును సంకోచపరచు ననుట యీయుత్తమజాతకమందలి గొప్ప లోప మనవచ్చును. పంచమస్థానమం దున్న బుధశుక్రసంయోగము విద్యావినయవివేకముల కెంత మంచిదైనను, సంతానవిషయమున నాశాభంగకారి.

ఆ రాజపుత్రుని జాతకచక్ర మిది:—

<table>
<tr><td></td><td>కే 20-24<br>X 29-0</td><td>ఇ 21-40<br>బు 23-30</td><td>శ 13-39<br>ర 13-54</td></tr>
<tr><td></td><td colspan="2" rowspan="2">(సాయనము)<br>రాజపుత్రుఁడు</td><td>I 29-18<br>శు 23-42</td></tr>
<tr><td>.</td><td>కు 29.43<br>గు 2-15</td></tr>
<tr><td></td><td></td><td>రా20-24<br>చ 23-22</td><td>వ 24-1</td></tr>
</table>

లగ్నము కర్కాటకరాశిలో మీననవాంశ. ప్రబలుఁడగు బృహస్పతి లగ్నమందే యున్నాఁడు. కాక, లగ్నము శుభ

* ఈ పద్ధతికి విశోపక (లేక, వింశోపక) పద్ధతి యని వ్యవహారము. దీని సూత్ర మిది :—

"ద్వౌద్వౌ జ్ఞభృగ్వోః పంచేందౌ,
రవౌ సార్ధత్రయం గురౌ,
రామా మందాగుకేత్వారే,
సార్ధైకైకం విశోపకాః." (ముహూర్తచింతామణి)

గ్రహములగు గురుశుక్రుల మధ్యమున నుండి జాతకుని సుశ్లోకత, దయార్ద్రహృదయము, ధర్మతత్పరత మున్నగు నుత్తమగుణములను చాటుచున్నది. లాభభావమందున్న రవిశనిసంయోగము రాజపుత్రుని చిత్తవృత్తి మహా నియమబద్ధ మైనదనియు, ఆర్షధర్మదీక్షాపరతంత్రమనియు తెలుపఁగలదు. బుధునిపై వరుణునికిఁగల త్రికోణదృష్టి ఉపజ్ఞాయుతమగు ప్రతిభ నీఁగలదు.

కాంతాకళాకారకుఁడయిన శుక్రుఁడు లగ్నమందుండి బుధవరుణుల అర్ధకోణశుభదృష్టిలో నుండుటచే, జాతకుఁడు రూపరేఖావిలాససౌభాగ్యాదులచే కామినీచిత్తచోరుఁ డగుటే కాక, లలితకళాపాండిత్యమున నద్వితీయుఁ డనియు చెప్పుట చెల్లును. మిథునమున రవి యున్న జాతకమున తులా చంద్రుఁడు ధర్మతత్పరత, నీతికౌశల్యము, నిష్పక్షపాతదృష్టి, లలితకళాభిమానము వీని ననుగ్రహించును. ఇంద్ర బుధ సంయోగము శుక్రవరుణుల యానుకూల్యదృష్టి కలుగుటతమున జాతకుని రసలుబ్ధహృదయమును, ఆధ్యాత్మిక దృష్టిని తెలుపఁజాలినది. లగ్నాధిపతి యగు చంద్రునికి గృహాధిపతి యగు శుక్రునితో పరివర్తన యోగము రమ్యముగా నున్నది కాని, వారికిఁ గల పరస్పర కేంద్రవేధ స్త్రీమూలకముగా మనఃక్లేశమో, ఆశాభంగమో సూచింపఁగలదు. ఇట్టి శుక్రుఁడు రాహుకేతువులకు ప్రాతికూల్యదృష్టిలో నుండుట మరింత చింతాకరము. దశమ కేతు వొక విధముగ విరక్తతను సూచించునేమో :

కులశీలవిద్యావయోరూపసౌభాగ్యసంపత్తులలో నానురూప్యము గలవా రీదంపతు లనియు, మణికనకములవంటిది వీరి దాంపత్య మనియు లోకము కొనియాడినది. కాని, భర్తృసుఖసంకోచము గల వధువునకు భార్యామూలక మనఃక్లేశము గల వరుని ముడివైచుట హతవిధి సృష్టిలోని వైచిత్ర్యము!

ఈ యిరువురి జాతకములం బోల్చి పరికింతము. పొంతనములు చూచినచో, వీరిది షష్ఠాష్టమ నాడీ సంబంధము; గణకూటములో దేవరాక్షస స్పర్ధ. రాశికూటములో నిస్సంతతిని దెలుపు పంచమ నవమయోగము! పొంతనముల యొడిక కింత చాలునా?

ఇఁక పరస్పరగ్రహయోగములఁ జూడుఁడు: వధువు జాతకమందలి రవికి వరజాతకపు చంద్రునితో సమసప్తక యోగ ముండుట చదువరులు గుర్తించియుందురు. భక్తిని సమకూర్చు నుత్తమయోగ మిది యనుటకు సందియ ముండదు. భార్యజాతకపు రవితో భర్తజాతకపు కుజునికిఁ గల త్రికోణదృష్టి సయితము మంచి యాకర్షణను పోషింపఁజాలినదే. భార్య లగ్నముపైఁ గల భర్త గురుదృష్టి, భర్త లగ్నముపైఁ గల భార్య గురుదృష్టి ఇవి ఈ దంపతుల పరస్పరభాగ్యవికాసము నభివృద్ధిచేయఁగలవి. ఇంతవట్టు చాల రమ్యముగా నున్నది. కాని, ముందున్నది ముసర్లపండుగ! వధువు జాతకమందలి చంద్రునితో వరజాతకపు వరుణుఁడు సంపాదించిన పూర్ణకేంద్ర ప్రాతికూల్యదృష్టిని గమనింపుఁడు! విప్రలంభశృంగార ప్రియుఁడు గదా వరుణమహాశయుఁడు? భార్య ఎంత పతివ్రత అయిన నేమి, ఆమె హృదయము (చంద్రుఁడు) భర్త వరుణుని వేధను (వియోగక్లేశమును) కదా అనుభవింపవలయును?

ఇంత చాలక, భార్యజాతకపు సప్తమ (భర్తృ) స్థానమున భర్త జాతకము నుండి శని సంయోగముచే స్తబ్ధుఁడైన రవి సాక్షాత్కరించినాఁడు! స్త్రీ జాతకమున సప్తమ భావమున రవి యున్నచో, భర్తృపరిత్యాగము సూచిత మగునఁట! అశుభదృష్టి గల శని సప్తమమం దుండెనేని అట్టి జాతకురాలు కన్యకాత్వముతోనే వార్ధకమునకు వచ్చునఁట. అనఁగా నామె తారుణ్య మడవిని కాచిన వెన్నెల యగు ననుట!

"ఉత్సృష్టా సూర్యేస్తే, కుజేచ విధవా నవోఢైవ,
కన్యైవా శుభదృష్టే శనైశ్చరే వృద్ధతాం యాతి."
(సారావళి)

అను కల్యాణవర్మసూత్రము స్మరింపఁదగినది. ఇది యిట్లుండ, భర్త లగ్నములో భార్యజాతకపు శని ప్రత్యక్షమైనాఁడు. చాలదని, భర్త సప్తమ భావమందు భార్య జాతకపు కేతువు కూర్చున్నాఁడు. సప్తమ కేతువునకు 'ఫలదీపిక' చెప్పిన ఫల మిది:—

"ద్యూనే వమాన మసతీ రతి మాంత్ర రోగం
పాత స్స్వదారవియుతిం మదధాతుహానిం."

భర్త జాతకము నందలి రవి శని సంయోగము భార్యజాతకపు రవిశనులకు నికరముగా పరిపథ్యముననే యుండుటచే, 'పాపకర్తరి' పాలయి యీ దాంపత్యబంధమున సర్వవిధముల శని ప్రాతికూల్య ప్రాబల్యము నిచ్చినది. మఱియొక విశేష మేమన, ఇట్టి భార్యాజాతకపు

శని భర్తృజాతకము నందలి లగ్న బిందువునందే ఆవిర్భవించినాఁడు. అనఁగా భర్తను భార్యాజాతకపు శని పట్టినాఁడనుట: మకరిపట్టుకదా శనిమహాశయునిది: బంధము క్లేశదాయకమై వదలించుకొన రానిది. దినగండము, దీర్ఘాయుస్సు: భార్యాభర్తల జాతకములలో పరస్పరముగ కుజ శుక్రుల కానుకూల్యసంబంధము కానరాదు. కాన, భార్యాభర్తలకు రక్తి మృగ్యము. భక్తి యుండి, రక్తి లేని, క్లేశదాయకమగు వీడరాని బంధము వీరిది.

ఉత్తమ స్త్రీ పురుషులగు వీరి జాతకములను శోధించి చూచినచో సిద్ధించు విషాదకరములగు యోగములిట్టివి. నియమబద్ధమైన నిర్మలజీవితము భర్తది; పాతివ్రత్యధర్మమున కాదర్శప్రాయమైన శీలము భార్యది. అనురక్తయగు భార్యపై ప్రేమశూన్యుఁడు భర్త; విముఖుఁడగు భర్తపై నవ్యాజపవిత్రభక్తి గలది భార్య. అపారమగు సంకల్పశక్తి గల ప్రశాంతహృదయుఁడు భర్త ;దుర్నిరీక్ష్య ప్రభావసంపన్నయగు ప్రచండమానిని భార్య. అష్టైశ్వర్యములతో తులదూగుచుండిననేమి, నామమాత్రఫలమైన నలువదియేండ్ల నిర్భాగ్యపుదాంపత్యజీవితము వీరిది. నిష్కారుణుఁడగు విధిచేష్టితములలో నిట్టి విపరీతము లందందు కానవచ్చుచుండును. కాననే,

"సా కిం న రమ్యా,సచ కిం న రంతా,
బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా."

అను నానుడి. భర్తృజాతకమందలి రవిశని సంయోగము సప్తమభావబిందువునకు సార్ధకేంద్రమం దున్నదికదా? ఈ శని సప్తమాధిపతి. సప్తమాధిపతి సప్తమస్థానమునకు ప్రతికూలుఁడయిన జాతక మీరాజపుత్రునిది. ఇఁక, వివాహపు ముచ్చట లెవరు పరిపాలించువారు? భర్తృజాతకపు శనికార్యమునకు భార్యజాతకపు శని తోడయినాఁడు. అంతా శనైశ్చరుని సామ్రాజ్యమే! ఇది యిట్లుండ, భార్యాభర్తలకు చంద్రవరుణ పరస్పరవేధ వియోగము సూచించునది కదా? పట్టినపట్టు వదలని శని, వియోగము తెచ్చిపెట్టు వరుణుఁడు వీరు సాధించిన వైవాహిక జీవిత మిం కెట్లుండఁగలదు?

జాతకయోగము లట్లుండ, ఇట్టి వధూవరులకు వైవాహిక జీవితమున దుష్ఫలపరిణామమును తెచ్చి యీయఁగల ప్రాపంచిక కారణము లెట్టి వను ప్రశ్న రావచ్చును. ఇది విషమసమస్య.

శని పాపియైన చోట ప్రాపంచికానుకూల్యములపై నపారశ్రద్ధయో, వయస్సు చెల్లిన మాతాపితరులనుండి మీర రాని నిర్బంధమో కారణముగా దుష్పరిణామము కలుగునందురు. లగ్నమందు బృహస్పతి (ధర్మాధిపతి), దశమ కేంద్రమున కేతువు ఉన్న జాతకుఁడు లౌల్యమువలని నైచ్యమునకు పాల్పడు ననలేము. పరస్పరకేంద్రమం దున్న చంద్ర శుక్రులకు చతుర్థ స్థానముతో సంబంధ ముండుటచే, స్త్రీమూలకక్లేశమునకు మాతృదేవత యొక కారణముగా నేర్పడవచ్చు నని యూహించుట తప్పుకాదు. సప్తమాధిపతి సప్తమస్థానమును ద్వేషించుటవలన భార్యాద్వేషము సూచితమైనను, లగ్నమందలి శుక్రుఁడు—ఇంద్రావరుణుల స్నేహదృష్టి యుండుటచే—స్త్రీసుఖవైముఖ్యమును చూపువాఁడు కాఁడు, ఇంద్రబుధులకు, వరుణునికి సరినమమ నున్న యీ శుక్రుఁడు కామినుల నాకర్షించు విషయమున ఉపజ్ఞతోఁగూడిన చాకచక్యము, చాతుర్యము, జాగరూకత కలవాఁడీజాతకుఁ డనియే యుద్ఘోషించును. లాభస్థానమం దున్న మాయలమారి ఇంద్రుఁడు బుధసంయోగమునం దుండఁగా, వానికి కేంద్రమం దున్న కుజుఁడు (దశమాధిపతి) ఇతరులకు దుర్భేద్యమయిన రహస్యమంత్రశక్తితోడి యారంభములవలని లాభమును జాతకున కీయఁగలఁడు. సామాన్యమానవులయం దుండెనేని మోసగారితన మనియు, ప్రభుత్వవైభవము కలవారిలో నుండె నేని నీతిస్ఫురణ మనియు ఇట్టి శక్తికి లోకవ్యవహారము వచ్చుట చదువరులకు క్రొత్త కాదు. ఈ జాతకమున నిట్టి శక్తికి శుక్రుని పనులలో వ్యాప్తి యుండుట యొక విచిత్ర మగు వైలక్షణ్య మనవచ్చును. అనఁగా, ఈ జాతకునకు చెడినది కళత్రభావమే కాని శుక్రుని విలాసము కాదనుట! నిరంతరరసపరతంత్రహృదయము, లలితకళాలోలుపత, మధురభావముగ్ధ చిత్తవృత్తి, ఇత్యాదిఫలముల నీ శుక్రుఁడు సమృద్ధిగా నీయఁగలఁడు. ఇట్లనుటచే, భర్తవి కృష్ణలీల లనుకొనుట మహాపాపము. అతని ధర్మకర్మౌశబుద్ధి అట్టి పనుల కెడ మీయదు. ఎట్లయిన నేమి, భార్యపట్ల జాతకుఁడు ద్రోహ మొనర్చు నేమో యని యనుకొనకతీరదు. ఇందులో ఆత్మద్రోహము సయితము లేకపోలేదు. అగ్నిసాక్షికముగా పరిణయమైన శీలవతి యగు ధర్మపత్ని తారుణ్యము నడవిని కాచిన వెన్నెల గావించుట ఆత్మద్రోహము కాక వేరేమి?

భార్యజాతకమున ధర్మస్థానాధిపతి రవి ఉచ్చగ్రహము. ఈ రవినుండి మనః కారకుఁ డగు చంద్రుఁ డాపోక్లిమ స్థాన

పూత్రియించి ఉత్తమయోగము నిచ్చినాఁడు. భార్యయందు ధర్మమునకు లోపము కలుగునా, శీలమునకు కొదవ యుండునా? భర్తకు దృష్టిలోపము కాక! అతని జాతకమున పుణ్యసహాయము ధనుస్సులో 9 వ భాగయం దుండుటచే చంద్రునినుండి అర్ధ కేంద్ర దృష్టి, శుక్రుని నుండి సార్ధకేంద్రదృష్టి దానికిఁ గలవు. అన్ని విషయములలో ధర్మబుద్ధి గల భర్త స్త్రీ విషయమున మాత్రము ధర్మమునకు ప్రతికూలుఁ డగునేమో యని తలఁచుట తప్పనరాదు. భార్యచంద్రునితో భర్తవరుణుని ద్వేషమింత యనర్థమునకు మూలము. మనస్సు లతకని చోట ఏస్వల్పకారణమైనను చాలును. రూపవతియగు భార్యను ద్వేషించు కురూపి భర్త, విద్యావతియగు పత్ని సేవగించు మూర్ఖపతి, శీలవతియగు స్త్రీని కంటగించు నీచపురుషుఁడు, ధర్మశీలయగు సాధ్వి నోర్వని యభాగ్యంపుమగఁడు, ఇట్టివారి నెందఱను చూడము? తల్లి చెప్పు కొండెపు మాటలను వినియో, చెల్లెండ్రు ప్రయోగించు కుతంత్రముల ఫలముగనో, అనవసరములగు దురూహల మూలముననో నిరపరాధలగు భార్యలను ద్వేషించు భర్తలు లేరా?

ఈ సందర్భమున నా కొక్క కథ జ్ఞప్తికి వచ్చుచున్నది. అది యొక రాజదంపతుల విచిత్రచరిత్రము. ధర్మశీలుఁడని ప్రఖ్యాతిగాంచినవాఁ డారాజు. అతని ధర్మపత్ని లోకోత్తరశీలవతి. భర్తకుటుంబమునకుఁ జెందిన ఇతరస్త్రీలు శీలముపై నంతగా దృష్టిలేనివారగుటచే వారు రాణికి గౌరవపాత్రములు కాలేదు. స్థానబలము కలవారు కావున వారు రాణిని ద్వేషింపసాగిరి. ఆమెపై రాజుతో లేనిపోని కొండెములు చెప్పనారంభించినారు వారు. క్రమక్రమముగ నీదుస్తంత్రము అధికము కాఁగా రా జొకమారు రాణిని దండించెనఁట. "శీలము లేనివారి నడుమ శీలవతి యున్నచో నిట్టి క్లేశములు తప్పవు." అని యా సువాసిని నెమ్మదిగా భర్తకు ప్రతి యిచ్చినది. ఈ ఘాటకు రాజుగారి మనస్సు కళుక్కుమనినది. అనలేక, అనుభవించలేక, రాజు అంటీ అంటకుండ నొక రీతిగ కాలమును వెళ్లబుచ్చుచుండినాఁడు. కొన్నాళ్లకు రాజు విహారార్థమై నగరాంతరమునకుఁ బోయినపుడు రాణిసయితము వెంటనుండినది. సాయంతన సమయములలో రాజును, రాణియు తమతమ మోటార్ల నెక్కి వాడుకచొప్పున నగర ప్రాంత రాజమార్గములలో ప్రత్యేకముగ విహారమునకు వెళుట యలవాటు. ఒకనాఁడు నగరమునకు రమారమి మూడు క్రోసుల దూరములో నరణ్యమధ్యమునఁ బోవుచుండఁగా రాణిగారి రథ మాకస్మికముగా నిలచినది. పెట్రోలునూనె ముగిసిన దని కనుగొని, తన యజాగరూకత నొప్పుకొని గడగడ వడఁకుచు సారథి రాణిగారి కాళ్లపైఁబడి క్షమాపణ నర్థించినాఁడు. కమ్చీదెబ్బలు సయితము కొన్ని రుచిచూచినాఁడఁట! కాని, రథము చలించు నుపాయము కానరాలేదు. "ఇరుసున కందెన పెట్టక, పరమేశ్వరు బండియైన పోదు" కదా?

ఎవరైన మోటార్లపై వచ్చిరేని, వారిని యాచించి కొంత నూనె సంపాదింపవచ్చునని సారథి కొండంత యాశతో కాచియుండెను. కాని, దురదృష్టమేమో, రాత్రి తొమ్మిది గంటలదాఁక కాచినా, కారుకాని బస్సుకాని వచ్చు పొలకువ కానరాలేదు. చీఁకటిరాత్రి, నిస్సహాయత—నిమిష మొక్కయుగ మగుచుండెను. వేళ మీరినందున రాజు కారుతో నెవరినైనా పంపునేమో యను నాశ యుండినది కాని, ఈ మార్గమున రాణి వెడలినదని ఎవరు నెఱుఁగరు. రాత్రి పది గంటలవేళ నాకస్మికముగ నొక మోటారుకారు వేగముగ నగరాభిముఖముగఁ బోవునది రాఁగా, సారథి దాని నాపి తన యవస్థ నెఱిఁగించి కొంత పెట్రో లిమ్మని యాచించినాఁడు. ఆ కారు నడపుచుండిన యజమానుఁ డొక సుందర తరుణుఁడు. గొప్ప అధికారిగా నతఁడు చూపట్టుచుండెను. తన కారులో నున్న పెట్రోలును పరీక్షించి నగరము చేరుటకు మాత్రము చాలినంత నూనె యున్నదని యతఁడు కనుగొనెను. రాణిగారి యవస్థ నతఁడు చాల చింతించి, ఆమె సమ్మతించినచో సంతోషముతో నామెను తన కారులో నెక్కించుకొని భద్రముగా నగరముచేర్చి రాజుగారి భవనమునొద్ద వదలుదు నని సగౌరవముగ తెలిపెను. ఈ ప్రమాద పరిస్థితులలో రాణికి విషమపరీక్ష వచ్చినది. ఆ కా రెక్కి భవనము చేరుకోవలయునా, అరణ్యములో నకాలమున అగతికయై నిలువవలయునా? నగరము చేరుకొనుటే బాగని కడ కామె నిర్ధరించినది. ఉత్సాహముతో నా తరుణుఁ డాయంతఃపురకాంతను తన కారులో నెక్కించుకొని నగరము చేరి రాజుగారి భవనద్వారముచెంత కారు నాపి తలుపు తెరచినాఁడు. రాణియు కారు దిగి కృతజ్ఞతను తెలుపుచు నతనికి వందనము చేసి తన యంతఃపురమును చేరుకొనెను. వేళ మీరినా రాణి భవనమునకు మరలిరాకుండుటను గమనించి, ఎందు బోయియుండెనో, ఏమి కారణమో పరీక్షింపనెంచి, భవనపు చంద్రశాలలో కూర్చుండి పరిపరివిధముల

నూహించుచున్న రాజు పైదృశ్యమును గమనించి తన శీలమును సందేహించినాఁ డని యా నిర్మలచారిత్రయగు రాణి యేమి యెఱుఁగును? ఇందలి సత్యమేమో విచారించు బాధ్యత భర్తకు కానరాలేదు. రాణినయినా ప్రశ్నించు నవసర మున్నదని యతని ధర్మబుద్ధికి స్ఫురించనేలేదు. తనవారి శీలము రాణి తప్పువట్టిన యవమాన మతఁడు మరచి యుండలేదు. రాణిపరోక్షమం దా న్యాయమూర్తి తనకంటికి కానవచ్చిన సాక్ష్యముపైననే తీర్పుచెప్పినాఁడు. నాఁటినుండి రాణిముఖ మతని పాలికి చవితిచంద్రుఁడైనది. అభిజాత్యమునకు, శీలసంపన్నతకు తగిన ఆత్మాభిమాన మారాణిది. కథ ఏమని విచారించు నక్కఱలేకయే తన శీలమును దుష్టముగా నిర్ధరించునంతటి యవిచారపరుఁడగు భర్తసన్నిధి కేగి 'నేను నిర్దోషి' నని చెప్పుకొని ప్రాధేయపడునంతటి నైచ్యమున కా మానవతి పూనుకొనలేదు. వారి జీవితము లట్లే గడచిపోయినవఁట:

చెప్పవచ్చిన దేమన, రక్తిలేని జాయాపతులకు, పరస్పర చిత్తవృత్తుల నెఱుఁగని భార్యాభర్తలకు, అన్యోన్య ప్రేమ లేని సతీపతులకు ఏ గోరంత కారణమైనా కొండంతగా పరిణమించి జీవితములను పాడుచేయఁగలదనుట: ఎవఁడో చాకలి తన భార్యను దండించుచు నాడిన మాట సీతామహాదేవికి శాశ్వత భర్తృవిరహమును తెచ్చిపెట్టఁ గలిగెనుగదా? శనిరాజ్యమున ఇంద్రావరుణుల దుశ్చేష్టాఫలముగ నిట్టి వింత లెన్నియైన పుట్టవచ్చును. ప్రశంసలో నున్న దంపతుల వైవాహిక జీవితమున నయితము ఏ యల్ప కారణమువలననో వైమనస్యము వచ్చియుండును. అది యట్లుండె.

వివాహలగ్న ముత్తమమైన దని కనుగొంటిమికదా? ఈ దంపతుల జాతకములతో దీనిని పోల్చిచూచినచో, ఆముహూర్తమువలన నెట్టి ఫలము లుద్భోధితములో స్పష్టమగును. చూడుఁడు: "ప్రథమగ్రాసే మక్షికాపాతః" అన్నట్లు వధువుజాతకమున నష్టమరాశి వివాహలగ్నమైనది: ఈ వివాహమువలన నష్టము వధువునకే యని తెల్లము కదా? వరుని జాతకమున లగ్నాధిపతియగు చంద్రుని ద్వేషించుచున్న శుక్రుఁడు వివాహకాలమున లగ్నమం దుదయించుచున్నాఁడు. భార్యజాతకమున రవితో ప్రాతికూల్యదృష్టి గల శనిసయితము పరిణయకాలమున లగ్నమున ప్రత్యక్షమగుట ఘోరపరిణామము. జన్మకాలమున అశుభఫల సూచకములగు నీగ్రహస్థానములందే వివాహలగ్న ముండుటచే, ఆ గ్రహముల వాగ్దానమేకదా వైవాహిక జీవితమున చెల్లుఁబడికి రావలయును? భార్యాభర్తలకు పరస్పరముగా చంద్రవరుణుల క్రూరవేధ యున్నది. వివాహకాలపు బుధుఁడు భార్యజన్మచంద్రునిమీఁద, వివాహకాలిక చంద్రుఁడు భర్తజన్మవరుణునిమీఁద వచ్చుట పాఠకమహాశయులు ముఖ్యముగా గమనించఁదగిన యోగము. తాత్కాలిక బుధచంద్రుల వైషమ్యము (పరస్పర కేంద్రవర్తిత్వము) వధూవరుల జన్మకాలిక చంద్రవరుణుల వైషమ్యముతో సమ్మేళన మంది యీ వివాహమున ఫలించుఁగాక యని ముహూర్త నిర్ణేతలు దీవించినట్లు తోఁచుచుండలేదా? వేఱు ఫల మెట్లు రాఁగలదు? వ్యక్తిసంబంధములగు విశేషవిధులను గమనించని దోష మెట్లు పరిణమించినదో సహృదయులు గమనింతురుగాక:

ఇది యిట్లుండ, వివాహకాలమునకు వీరికి దశా సౌకర్య మెట్లుండెనో ఇంచుక పరిశీలించుట లాభకారి. భర్త జాతకమున శుక్రుఁడు దిన వర్ష పద్ధతితో చలించి పరిణయ వయస్సున కర్కాటకరాశిలో 29 వ భాగలో నుండెను, అనఁగా, జన్మశనిరవి సంయోగ స్థానము నుండి నికరముగా అర్ధ కేంద్ర ప్రాతికూల్య దృష్టిలో నుండె ననుట: కళత్ర కారకుఁ డిట్లు శనిరవులచే చెడిన వయస్సునందా కల్యాణోత్సవము? మరియొక విశేష మున్నది. దిన వర్షపద్ధతిలో ఆ సంవత్సరమందే చలితశుక్రుఁడు వక్రి యగుట: జన్మశనినుండి అర్ధకేంద్ర స్థానమును బొంది వక్రి అయినాఁ డీశుక్రుఁడు:: ఈ శుక్రుని చలితస్థానము నందే భార్యజాతక మందలి శనిమహాశయుఁ డుండుట యని గుర్తించితి మేని, గుండెలు గుభేలు మనఁగలవు. భార్యజాతకము నందలి శనిని తదవిచూచి భర్తజాతకపు చలితశుక్రుఁడు వక్రించినాఁ డనుట: గ్రహము వక్రించిన దినమున శుభకార్యము లేమియు చేయరాదని శాస్త్రము శాసించుచున్నది. ఇట్లుండ, కళత్ర కారకుఁడు వక్రించిన దేవమాన దినమునకు సరియగు సంవత్సరమునందా రాజపుత్రునకు కళత్ర సంపాదనము? వివాహ మైనతోడనే శుక్రుఁడు వక్రించినాఁడు. వైవాహిక జీవితపు కథ అడ్డముగా తిరిగినది: ఇంతకన్న దశాపద్ధతి ఘనతకు సాక్ష్యము కావలయునా?

ఇఁక, రాజకుమారి జాతకమున చలిత లగ్నము జన్మ వరుణునితో అర్ధకోణ దృష్టి నార్జించిన వయస్సులో నడచిన దీ వివాహము. జన్మకుజుఁడు వక్రి యగుటచే చలన

| I 30 | | ఇ 28-9(వ) | |
|---|---|---|---|
| కే 12-23 | (సాయనము)<br>న్యాయవాది | | |
| | | | శ 6-4 (వ)<br>రా 12-23 |
| X 30<br>ర 17-58 | శు 1-25<br>గు 23-11<br>బు 28-10 | కు 2-5<br>వ 16-25<br>చ 16-44 | |

| | | X 7-0 | ఇ 6-35<br>రా20-45 |
|---|---|---|---|
| గు5-39(వ) | (సాయనము)<br>న్యాయవాది<br>భార్య | | చ 9-10 |
| | | | I 7-30<br>ర 19-12 |
| కే20-45<br>కు6-51 | | శు 1-4<br>వ 23-22 | బు7-53<br>శ 4-56 |

వశమున అప్పటికి జన్మవరుణ సంయోగము నంది యుండెను. చలిత లగ్నమున కీ యోగము మంచిదే యనవచ్చును. కాని, గ్రహములు రెండును ప్రతాపముగలవి. కంకణ బంధమున కంటె కరవాల ధారణమునకే హెచ్చుగా తగిన దీ యోగ మనుట తప్పుకాదు. ఇంకొక్క విశేషము కలదు. ఈ చలిత కుజ జన్మవరుణ సంయోగ స్థానము జన్మకాలపు ఇంద్ర గ్రహమునుండి సార్ధ కేంద్ర ప్రాతికూల్య దృష్టిలో నుండి "మోసము, ద్రోహము" అని హెచ్చరించు చున్నది. ఇది చాలక, రాజపుత్రుని జాతకమున (ఇంద్ర బుధుల కేంద్రమందుండి చెడిన) కుజునికి సరిగా అర్ధకేంద్ర దృష్టియే దీనిని వేధించుట! ద్రోహ మెచ్చట నుండి వచ్చునో, స్పష్టముగ నిది సూచింపఁ గలదు. ఇట్టి విషమ దృష్టులకు లోనయిన చలిత కుజ జన్మవరుణులు వివాహ కాలమున రాజపుత్రి జాతకమున చలిత లగ్నమున కనుకూలు రయినారు. దాంపత్య జీవితమున ద్రోహమో, స్పర్ధయో సంభవించినపుడు సుఖసుత సౌభాగ్యముల నీయలేకుండినా, ధర్మయుద్ధమున నెగ్గఁగల ధైర్యప్రతాపము లీయఁగల మని కుజవరుణులు రాజపుత్రికి మాట యిచ్చి నట్లున్న దీ యోగము. రక్తి కాని, సహృదయత్వము కాని లేని సమర్థుఁడగు రాజపుత్రుని అసూయకు పాల్పడి నపుడు, ఆత్మనిగ్రహము సంపాదించుకొని, విరక్తి నలవరచుకొని, శీలముతోడ స్వధర్మమును సంరక్షించు కొను శక్తి సామాన్య జాతకములకు సాధ్యముకాదు. ఎట్టి యుత్తమ జాతకమున కెట్టి ప్రాపంచిక క్లేశము!

> "క్వ జనకతనయా, క్వ రామజాయా,
> క్వచ రజనీచర సంగమాపవాదః,
> అయి ఖలు! విషమః పురాకృతానాం
> భవతిహి జంతుషు కర్మణాం విపాకః."

అను సుభాషితమునకు దృష్టాంత మీ జాతకము.

పోనిండు! ఇదే ముహూర్తమందే పరిణయ మయిన వేరు దంపతుల సాయన జాతక చక్రము లీ ప్రక్కనున్నవి:—

వరుఁ డాగర్భ శ్రీమంతుఁడగు న్యాయవాది. లగ్న దశమాధిపతి యగు బృహస్పతి చతుర్థ సప్తమాధిపతి యగు బుధునితో చేరి ధర్మస్థానమునం దుండి లగ్నముపై శుభదృష్టిని బరపుచుండుట జాతకుని ధర్మబుద్ధి, ఉదార హృదయము, అభిజాత్యశ్లోకత మున్నగు సుగుణము లను దెలుపుచున్నది. భార్యాజాతకమున సప్తమ భావమందున్న బృహస్పతి పైయర్థమునే బలపరచు చున్నాఁడు, రవిచంద్ర బుధశుక్రులు స్వక్షేత్రములలో నున్న యుత్తమ జాతక మీ సువాసినిది.

భార్య జాతకమున ప్రబలుఁడగు సింహరవి (లగ్నాధిపతి)తో భర్తచంద్రునికి (పంచమాధిపతికి) చక్కని యర్ధకోణమైత్రి గలదు. భర్తకుజునితో భార్యజాతకపు శుక్రునికి సంపూర్ణ సంయోగ మున్నది. దంపతులకు పరస్పర భక్తిరక్తులు సమృద్ధిగా నుండుట వింతకాదు. ఆదర్శప్రాయమైనది వీరి దాంపత్య జీవితము. సత్సంతాన సుఖ సౌభాగ్యములతో వీరి గృహమున లక్ష్మి కళకళలాడు చున్నది.

ఈ దంపతుల జాతకములకు వివాహ ముహూర్తపు గ్రహయోగముల వలని సంబంధమును పాఠకమహాశయులు గమనించెదరు గాక!



దైవ ప్రార్థన

# కలగూరగంప

## బెంగాలు కరవుకారణాలు:
## వుడ్డు హెడ్డుకమిటీ నివేదిక

దేశములోని క్షామపరిస్థితులను విచారించుటకై కేంద్రప్రభుత్వంవారు నియమించిన వుడ్ హెడ్ కమిటీ (వీరిలో శ్రీశొంఠిరామమూర్తిగారు కూడా ఉన్నారు.) ప్రథమతః బెంగాలులోని పరిస్థితులను సాకల్యంగా విచారించి, ఒకనివేదిక తయారుచేసి ప్రకటించింది. బెంగాలులో ౧౯౪౩-౪౪ లో క్షామదేవతచేసిన విలయతాండవాన్ని కమిటీవారు ఈక్రిందిరీతిగా నిరూపించినారు:

"కాటకంవల్లనైతేనేమి, తత్ఫలితంగా చెలరేగిన అంటువ్యాధుల మూలముగానైతేనేమి పది లక్షల మొదలు ఇరవై లక్షలమంది ప్రజలు ప్రాణాలు కోలుపోయివుంటారని మా అంచనా. క్షామబాధకు గురియైనవారు మొత్తము ౬౦ లక్షలకు తక్కువగాదు. అనగా మొత్తము బెంగాలుజనాభాలో ఆరవవంతు ప్రజలు అన్నపానాలులేక అఘోరించవలసి వచ్చిందన్నమాట. ఏపాపమెరుగని ఆబాలగోపాలము ఆకటిచిచ్చు కోర్వలేక, క్రిమికీటకములవలె నికృష్టపుచావు చావటంకంటె దురదృష్టం వేరేవుండదు. ఈవిధముగా దుర్మరణానికి లోనైన ప్రజలందరూ పేదవారే. కొద్దో గొప్పో తమవద్ద నిలవవున్న ధాన్యం తరిగిపోవటంచేతను, ఇల్లువాకిండ్లు తాకట్టుపెట్టికూడా హెచ్చు వెలలకు ధాన్యము కొనలేని దుస్థితి ఏర్పడటంచేతను అనేకులు తమతమ గ్రామాల్లోనే నల్లులవలె మాడి నశించినారు. మిగిలినవారు కొందరు పట్టణప్రాంతాలకరిగి, పలువిధములైన కష్టము లనుభవించి, గతికానక, ఆకలిమంటలకూ, అంటుజాడ్యాలకూ ఆహుతి అయినారు. సంసారములు విచ్ఛిన్నమైనవి. నైతికబుద్ధి అంతరించింది. భరింపరాని కష్టాలకు లోనై, మానవత్వాన్ని కోలుపోయి, నిస్సహాయులై మనుష్యులు పశుప్రమాణంలోకి దిగిపోయినారు. ఒకటిరెండు శతాబ్దులలోపల ప్రపంచం ఇంతటి ఘోరమైన క్షామాన్ని కనాలేదు, వినాలేదు."

అటుపిమ్మట ఈకాటకానికి ప్రధానమైన కారణాలను పేర్కొంటూ సదరు కమిటీవారు రాష్ట్ర, కేంద్రప్రభుత్వాల వింత నడవడిని ఇట్లని విమర్శించినారు:

"దేశము ఇటువంటి క్షోభపాలైవున్నది చూస్తూకూడా ప్రభుత్వానికీ, ప్రజలకూ, రాజకీయకక్షులకూ, గవర్నరుకూ, మంత్రులకూ అన్యోన్యసహకారము లేకుండానే పోయింది. ౧౯౪౩ లో మంత్రులు ఎన్నిసారులు మారినా దేశపరిస్థితులు ససేమిరా మారలేదు. అందరూ విఫలులే అయిపోయినారు. ముస్లిం లీగుకక్షవారు ఇతర ముస్లిము లున్న మంత్రివర్గంలో చేర నిరాకరించడంవల్లనూ, లీగేతర ముస్లిములు లేని మంత్రివర్గంలో ఇతర ప్రధానపార్టీలవారు చేర నిరాకరించడం వల్లనూ మంత్రివర్గాలు పొత్తిగా విఫలమైనట్లు మాకు పొడగట్టింది.

"ఇక, కరవుకారణాలకు వద్దాము. రవాణా సౌకర్యాలు చాలకుండుట, రేవులలో పల్లెవారికి పడవలు లేకుండా చేయుట—వీటివల్ల చాలావరకు ఈ దుస్థితికి కారణమేర్పడింది. సరకు సరఫరాలకూ, కంట్రోలు అమలుజరుపుటకూ తగిన సిబ్బంది కరువై

పోవడమూ. తుపాను మూలంగా కొన్ని ప్రాంతాలలో ముఖ్యపంటలు పాడయిపోవడమూ ఇత్యాది విషయాల నన్నిటినీ ఆలోచించినా గూడా బెంగాలు ప్రభుత్వం వారు గనక సకాలంలో తగుమైన చర్యలు తీసుకొని పట్టుదలతో పాటుపడివున్నట్టయితే నిజంగా ఈ ఘోరకలి తప్పి వుండేదన డానికి సందేహం లేదు. ఇటువంటి చిక్కులే ఇతరరాష్ట్రాలలో ప్రభుత్వమూ, ప్రజల పరస్పరసహకారంవల్ల ఇట్టిట్టే తప్పింపబడి నాయి. ౧౯౪౩ లో బెంగాలు ప్రభుత్వం వారి కంట్రోలు చర్యలు ఎందుకూ చాలకుండా పోయినవి. సరకుసేకరణ ప్రభుత్వంవారి అడితీదారులచేతనే చేయించినారు కాని వర్తకప్రతినిధులద్వారా కాదు. సరకు ఎంత పెద్దవారివద్ద నున్నా సరే తీసుకొంటా మని ప్రకటించి వున్నట్లయితే ఎంతో బాగుండేది. ౧౯౪౩ మార్చిలో కంట్రోలు రద్దుచేయడం పెద్ద పొరబాటు. కలకత్తాలో సరకు సప్లయిల పంపిణీ సరిసమానంగా లేకపోవుట, ౧౯౪౩ లో రేషనింగు అమలు జరుపకపోవుట, ధరలు కంట్రోలు చేయక పోవుట మున్నగునవి కరువుకు కారణాలయినవి. ఇతరరాష్ట్రాలనుండి వచ్చిన సరుకు కరువు ప్రాంతాలకు పోనేలేదు. రవాణా సౌకర్యాలే గనక బాగున్నట్టయితే ఎన్నో ప్రాణాలు తప్పకుండా నిలిచేవి. ప్రయివేటు దుకాణాలను తొలగించి ప్రభుత్వపు దుకాణాలే పూర్తిగా స్థాపించి తగిన సిబ్బందిని నియమించడానికి జాగుచేయడంచేతనే ౩౧-౧-౪౪ తేదీ వరకూ కూడా కలకత్తాలో రేషనింగు అమలు జరుపలేదు. చిల్లరదుకాణాలు గూడ ప్రయివేటువి పని చేయవలె నని ౧౯౪౩ డిసెంబరులో ఇండియా ప్రభుత్వంవారు ఉత్తరువు చేయవలసివచ్చింది. అర్జంటుగా జరుగవలసిన కరువు సహాయకార్యాలకు గూడ ఉద్యోగులను నియమించడంలో మతాలనుబట్టి ఎన్నడమూ, ఆ నిబంధనలను అనుసరించడమూవల్ల అసలు పని జరగడం ఆలస్యమయి పోయింది. కరువుసహాయానికి డబ్బు చాలదంటేమాత్రం సబబైన విషయం కాదు. రిజర్వు బ్యాంకు కేంద్రప్రభుత్వం ద్వారా అప్పుచేస్తే సరిపోయేది. వైద్యసహాయం కూడా ఏమేమీ బాగా లేదు. ఉండవలసిన చికిత్సాక్రమమే ఉండి వున్నట్టయితే తప్పకుండా ఎందరో బ్రతికి వుండేవారు.

బియ్యపుధర విపరీతముగా పెరగడం ఈ కరువుకు ఇంకొక ముఖ్యకారణం. ఇతరరాష్ట్రాలనుండి బెంగాలుకు సరుకుతెప్పించుటకు, గోధుమల ధర, రవానాలను గూర్చి పంజాబుప్రభుత్వంతో ముందే ఒడంబడిక గావించుకొనుట ఇవి ఇండియాప్రభుత్వంవారు ముందే చేయవలసివుండిన పనులు. ౧౯౪౩ మార్చిలో కంట్రోలు ఎత్తివేసిన విషయంలో బెంగాలుప్రభుత్వంతోబాటు కేంద్రప్రభుత్వానికిగూడ పూచీ లేకపోలేదు. ఆ మార్చినాటికే కరువు ఎక్కువయిపోయింది. బెంగాలుకు ఇతరరాష్ట్రాల సహాయం అవసరమని బాగా తెలిసిపోయింది. అప్పుడు నెలనెలకూ కావలసిన గోధుమలు పూర్తిపరిమాణంగానూ, కొంతబియ్యమూ సప్లయిచేస్తామని వాగ్దానము చేయడానికి బదులు ఇండియాప్రభుత్వంవారు తూర్పుప్రాంతరాష్ట్రాలలో స్వేచ్ఛావ్యాపారపద్ధతి అమలుజరిపిరి. తరువాత అన్ని రాష్ట్రాలలోకూడా ఇటువంటి స్వేచ్ఛావ్యాపారం అమలుజరిపి కంట్రోలు తీసివేస్తామనేసరికి బొంబాయి, మదరాసు రాష్ట్రాలూ, మరికొన్ని రాష్ట్రాలూ వలదంటే వలదని గట్టిగా పోట్లాడి గెలిచినవి. ఆగస్టు సరికి బెంగాలులో కరువు ముదిరి, చావులధికమై, ప్రజలు గ్రామాలు వీడి తిండితీర్థాలకై దేవులాడుచు యాత్రలు చేయజొచ్చిరి. అట్టి పరిస్థితిలో రాష్ట్ర ప్రభుత్వముతోబాటు కేంద్రప్రభుత్వంకూడ ప్రజల ప్రాణాలు రక్షించే పూచీ వహింపవలసి యుండెను. కాని వారాపూచీమాట పెట్టుకోనేలేదు.”

ప్రజాక్షేమాన్ని పాటించక ప్రభుత్వమే ఇంత అలక్ష్యంగా ప్రవర్తించినప్పుడు స్వకుక్షింభరులూ, ధనార్జనైకతానులూ అయిన వ్యాపారులు ప్రజల కష్టస్థితిని అవకాశము చేసుకొని అధికలాభాలను గడించడంలో అబ్బురమేమున్నది? ఈ కరువువిషయంలో సాకల్యమైన విచారణజరిపి నిర్భయంగానూ, నిర్మొగమాటంగానూ తమ అభిప్రాయాలు ప్రకటించినందుకు కమిటీవారు అభినందనీయులు.

## నాజీల శరణాగతి

సుమారు ఆరేండ్లపాటు యూరపు ఖండాన్నంతటినీ—ప్రపంచాన్నంతటినీకూడా దద్దరిల్లజేసిన యూరపుయుద్ధం మున్న మే ౭-వ తేదీ తెల్లవారు ఝామున ౨-౪౧ గంటలకు ముగిసిపోయింది. 'అమ్మయ్య!' అని ఎక్కడిసైనికులక్కడే పరమానంద భరితులై చేతులు జారవిడిచి, ఆయుధాలు పడవేసి హాయిగా నీడపట్టులకు చేరుకొన్నారు.

రష్యా సమేతంగా మిత్రమండలి కంతటికీ జర్మనీ బేషరతుగా లొంగిపోయింది. అస్త్రసన్యాస కాండ పూర్తిగా నెరవేర్చింది. యుద్ధ విరమణకు జరగవలసిన తంతు అంతా సవ్యంగా జరిగిపోయింది.

ఈ పరాభవం ముందే గ్రహించాడు కాబోలు, దీనిని పైనవేసుకొని, ఇకముందు నలుగురిలో తల యెత్తుకొని ఎలా తిరగగలను నే ననే ఆత్మాభిమానంతో నాజీనియంత హిట్లరు ముందే ఆత్మార్పణ చేసుకొన్నాడు. ఏలోకంలో అలమటిస్తున్నాడో పాపం!



మిత్రమండలి శరణువేడిన నాజీ ఫ్యూరర్ డోనిట్జ్



ఆయనతరువాత ఆయనగద్దెనెక్కి ఆయన అధికారాలనన్నిటినీ పుణికిపుచ్చుకున్న డోనిజ్జే చేతులారా తనసైనికులకు లొంగుబాటుహుకుం జారీచేసినాడు. ఈ మారణహోమం ఇంకా పెచ్చరిల్లిపోవడమెందుకనుకొన్నాడో ఏమో! ఏమైతేనేమి, ఆయనకు ఈ మారదృష్టి అబ్బడం మహావిశేషమే.

ఒడంబడిక పత్రంపై బ్రిటను, అమెరికా రష్యాలూ, జర్మనీ సముష్టిగా కలిసి సంతకాలు పెట్టుకొన్నవి. అందులో జర్మనీయే స్వయంగా దాఖలు చేసిన షరతులివి: ౧. జర్మనుసేనలు సర్వేసమస్తంగా మిత్రరాజ్య సేనానికీ, సోవియట్ హైకమాండుకూ బేషరతుగా లొంగిపోతున్నవి. ౨. ఎనిమిదవ తేదీ అర్ధరాత్రి ౧౧-౦౧ గంటలకు భూమ్యాకాశ సముద్రరంగాలలో పోట్లాడుతున్న యావజ్జర్మను బలాలూ ఎక్కడివక్కడ యుద్ధచర్యలను విరమించి కూర్చుం

టాయి. ఆ సమయానికి అవి ఎక్కడెక్కడ ఏయే స్థలాలలో ఏయేరీతిగా ఉంటాయో అలాగే ఉండి పోవాలి. మరి కదలగూడదు; మెదలగూడదు. 3. మిత్రరాజ్య సర్వసేనాని ఏమైనా కొత్త ఉత్తరువులు జారీచేసే పక్షంలో వాటిని ఆయా నాజీసేనానులతో సంప్రతించి తక్షణమే ఆచరణలో పెట్టడానికి జర్మను హైకమాండు పూనుకొంటుంది. 4. జర్మనీపైనా, జర్మను సాయుధదళాలపైనా మిత్రరాజ్యాలు ఏమైనా కొత్త లొంగుబాటు షరతులు ప్రయోగించ దలచినట్లయితే ఈ ఒడంబడిక రద్దయి ఆ కొత్తషరతులు నిరాక్షేపణీయంగా అమలులోకి వస్తాయి. 5. జర్మనుసేనలలో ఏవైనాసరే ఈ షరతులకు మీరి నడచుకొన్నట్లయితే మిత్రసేనానిగాని, సోవియట్ హైకమాండుగాని వారికి అవసరమని తోచిన చర్య అభ్యంతరం లేకుండా తీసుకోవచ్చు.

ఈ ఆత్మసమర్పకమైన షరతులతో నాజీజర్మనీ మిత్రమండలికి దాసోహమ్మని పాదాక్రాంతమయి పోయింది.

అమోఘమైన ఈ విజయంతో మిత్రరాజ్యాల వారి ఆనందానికి మేర లేకపోయింది. విజయఢంకారాలు దిక్కులు పిక్కటిల్లేటట్లు మోగినవి; విజయోత్సవాలు విశ్వమంతటా వెల్లివిరిసిపోయినవి. ఈ ద్వితీయ ప్రపంచ సంగ్రామ చరిత్రలో ఈ విధంగా ఒక అధ్యాయం ముగిసిపోయింది.



నాజీల ద్రవ్యదాహం.

నాజీల ద్రవ్యదాహానికి ఈ చిత్రమొక నిదర్శనం. మెర్కెర్స్‌లోని ఒకానొక ఉప్పుగనిలో నాజీలు రహస్యంగా 100 టన్నుల బంగారాన్ని, 2,000,000,000 డాలర్ల మిత్రరాజ్యాల నాణెములనూ దాచి పెట్టుకొన్నారు. పాపిసొత్తు ఎన్నాళ్లు దాగుతుంది? అమెరికను సైనికాధికారులెలాగో ఈ రహస్యం కాస్తా కనిపెట్టినారు.



# విమర్శనము



## ఆత్మదర్శనము

గ్రంథకర్త: ఉభయభాషాప్రవీణ కొండూరు వీరరాఘవాచార్యులుగారు, సత్తెనపల్లి, గుంటూరు జిల్లా. క్రౌనుసైజు ౨౦౮ + ౮ + ౧౦ పుటలు. వెల రు. ౨—౮—౦.

ఆంధ్రమున తత్త్వశాస్త్రము, లేక దర్శనశాస్త్ర సంబంధములగు వచన గ్రంథములు చాల తక్కువ. ఉన్నవేవో అనువాదములు. స్వతంత్ర రచనలు లేనే లేవని చెప్పవచ్చును. ఇట్టి గ్రంథములను వ్రాయుటకు శాస్త్ర పాండిత్యమే కాక అంతరవలోకనముగూడ కావలసియున్నది. ఈ రెండును సమకూడినను భాషాపాకము భావ సిద్ధింపనిచో ప్రయోజనములేదు. ఈ మాటెని కూడగట్టుకొని రాగలిగిన వారింకను ఆంధ్రదేశమున ఉద్భవింపలేదా? ఉద్భవించినను తెర మరుగున నున్నారా? ఏమోకాని ఈ ఆత్మదర్శన గ్రంథకర్తయందు ప్రయోజనోద్దిష్టమగు అధికార సంపత్తి నిండి తొణుకాడుచున్నదని ఒకటి రెండు పుటలు తిరుగవేసినను తెలియగలదు.

ఈ "ఆత్మదర్శన" ప్రయోజనము అద్వైతాత్మ దర్శనము. గ్రంథమున ఉపక్రమణము, ప్రపంచము, నేను, ఆత్మ, ఆత్మస్వరూపము, నాకు గావలసినది, ఆత్మదర్శన ప్రయోజనము, సర్వాత్మభావము, బ్రహ్మాత్మైక్యావగతి, బ్రహ్మము - గుణ, సచ్చిదానంద జీవనము, ఉపసంహారము అను ప్రకరణములు కలవు. ఏ ప్రకరణమును దీసి చదివినను, తత్త్వశాస్త్రాభిరుచియున్నచో, ముగించువరకును విరమింపజాలము. గ్రంథకర్తయొక్క ఈకృతకృత్యతకు అభినందించుచు, ఇతోధికముగు గ్రంథపరంపరను తామరతంపరగా తెలుగుతల్లికి సమర్పింతురుగాక యని కోరుచున్నాను.

శ్రీ నిర్వికల్పానందస్వామి.

## సీతతో సినిమాకి

శ్రీ చందూరి నాగేశ్వరరావు, ప్రతిమా బుక్సు, ఏలూరు. పుటలు ౬౬ వెల ఎనిమిదణాలు.

ఇందులో ౮ రచన లున్నవి. వీటిలో ఆరు ఆలిండియా రేడియోలో విశ్రుతమైనవి. ఇవి కథలు కావు రూపకార్థంలో; కొన్ని సందర్భాల అన్వేక్షణను పురస్కరించుకొన్న అల్లిక లివి. పిల్లలు అంటే పసివారు కాదు—జ్ఞానం వచ్చిన పిల్లల చిత్తవృత్తి ప్రతిఫలిస్తున్నది. ఒకటి రెండింటిలో తప్ప. ఒక అరగంట చదువుకు హాయిగా ఉంది.

(గ్రంథస్వీకారము)

## హిందూ-పద్-పాదషాహి

ప్రథమఖండము. మూలము: శ్రీ వినాయక దామోదర సావర్కార్. అనువాదము: మరుపూరు కోదండరామరెడ్డిగారు. ప్రకాశకులు: సంస్కృతి గ్రంథమండలి, వంగల్ బిల్డింగ్సు, పెరంబూరు, మద్రాసు. వెల రెండున్నరరూపాయ.

## రేడియో

గ్రంథకర్త: వేపా వెంకటలక్ష్మణరావుగారు. అనువాదకులు: సత్తిరాజు సాంబశివరావు, చింతా సూర్యనారాయణమూర్తిగార్లు. ప్రాప్తిస్థానము: రిసైసాన్సు ప్రింటర్సు లిమిటెడ్, త్యాగరాయనగరము, మద్రాసు. వెల 3 రూపాయలు.

## కురుకూరి సుబ్బారావుగారి జీవితచరిత్రము

పద్యరచన. కర్త: పసుమర్తి యజ్ఞనారాయణ శాస్త్రిగారు. ముద్రణ: సరస్వతీ ముద్రణశాల, బెజవాడ. వెల ౧ రూపాయి.

## ఆంధ్రుల చరిత్ర

గ్రంథకర్త: ఖండవల్లి బాలేందుశేఖరంగారు, ప్రకాశకులు: ఆంధ్ర పబ్లిషింగ్ కంపెనీ, సుల్తాన్ బజారు, హైదరాబాదు. (దక్కను) వెల ౧ రూపాయ.

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.

